శ్రీ కాశీనాథ ప్రణీత

# లగ్న చంద్రిక



( ప్రామాణిక ఫలిత జ్యోతిష గ్రంథము )

జ్యోతిషవిశారద - వాస్తు సమ్రాట్

డా॥ ముదుండి విశ్వనాథరాజు



గవర్నర్ శ్రీ సుశీల్‌కుమార్ షిండే గారిచే
రవీంద్ర భారతి, హైదరాబాద్‌లో సన్మానము.
స్వర్ణ పథక ప్రదానము - 2005



జ్యోతిర్వాస్తు విజ్ఞాన సంస్థవారిచే సన్మానము.
తెలుగు విశ్వ విద్యాలయము, హైదరాబాద్ - 2011



శ్రీ కాశీనాథవిరచిత

# లగ్నచంద్రిక

అనువాదం


వాస్తు సమ్రాట్, జ్యోతిష విశారద

**డా॥ ముదుండి విశ్వనాథరాజు** Ph.D.

భాషాప్రవీణ

ఎం.ఏ. తెలుగు, హిందీ, సంస్కృతం, జ్యోతిషం (గోల్డ్‌మెడల్)





ప్రకాశకులు

**శ్రీ సాయి వాస్తు పబ్లికేషన్స్**

హైదరాబాదు – 500 052.

ఫోన్ : 9440945403

# ముందుమాట

వేదాంగములలో నేత్ర స్వరూపమైన జ్యోతిషము ప్రధానముగా మూడు అంగములుగా విభజించబడినది సిద్ధాంతము, సంహిత, హోర సిద్ధాంతము మరల మూడు భాగములుగా విభజించుబడినది సిద్ధాంతము, తంత్రము, కరణము. సృష్ట్యాది నుండి ఇష్టకాలము వరకు గణించు నియమములకు సంబంధించినది సిద్ధాంతము. కలియుగాది నుండి ఇష్ట దినముల వరకు గ్రహగణనచేసి నిరూపించునది తంత్రము. ఏదైన సిద్ధాంత గ్రంథమును ప్రమాణముగా తీసికొని ఇష్టదినముల వరకు గ్రహగణన చేయువిధానము కరణమగును.

సమస్త విషయముల సమాహారము సంహితగా తెలుపవచ్చును. దీనిలో కాలానుసారము గ్రహముల రాశి సంచారము ప్రాకృతిక విజ్ఞానము, శకునహస్తసాముద్రికాది అనేక విషయములు తెలుపబడును. జన్మకాలిక గ్రహ స్థితులననుసరించి భూత, భవిష్య వర్తమానకాలముల శుభాశుభ నిర్ణయము చేయునది హోరా శాస్త్రమగును. ఇది గ్రహ ఫలిత విభాగమునకు సంబంధించినది.

ఫలితజ్యోతిష గ్రంథములలో కాశీనాథ కృత 'లగ్నచంద్రిక' అధిక ప్రాచుర్యమును పొందినది. ముహూర్త చింతామణి పీయుషధారా వ్యాఖ్యానములో కాశీనాథుని నామము అనేక పర్యాయములు ఆదర పూర్వకముగా వ్యక్తీకరించబడినది. అందువలన దీనిని ముహూర్త చింతామణి కన్న పూర్వ గ్రంథముగా తలంప వచ్చును.

ఈ గ్రంథములో తొమ్మిది పరిచ్ఛేదములున్నవి. ప్రథమ పరిచ్ఛేదములో జన్మతిథి, వారనక్షత్ర కరణాది విషయములు, ద్వితీయములో గ్రహభావములు, తృతీయములో నవగ్రహముల మహాదశలు, చతుర్థములో రెండేసి గ్రహముల యుతి ఫలితములు, పంచమములో మూడేసి గ్రహముల ఫలితములు, షష్ఠమములో నాల్గేసి, సప్తమములో ఐదేసి, అష్టమములో ఆరేసి గ్రహముల సంయోగము వలన ఫలితములు, నవమ పరిచ్ఛేదములో అపూర్వ యోగముల గూర్చి వివరణ కలదు.

ఇంతటి మహిమ కలిగిన ఈ గ్రంథము ఇంతకు పూర్వము తెలుగులో అనువదింపబడలేదు. జ్యోతిష శాస్త్రాసక్తి కలిగిన పండితులకుపయోగపడునను తలంపుతో ఈ గ్రంథమునను వదించుట జరిగినది. నేను అనువదించిన ఇతర గ్రంథముల వలెనే దీనిని కూడ ఆదరింతురని తలంతును. దోషములున్న తెలియజేసిన మలిముద్రణలో సరిజేయ గలవాడను.

భవదీయుడు

**డా. ముదుండి విశ్వనాథరాజు**

# ప్రియ మిత్రులు



ఈ గ్రంథముతోపాటు మిగిలిన వాస్తు జ్యోతిష గ్రంథముల ముద్రణకు సహృదయముతో సహకరించిన ప్రియ మిత్రులు శ్రీ పెన్మెత్స గోపాలరాజు (వేంద్ర) శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు (చంటిరాజు, భీమవరం) లకు హృదయపూర్వక కృతజ్ఞతాభినందనలు తెలియజేయుచున్నాను.

మీ శ్రేయోభిలాషి
డా. ముదుండి విశ్వనాథరాజు

# లగ్నచంద్రిక

## ప్రథమ పరిచ్ఛేదము - 1

### మంగళాచరణము

**తమిస్రయా జగద్గ్రస్తం యో జీవయతి భూతలే**
**తం వన్దే పరమానన్దం సర్వసాక్షిణమీశ్వరమ్** 1

అంధకారముతో కూడిన జగత్తును (సూర్య రూపముగా) పాలనచేయువాడు, సర్వసాక్షి పరమానంద స్వరూపుడైన సూర్యదేవునకు నేను (కాశీనాథుడు) నమస్కారము చేయుదును.

**పన్నెండు భావముల సంజ్ఞలు :**

**తనుర్ధనం చ భ్రాతా చ సుహృత్పుత్రో రిపుః స్త్రియః**
**మృత్యుశ్చ ధర్మః కర్మాఽఽయో వ్యయో భావాః ప్రకీర్తితాః** 2

1. తనువు, 2. ధనము, 3. భ్రాత, 4. సుహృత్తు, 5. పుత్రుడు, 6. రిపు, 7. స్త్రీ, 8. మృత్యువు, 9. ధర్మము, 10. కర్మము, 11. ఆయము, 12. వ్యయము – ఈ పన్నెండు భావములుగా తెలుపబడినవి.

**మేషాది పన్నెండు రాశుల సంజ్ఞలు :**

**విషమేఽథ సమః పుంస్త్రీ క్రూరః సౌమ్యశ్చ నామతః**
**చరః స్థిరో ద్విస్వభావో మేషాద్యా రాశయః క్రమాత్** 3

మేషాది పన్నెండు రాశులు క్రమముగా విషమ, సమ, పురుష, స్త్రీ, క్రూర, సౌమ్య, చర, స్థిర ద్విస్వభావ నామములతో పిలువబడును.

**రాశి సంజ్ఞా చక్రము**

| రాశులు | విషమ–సమములు | పురుష–స్త్రీలు | క్రూర–సౌమ్యములు | చరాదులు |
|---|---|---|---|---|
| మేషము | విషమ | పురుష | క్రూర | చర |
| వృషభము | సమ | స్త్రీ | సౌమ్య | స్థిర |
| మిథునము | విషమ | పురుష | క్రూర | ద్విస్వభావ |
| కర్కాటకము | సమ | స్త్రీ | సౌమ్య | చర |
| సింహము | విషమ | పురుష | క్రూర | స్థిర |
| కన్య | సమ | స్త్రీ | సౌమ్య | ద్విస్వభావ |
| తుల | విషమ | పురుష | క్రూర | చర |

| | | | | |
|---|---|---|---|---|
| వృశ్చికము | సమ | స్త్రీ | సౌమ్య | స్థిర |
| ధనుస్సు | విషమ | పురుష | క్రూర | ద్విస్వభావ |
| మకరము | సమ | స్త్రీ | సౌమ్య | చర |
| కుంభము | విషమ | పురుష | క్రూర | స్థిర |
| మీనము | సమ | స్త్రీ | సౌమ్య | ద్విస్వభావ |

**ద్వాదశ భావసంజ్ఞలు :**

**దుశ్చిక్యం స్యాత్తృతీయం చ సుఖం సద్మ చతుర్థకమ్**
**బన్ధుసంజ్ఞం చ పాతాలం హిబుకం పఞ్చమం చ ధీః** **4**
**ద్యూనం ద్యునమథాస్తం చ యామిత్రం సప్తమ స్మృతమ్**
**దశమం త్వమ్బరం మధ్యం ఛిద్రం స్యాదష్టమం గృహమ్** **5**
**ఏకాదశం భవేల్లాభః సర్వతో భద్రమేవ చ**
**వ్యయో రిష్ఫం ద్వాదశం చ త్రికోణం నవపఞ్చమే** **6**
**త్రిషష్ఠదశలాభానాం భవేదుపచయాఖ్యకమ్**
**చతుర్థాష్టమయోః సంజ్ఞాం చతురస్రం స్మృతా బుధైః** **7**
**కేన్ద్రచతుష్టయ కణ్టసంజ్ఞాఽద్య చతుర్థసప్తమ దశమానామ్**
**పరతః పణఫరమాపోక్లిమం చ వేద్యం యథాక్రమతః** **8**

మూడవ గృహమును దుశ్చిక్యము, నాల్గవ గృహమును సుఖము, సద్మము, బంధు, పాతాలము హిబుకము, ఐదవ గృహమును ధీ; (బుద్ధి) ఏడవ గృహమును ద్యూన, ద్యున, అస్త యామిత్రము; పదకొండవ గృహమును లాభము, సర్వతో భద్రము; పన్నెండవ గృహమును వ్యయము, రిష్ఫము; తొమ్మిది ఐదవ గృహములను త్రికోణము; మూడవ, ఆరవ, పదవ, పదకొండవ గృహములను ఉపచయము; నాలుగవ ఎనిమిదవ గృహములను చతురస్రము; ఒకటవ, నాల్గవ, ఏడవ పదవ గృహములను కేంద్ర చతుష్టయము, కంటకము, రెండవ, ఐదవ, ఎనిమిదవ, పదకొండవ గృహములను పణఫరము, మూడవ, ఆరవ, తొమ్మిదవ పన్నెండవ గృహములను ఆపోక్లీమములని తెలిపెదరు.

## భావ సంజ్ఞా చక్రము

| భావము | సంజ్ఞ | భావము | సంజ్ఞ |
|---|---|---|---|
| 1 | తను | 10 | కర్మ, అంబర, మధ్యములు |
| 2 | ధన | 11 | ఆయ,లాభ,సర్వతోభద్రములు |

| | | | |
|---|---|---|---|
| 3 | భ్రాత, దుశ్చిక్యము | 12 | వ్యయ, రిష్ఫములు |
| 4 | సుహృత్, సుఖ, సద్మ, బందు, పాతాల హిబుక | 5,9 | త్రికోణము |
| 5 | పుత్ర, ధీ | 4,8 | చతురస్రము |
| 6 | రిపు | 3,6,10,11 | ఉపచయములు |
| 7 | స్త్రీ, ద్యూన, ద్యున, అస్త, యామిత్ర | 1,4,7,10 | కేంద్రచతుష్టయ, కంటకములు |
| 8 | మృత్యు, ఛిద | 2,5,8,11 | పణఫర |
| 9 | ధర్మ | 3,6,9,12 | ఆపోక్లీమములు |

## వర్గోత్తమనవాంశము, హోర

**వర్గోత్తమ నవమాంశాశ్చరాదిషు ప్రథమ మధ్యాన్త్యాః**
**హోరా విషమేஉర్కేన్ద్వోః సమరాశౌ చన్ద్ర సూర్యయోః క్రమతః** **9**

చరస్థిర ద్విస్వభావ రాశులలో క్రమముగా ప్రథమ, మధ్యమ, అంత్య నవాంశలను (అనగా ఒకటవ, ఐదవ, తొమ్మిదవ) వర్గోత్తమ నవాంశలందురు. విషమరాశులలో మొదట సూర్యహోర తర్వాత చంద్రహోర వచ్చును. సమరాశులలో మొదట చంద్ర హోర తర్వాత సూర్య హోర వచ్చును.

## వర్గోత్తమ నవాంశ చక్రము

| రాశి | మే | వృ | మి | క | సిం | కన్య | తు | వృశ్చి | ధ | మ | కుం | మీనం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| వర్గోత్తమనవాంశ | 1 | 5 | 9 | 1 | 5 | 9 | 1 | 5 | 9 | 1 | 5 | 9 |

## హోరా చక్రము

| రాశి | మే | వృ | మి | క | సిం | కన్య | తు | వృశ్చి | ధ | మ | కుం | మీనం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ప్రథమహోర | సూర్య | చంద్ర | సూర్య | చంద్ర | సూర్య | చంద్ర | సూర్య | చంద్ర | సూర్య | చంద్ర | సూర్య | చంద్ర |
| ద్వితీయహోర | చంద్ర | సూర్య | చంద్ర | సూర్య | చంద్ర | సూర్య | చంద్ర | సూర్య | చంద్ర | సూర్య | చంద్ర | సూర్య |

**ద్వాదశాంశ, ద్రేష్కాణ, పృష్ఠోదయాది సంజ్ఞక లగ్నము.**
**స్వగృహాద్ ద్వాదశభాగా ద్రేష్కాణాః ప్రథమ పఞ్చమనవమానామ్**
**మేషాద్యాశ్చత్వారః సధన్విమకరాః క్షపాబలా జ్ఞేయాః**
**పృష్ఠోదయా విమిథునాః శిరసాన్యేహ్యు భయతో మీనః** **10**

ద్వాదశాంశము తన రాశితో ఆరంభమగును. ద్రేష్కాణము మొదటి పది అంశముల వరకు తనరాశితో తర్వాతి 10 అంశములు పంచమ రాశితో తర్వాతి పది అంశములు నవమ రాశితో ప్రారంభమగును. మేష, వృషభ, మిథున, కర్కాటక, ధను, మకర రాశులు రాత్రిలో బలమైనవగును మిథునమును వదిలి మిగిలిన ఐదు రాశులు వెనుక (వీపు) భాగము నుండి ఉదయించును. మిగిలినవి శిరోభాగము నుండి ఉదయించును మీన రాశి శిరము, పీఠము (వీపు) ఈ రెండింటి నుండి ఉదయమగును.

## ద్వాదశాంశ చక్రము

| అంశము | మే | వృ | మి | క | సిం | కన్య | తు | వృశ్చి | ధ | మ | కుం | మీనం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 2-30 | మే | వృ | మి | క | సిం | కన్య | తు | వృశ్చి | ధ | మ | కుం | మీనం |
| 5 | వృ | మి | క | సిం | కన్య | తు | వృశ్చి | ధ | మ | కుం | మీ | మే |
| 7-30 | మి | క | సిం | కన్య | తు | వృశ్చి | ధ | మ | కుం | మ | మే | వృ |
| 10 | క | సిం | కన్య | తు | వృశ్చి | ధ | మ | కుం | మీ | మే | వృ | మి |
| 12-30 | సిం | కన్య | తుల | వృశ్చి | ధ | మ | కుం | మ | మే | వృ | మి | క |
| 15 | కన్య | తు | వృశ్చి | ధ | మ | కుం | మీ | కు | మృ | మి | క | సిం |
| 17-30 | తు | వృశ్చి | ధ | మ | కుం | మీ | కు | వృ | మి | క | సిం | కన్య |
| 20 | వృశ్చి | ధను | మ | కుం | మీ | మే | వృ | మి | క | సిం | కన్య | తు |
| 22-30 | ధను | మ | కుం | మీ | మే | వృ | మి | క | సిం | కన్య | తు | వృశ్చి |
| 25 | మ | కుం | మీ | మే | వృ | మి | క | సిం | కన్య | తు | వృశ్చి | ధ |
| 27-30 | కుం | మీ | మే | వృ | మి | క | సిం | కన్య | తు | వృశ్చి | ధ | మ |
| 30 | మీ | మే | వృ | మి | క | సిం | కన్య | తు | వృశ్చి | ధ | మ | కుం |

## ద్రేష్కాణ చక్రము

| రాశి | మే | వృ | మి | క | సిం | కన్య | తు | వృశ్చి | ధ | మ | కుం | మీనం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రాశి<br>అంశము | మే<br>10 | వృ<br>10 | మి<br>10 | క<br>10 | సిం<br>10 | కన్య<br>10 | తు<br>10 | వృశ్చి<br>10 | ధ<br>10 | మ<br>10 | కుం<br>10 | మీనం<br>10 |
| రాశి<br>అంశము | సిం<br>20 | కన్య<br>20 | తు<br>20 | వృ<br>20 | ధ<br>20 | మ<br>20 | కుం<br>20 | మీ<br>20 | మే<br>20 | వృ<br>20 | మి<br>20 | క<br>20 |
| రాశి<br>అంశము | ధ<br>30 | మ<br>30 | కుం<br>30 | మీ<br>30 | మే<br>30 | వృ<br>30 | మి<br>30 | క<br>30 | సిం<br>30 | కన్య<br>30 | తుల<br>30 | వృశ్చి<br>30 |

**పాపగ్రహములు - హోరావిచారము**

**క్షీణచన్ద్రో రవిర్భౌమః పాపోరాహుః శనిఃశిఖీ**
**బుధోఽపి తైర్యుతః పాపో హోరా రాశ్యర్ధముచ్యతే** 11

క్షీణచంద్రుడు, రవి, కుజుడు, రాహు, శని, కేతువుల పాపగ్రహములు. వీటితో కూడియున్న బుధుడు పాపగ్రహమగును. హోర రాశిలో సగమని తెలిపెదరు.

**స్వరాశి-శత్రు మిత్ర విచారము**

**స్వే-న్దు-భౌమ-గురవో జ్ఞ-రాహు-శని-భార్గవాః**
**స్వస్మిన్మిత్రాణి చత్వారి పరస్మిఞ్ఛత్రవః స్మృతాః** 12

సూర్య, చంద్ర, కుజ, గురులు తమరాశులలో మిత్రులు బుధ, రాహు, శని, శుక్రులు ఇతరరాశులలో శత్రువులు.

| గ్రహములు | - | రాశులు |
|---|---|---|
| రవి | - | సింహము |
| చంద్రుడు | - | కర్కాటకము |
| కుజుడు | - | మేషము, వృశ్చికము |
| బుధుడు | - | మిథునము, కన్య |
| గురుడు | - | ధనుస్సు, మీనము |
| శుక్రుడు | - | వృషభము, వృశ్చికము |
| శని | - | మకరము, కుంభము |

**గ్రహముల ఉచ్ఛనీచ విచారము**

**మేషే రవిర్వృషే చన్ద్రో మకరే చ మహీసుతః**
**కన్యాయాం రోహిణీపుత్రో గురుః కర్కే ఝషే భృగుః** 13
**శనిస్తులాయాముచ్ఛశ్చ మిథునే సింహికాసుతః**
**ఉచ్చాత్సప్తమగా నీచా రాశౌ వాపి నవాంశకే** 14

మేషరాశిలో సూర్యుడు, వృషభములో చంద్రుడు, మకరములో కుజుడు, కన్యలో బుధుడు, కర్కాటకములో గురుడు, మీనములో శుక్రుడు, తులలో శని, మిథునములో రాహువు ఉచ్ఛస్థితిని పొందును. ఉచ్ఛరాశికి సప్తమరాశిలోనున్న గ్రహము నీచను పొందును. రాశి నవాంశము రెండింటిలో ఇదే క్రమములో నుండును.

| గ్రహములు | - | ఉచ్ఛనీచరాశులు | | |
|---|---|---|---|---|
| గ్రహము | - | ఉచ్ఛరాశి | - | నీచరాశి |
| రవి | - | మేషము | - | తుల |
| చంద్రుడు | - | వృషభము | - | వృశ్చికము |

| | | | | |
|---|---|---|---|---|
| కుజుడు | – | మకరము | – | కర్కాటకము |
| బుధుడు | – | కన్య | – | మీనము |
| గురుడు | – | కర్కాటకము | – | మకరము |
| శుక్రుడు | – | మీనము | – | కన్య |
| శని | – | తుల | – | మేషము |
| రాహువు | – | మిథునము | – | ధనుస్సు |
| కేతువు | – | ధనుస్సు | – | మిథునము |

**శుభాశుభయోగము**

**అర్థీభోగీ ధనీ నేతా జాయతే మణ్డలాధిపః**
**నృపతిశ్చక్రవర్తీ చ రవ్యాద్యైరుచ్చగైర్గ్రహైః** **15**

సూర్యాది గ్రహములు ఉచ్చరాశిలోనున్న ఫలితములు క్రింది విధముగానుండును రవి–ద్రవ్యము, చంద్రుడు–భోగము, కుజుడు–ధనమునిచ్చును, బుధుడు–నేత, గురుడు–మండలమునకు రాజు, శుక్రుడు–దేశమునకు రాజు–శని–చక్రవర్తి యగును.

**త్రిభిః స్వస్థైర్భవేన్మన్త్రీ త్రిభిరుచ్చైర్నరాధిపః**
**త్రిభిర్నీ చైర్భవేద్దాసస్త్రిభి రస్తఙ్గతైర్జడః** **16**

మూడ గ్రహములు బలముగానున్న జాతకుడు మంత్రి, మూడు గ్రహములు ఉచ్చలోనున్న రాజుయగును. మూడు గ్రహములు నీచలోనున్న దాసుడు మూడు గ్రహములు అస్తమయములోనున్న జడుడగును (ముర్ఖుడు).

**బలమైన గ్రహము**

**ఉదితః స్వగృహస్థశ్చ మిత్రగేహే స్థితోఽ పి వా**
**మిత్రవర్గే మిత్ర దృష్టః స గ్రహః సబలః స్మృతః** **17**

గ్రహముదయమైన లేక స్వగృహములోనున్న, మిత్ర గృహములో నున్న మిత్ర వర్గములోనున్న మిత్ర గ్రహము ద్వారా చూడబడిన బలమైనదగును.

**బలమైన లగ్నము**

**స్వామినా బలినా దృష్టః సబలైశ్చ శుభగ్రహైః**
**న దృష్టో న యుతః పాపైః స లగ్నః సబలః స్మృతః** **18**

లగ్నము తనస్వామి ద్వార చూడబడుచున్న, బలమైన శుభ గ్రహముతో చూడబడుచున్న. పాప గ్రహముల దృష్టి లేకున్న, పాప గ్రహముతో కూడియుండకున్న బలమైనదగును.

**పురుష – రాజయోగము**

**దశమే బుధసూర్యౌ చ భౌమరాహూ చ షష్ఠగౌ**
**రాజయోగేఽత్ర యో జాతః స పుమాన్నాయకో భవేత్** **19**

పదవ గృహములో బుధ సూర్యులున్న, ఆరవ గృహములో కుజ రాహువులున్న రాజ యోగమగును. ఈ సమయములో జన్మించిన పురుషుడు నాయకుడగును.

**ఆదౌజీవః శనిశ్చాన్తే గ్రహా మధ్యేనిరన్తరమ్**
**రాజయోగం విజానీయాత్కుటుమ్బ బలసంయుతః** **20**

మొదటి గృహములో గురువు చివరి గృహములో శనేశ్వరుడు మధ్యలో మిగిలిన గ్రహములున్న కుటుంబ బలయుక్తముగా రాజయోగముగా భావించవలెను.

**సహజస్థో యదా జీవో మృత్యుస్థానే స్థితః సితః**
**నిరన్తరంగ్రహా మధ్యేరాజా భవతి నిశ్చితమ్** **21**

మూడవ స్థానములో గురుడు, ఎనిమిదవ స్థానములో శుక్రుడు, మధ్యలో నిరంతరముగా గ్రహములున్న జాతకుడు రాజగుట నిశ్చయము.

**జీవో వృషే సుధారశ్మిర్మిథునే మకరేకుజః**
**సింహే భవతి సౌరిశ్చ కన్యాయాం బుధభాస్కరౌ** **22**
**తులాయామసురాచార్యో రాజయోగో భవేదయమ్**
**అస్మిన్యోగే సముత్పన్నో మహారాజో భవేన్నరః** **23**
**అష్టమే ద్వాదశే వర్షే యది జీవతి మానవః**
**సార్వభౌమస్తదా రాజా జాయతే విశ్వపాలకః** **24**

వృషభ రాశిలో గురుడు, మిథునములో చంద్రుడు, మకరములో కుజుడు, సింహములో శని, కన్యలో బుధుడు సూర్యుడు, తులలో శుక్రుడున్న రాజ యోగము కలుగును. ఈ యోగములో పుట్టిన పురుషుడు మహారాజగును. ఈ మనుష్యుడు ఎనిమిది లేక పన్నెండు వర్షముల వరకు జీవించిన ఈ విశ్వమును పాలించు సార్వభౌముడగును.

**ఏకోజీవో యదా లగ్నే సర్వే యోగాస్తదా శుభాః**
**దీర్ఘజీవీ మహాప్రాజ్ఞో జాతకో నాయకో భావేత్** **25**

గురుడు ఒంటరిగా లగ్నములోనున్న సర్వయోగములు శుభదాయకమగును. అటువంటిపురుషుడు దీర్ఘజీవి, అత్యంత బుద్ధిమంతుడు నాయకుడగును.

**ధనే శుక్రశ్చ భౌమశ్చ మీనే జీవస్తులే బుధః**
**నీచస్థో శనిచన్ద్రౌ చ రాజయోగో విధీయతే** **26**

**అస్మిన్యోగే చ జాతే చ స రాజా ధనవర్జితః**
**దాతా భోక్తా చ విఖ్యాతో మాన్యో మణ్డలనాయకః 27**

ధన భావములో శుక్రుడు, కుజుడు, మీనరాశిలో గురుడు, తులలో బుధుడు, నీచలో శని చంద్రులున్న రాజయోగమగును. ఈ యోగములో జన్మించిన రాజు ధనరహితుడు, భోగవంతుడు ప్రసిద్ధుడు, గౌరవనీయుడైన మండల నాయకుడగును.

**మీనేశుక్రో బుధశ్చాన్యే ధనే రాహుస్తనౌ రవిః**
**సహజే చ భవేద్ భౌమౌ రాజయోగో విధీయతే 28**

మీనరాశిలో శుక్రుడు, పన్నెండవ రాశిలో బుధడు, ధన భావములో రాహువు, లగ్నములో సూర్యుడు, మూడవ స్థానములో కుజుడున్న రాజ యోగమగును.

**సహజే చ యదా జీవో లాభస్థానే చ చన్ద్రమాః**
**స రాజా గృహమధ్యస్థో విఖ్యాతః కులదీపకః 29**

మూడవ స్థానములో గురుడు, లాభస్థానములో చంద్రుడున్న రాజు గృహములో నున్నప్పటికి విఖ్యాతుడు కులదీపకుడగును.

**శుభగ్రహాః శుభక్షేత్రే భవన్తి యది కేన్ద్రగాః**
**తదా శుభాని కర్మాణి కరోత్యేవ హి జాతకః 30**

శుభగ్రహములు శుభ గ్రహ క్షేత్రములలో కేంద్రములలోనున్న యోగములో ఉత్పన్నమైన పురుషుడు శుభకర్మలను చేయును.

**ఉచ్చస్థానగతాః సౌమ్యాః కేన్ద్రేషు చ భవన్తిచేత్**
**ధ్రువం రాజ్యం భవేత్తస్య వంశానాం చైవ పోషకః 31**

శుభగ్రహములు ఉచ్చ స్థానము లేక కేంద్ర స్థానములలో నున్న జాతకుడు నిశ్చయముగా రాజగును. వంశమును పాలించును.

**ధనేవ్యయే తథా లగ్నే సప్తమే చ యదాగ్రహాః**
**ఛత్ర యోగస్తదా జ్ఞేయః స్వవంశే నాయకో భవేత్ 32**

ధనభావము, ద్వాదశ భావము లగ్నము సప్తమ భావములో గ్రహములున్న ఛత్ర యోగమని తెలిసికొనవలెను. ఆ యోగములో ఉత్పన్నమైన పురుషుడు తనవంశములో శ్రేష్ఠుడగును.

**స్వక్షేత్రస్థో యదా జీవో బుధః సౌరిః స్వరాశిగః**
**అత్ర జాతస్య దీర్ఘాయుః సమ్పదశ్చ భవన్తి హి 33**

గురుడు తన స్థానములోన్న, బుధుడు శని తమతమ రాశులలోనున్న జాతకుడు దీర్ఘాయువు సంపత్తి కలిగి యుండును.

**మీనే బృహస్పతిః శుక్రశ్చమాశ్చ యదా భవేత్**
**తత్ర జాతస్య రాజ్యం స్యాన్ద్రత్పత్నీ చ బహుపుత్రిణీ** **34**

మీన రాశిలో గురుడు, శుక్రుడు, చంద్రులున్న జాతకుడు రాజ్యమును బహుపుత్రులతో కూడిన భార్యను కలిగియుండును.

**పఞ్చమస్థో యదా జీవో దశమస్థశ్చ చన్ద్రమాః**
**రాజ్యవాన్ స మహాబుద్ధిస్తపస్వీ చ జితేన్ద్రియః** **35**

పంచమ స్థానములో గురుడు దశమములో చంద్రుడున్న జాతకుడు రాజ్యము కలిగినవాడు బుద్ధిమంతుడు తపస్వి జితేంద్రియుడగును.

**సింహే జీవస్తులా-కీట-కోదణ్డ-మకరేషుచ**
**గ్రహా యదాతదా జాతో దేశభోగీ భవేన్నరః** **36**

సింహరాశిలో గురుడు, తుల, కర్కాటక, ధను, మకర రాశులలో మిగిలిన గ్రహములున్న జాతకుడు దేశమునకు రాజగును.

**తులా-కోదణ్డ-మీనస్థో లగ్నగః స్వాచ్ఛనేశ్చరః**
**కరోతి భూపతేర్జన్మ త్వన్యరాశౌ గతాయుషమ్** **37**

తుల, ధను, మీన రాశులలో లగ్నస్థితుడై శనియున్న జాతకుడు రాజగును. అన్యరాశి లగ్నములో శనియున్న జాతకుని ఆయువు క్షీణించున.

**విద్యాస్థానే యదాసౌమ్యః కర్మస్థానే చ చన్ద్రమాః**
**ధర్మస్థానే యదా సౌమ్యా రాజయోగః స ఉచ్యతే** **38**

పంచమ స్థానములో బుధుడు, పదవ స్థానములో చంద్రుడు నవమ స్థానములో శుభగ్రహములున్న రాజయోగమని తెలుపబడును.

**మకరే చ ఘటేమీనే వృషే మిధునమేషయోః**
**గ్రహాస్తదాత్ర విఖ్యాతో రాజా భవతి మానవః** **39**

మకర, కుంభ, మీన, వృషభ, మిథున, మేష స్థానములలో గ్రహములున్న జాతకుడు ప్రసిద్ధుడైన రాజగును.

**బుధభార్గవ జీవార్కియుక్తో రాహు రాహుశ్చష్టమే**
**కురుతే కమలారోఽగ్యం పుత్రిం మానాదికం ఫలమ్** **40**

బుధ, శుక్ర, గురు, శని. ఈ నాలుగు గ్రహములు రాహువుతో కూడి కేంద్రములోనున్న లక్ష్మీప్రాప్తి, ఆరోగ్యము పుత్రులు గౌరవము లభించును.

**చతుర్థే భవనే శుక్రో గురుశ్చన్ద్రో ధరాసుతః**
**రవిసౌరియతః సన్తి రాజా భవతి నిశ్చితమ్** **41**

నాల్గవ స్థానములో శుక్రుడు, గురుడు, చంద్రుడు, కుజుడు, సూర్యుడు, శని గ్రహములున్న నిశ్చయముగా రాజగును.

**అష్టమే చ వ్యయే క్రూరో మధ్యగౌ క్రూరసౌమ్యకౌ**
**రాజయోగేఽత్ర యో జాతశ్చత్వారింశత్స జీవతి** 42

ఎనిమిది, పన్నెండవ భావములలో క్రూర గ్రహములు మధ్యభావములో శుభ పాప గ్రహములున్న రాజయోగమగును. ఈ యోగములో ఉత్పన్నమైన పురుషుడు నలుబది వర్షములు జీవించును.

**లగ్నే సౌరిస్తథా చన్ద్రస్త్రికోణే జీవభాస్కరౌ**
**కర్మస్థానే భవేద్ భౌమో రాజయోగో విధీయతే** 43

లగ్నములో శని, చంద్రుడు త్రికోణములో (ఐదు, తొమ్మిది భావములు) గురుడు సూర్యుడు పదవస్థానములో కుజుడున్న రాజయోగమగును.

**నవమే చ యదా సూర్యః స్వగృహస్థో భవేద్యదా**
**తస్యజీవతి న భ్రాతా స్యాదేకోఽపి నృపైః సమః** 44

నవమ గృహములో సూర్యుడు తన రాశిలోనున్న జాతకుని సోదరుడు జీవించడు ఒకడైన సోదరుడు జీవించియున్న అతడు రాజుతో సమానుడగును.

**ద్విత్రితుర్యసుతే షష్ఠే కర్మణ్యపి యదా గ్రహాః**
**రాజయోగం విజానీయాజ్జాతస్తత్ర నృపో భవేత్** 45

రెండు, మూడు, నాలుగు, ఐదు, ఆరు పదవ గృహములలో గ్రహములున్న రాజయోగమగును. ఈ రాజ యోగములో ఉత్పన్నమైన పురుషుడు రాజగును.

**లగ్నే క్రూరే వ్యయే సౌమ్యో ధనే క్రూరశ్చజాయతే**
**రాజయోగో న రాజా చ దాతా దారిద్ర్యభాక్ సదా** 46

లగ్నములో క్రూర గ్రహములు, పన్నెండవ స్థానములో శుభగ్రహములు రెండవ స్థానములో క్రూర గ్రహములున్న ఇది రాజయోగమేయగును కాని ఈ యోగములో రాజు కాకుండ దాతయగును ఎల్లప్పుడు దరిద్రముననుభవించును.

**లగ్నే క్రూరో ధనే సౌమ్యో యదా వై జాతకో భవేత్**
**సప్తమే భవనే క్రూరః పరివారక్షయఙ్కరః** 47

లగ్నములో క్రూర గ్రహములు, ద్వితీయములో శుభ గ్రహములు సప్తమములో క్రూర గ్రహములున్న జాతకుడు పరివారమును నాశనమును చేయును.

**ధనే చన్ద్రశ్చ సౌమ్యశ్చ మేషే జీవోయదా భవేత్**
**దశమే రాహు శుక్రౌ చ రాజయోగో విధీయతే** 48

రెండవ స్థానములో చంద్రుడు బుధుడు మేష రాశిలో బృహస్పతి పదవ స్థానములో రాహు శుక్రులున్న రాజయోగమగును.

**సింహే జీవోఽథ కన్యాయాం భార్గవో మిథునే శనిః**
**స్వక్షేత్రే హిబుకే భౌమః స పుమాన్నాయకో భవేత్ 49**

సింహ రాశిలో గురుడు కన్యారాశిలో శుక్రుడు, మిథున రాశిలో శని స్వక్షేత్రములో నాల్గవ స్థానములో కుజుడున్న జాతకుడు నాయకుడగును.

**శనిచన్ద్రౌ చ కన్యాయాం సింహే జీవో ఘటేతమః**
**మకరే చ కుజస్తత్ర జాతః స్యాద్విశ్వపాలకః 50**

కన్యారాశిలో శని, చంద్రుడు, సింహ రాశిలో గురుడు, కుంభరాశిలో రాహువు, మకరములో కుజుడున్న జాతకుడు జగమును పాలించువాడగును.

**శుక్రో జీవో రవిర్భౌమశ్చాపే మకర కుమ్భయోః**
**మీనే చ వత్సరే త్రింశే జాతః స్యాత్ సర్వకర్మకృత్ 51**

ధనూ రాశిలో శుక్రుడు, మకర రాశిలో గురుడు, కుంభ రాశిలో సూర్యుడు మీనరాశిలో కుజుడున్న జాతకుడు ముప్పది సంవత్సరములలో సంపూర్ణ కర్మలకు కర్తయగును.

**చతుర్ను కేన్ద్రస్థానేషు సౌమ్యపాప గ్రహస్థితిః**
**చతుః సాగర యోగోఽయం రాజ్యదో ధనదో భవేత్ 52**

నాలుగు కేంద్రస్థానములలో (1, 4, 7, 10) శుభగ్రహములు, పాప గ్రహములున్న దీనిని చతుస్సాగర యోగమని యందురు. ఈ యోగము రాజ్యము ధనములనిచ్చును.

**కర్కలగ్నే జీవయుక్తే లాభే చన్ద్రజ్ఞ భార్గవాః**
**మేషే భానౌ చ యో జాతః సరాజా విశ్వపాలకః 53**

కర్కాటక లగ్నములో గురుడు, ద్వాదశ స్థానములో చంద్రుడు, బుధుడు, శుక్రుడు మేషరాశిలో సూర్యుడున్నపుడు ఉత్పన్నమైన జాతకుడు విశ్వపాలకుడైన రాజగును.

**కర్మస్థానే యదా జీవో బుధః శుక్రస్తథాశశీ**
**సర్వకర్మణి సిద్ధ్యన్తి రాజమాన్యో భవేన్నరః 54**

పదవ స్థానములో గురుడు బుధుడు, శుక్రుడు, చంద్రుడున్న పురుషునకు సంపూర్ణముగా కార్యములు సిద్ధించును. రాజులలో పూజ్యుడగును.

**షష్ఠేష్టమే పఞ్చమే చ నవమే ద్వాదశే తథా**
**సౌమ్య క్రూర గ్రహైర్యోగే రాజమాన్యః సకష్టకః 55**

ఆరు, ఎనిమిది, ఐదు, తొమ్మిది, పన్నెండవ భావములలో శుభ గ్రహములు క్రూర గ్రహములున్న జాతకుడు రాజులలో పూజ్యుడగును కాని కష్టములతో జీవనము సాగును.

**పఞ్చమే చ యదాషష్ఠే చాష్టమే నవమే క్రమాత్**
**భౌమరాహు సితార్కాః స్యుర్జాతోఽత్ర కులదీపకః** 56

పంచమములో కుజుడు, షష్ఠములో రాహువు అష్టమములో శుక్రుడు నవమములో రవియున్న జాతకుడు కులదీపకుడగును.

**లగ్నే సౌరిస్తథా చన్ద్రశ్చాష్టమే భార్గవో యదా**
**జాయతే చ తదా రాజా మానీ పత్నీరతః సదా** 57

లగ్నములో శని, చంద్రులు, అష్టమములో శక్రుడున్న పురుషుడు అభిమానవంతుడు సదా స్త్రీరతుడగు రాజగును.

**మిథునస్థో యదారాహుః సింహస్థో భూమినన్దనః**
**అత్ర జాతః పితృర్ద్రవ్యం ప్రాప్నోతి సకలం నృపః** 58

మిథున రాశిలో రాహువు, సింహములో కుజుడున్న జాతకుడు తండ్రి సంపదను సంపూర్ణముగా అనుభవించును, రాజగును.

**చాపార్ధే శశినా యుక్తో యది సూర్యః ప్రజాయతే**
**లగ్నే చ సబలో మన్దో మకరే చ కుజో భవేత్** 59
**అత్రి యోగే సముత్పన్నో మహారాజో భవేన్నరః**
**దూరాదేవ నమన్త్యస్య ప్రతాపైశ్చరణం నృపాః** 60

ధనురాశి సగములో చంద్రయుక్త సూర్యుడు, లగ్నములో బలవంతుడైన శని మకర రాశిలో కుజుడున్న యోగములో ఉత్పన్నమైన పురుషుడు మహారాజగును. ఇతని ప్రతాపము వలన దూరము నుండియే ఇతర రాజుల శిరములు చరణములపై నుంచి నమస్కరించును.

**ఉచ్చాభిలాషీ సవితా త్రికోణస్థో యదా భవేత్**
**అపి నీచకులే జాతో రాజా స్యాద్ధనపూరితః** 61

ఉచ్చరాశిస్థ సూర్యుడు త్రికోణములో (5,9) నున్న పురుషుడు నీచ కులములో ఉత్పన్నమైనను ధనము వలన పరిపూర్ణమైన రాజగును.

**ఏకాదశే యదా సర్వేగ్రహాః స్యుర్దశమేఽపివా**
**విలగ్నే సమ్ముఖే వాపి కారకః పరికీర్తితః** 62
**ఉత్పన్నః కారకే యోగే నీచోఽపి నృపతాం వ్రజేత్**
**రాజవంశసముత్పన్నో రాజా తత్ర న సంశయః** 63

ఏకాదశ, దశమ, లగ్న, సప్తమ భావములలో సంపూర్ణ గ్రహములున్న కారక యోగమగును. ఈ యోగములో ఉత్పన్నమైన పురుషుడు నీచుడైనను రాజ్యమును పొందును. రాజ వంశములో ఉత్పన్నమైన నిస్సందేహముగా రాజగును.

**లగ్నతశ్చాన్యతో వాపి క్రమేణ పతితా గ్రహాః**
**ఏకావతీ సమాఖ్యాతా మహారాజో భవేన్నరః 64**

లగ్నము నుండి క్రమముగా మిగిలిన గృహములలో ఖాళీ లేకుండ గ్రహములున్న ఏకావలీ నామక యోగమగును. దీనిలో ఉత్పన్నమైన పురుషుడు మహారాజగును.

**ధనస్థానే యదా శుక్రో దశమే చ బృహస్పతిః**
**షష్ఠే చ సింహికాపుత్రో రాజాభవతి విక్రమే 65**

ధన స్థానములో శుక్రుడు, దశమములో గురుడు, షష్ఠమములో రాహువున్న జాతకుడు పరక్రమవంతుడైన రాజగును.

(ఇతర గ్రంథములలో ఈ పాఠమున్నది "షష్ఠేஉష్టమే సింహికాజో రాజాభవతి విక్రమాత్).

**చతుర్గ్రహాః ఏకమతాః పాపాః సౌమ్యా భవన్తిచేత్**
**భ్రాతృధీ ధర్మలగ్నార్థే రాజయోగో భవేదయమ్ 66**

నాలుగు పాప గ్రహములు లేక శుభ గ్రహములు, మూడవ, ఐదవ, తొమ్మిదవ లగ్న, రెండవ స్థానములలో ఏదో ఒక స్థానములో కలిసి యున్న రాజయోగమగును.

**త్రికోణ సప్తమే లగ్నే భవన్తి చ యదా గ్రహాః**
**హంసయోగం విజానీయాత్ స్వవంశస్యాత్రపాలకః 67**

తొమ్మిది, ఐదు, ఏడవ భావములలోలగ్నములో అన్ని గ్రహములున్న హంసయోగమగును. ఈ యోగములో ఉత్పన్నమైన వ్యక్తి వంశమును పాలించును.

**సర్వగ్రహైర్యదా చన్ద్రో వినాలిం చ నిరీక్షితః**
**షష్ఠేష్టమే చ యామిత్రే స దీర్ఘాయుర్ధరాపతిః 68**

వృశ్చిక రాశిని వదిలి మిగిలిన రాశులలో చంద్రుడు ఆరు, ఎనిమిది ఏడవ గృహములలోనున్న మరియు అన్ని గ్రహములతో చూడబడుతున్నపుడుత్పన్నమైన జాతకుడు అధిక ఆయువు కలిగిన రాజగును.

**షష్ఠేஉష్టమే ద్వాదశే చ ద్వితీయే చ యదాగ్రహాః**
**సింహాసనాఖ్యయోగేஉస్మిన్ రాజసింహాసనే భవేత్ 69**

ఆరు, ఎనిమిది, రెండు, పన్నెండవ భావములలో గ్రహములున్న సింహాసనయోగమగును. ఈ యోగములో ఉత్పన్నమైన పురుషుడు సింహాసనముపై కూర్చొనును.

**లగ్నే శుక్రబుధౌ న స్తః కేన్ద్రే నాస్తి బృహస్పతిః**
**దశమేఙ్గారకో నాస్తి సజాతః కిం కరిష్యతి 70**

లగ్నములో శుక్ర, బుధులు, కేంద్రములో గురుడు, దశమములో కుజుడు లేకున్నపుడుత్పన్నమైన పురుషుడు ఏమి చేయును ఏమి చేయడని భావము.

**అష్టమస్థా యదాక్రూరాః సౌమ్యాలగ్నేస్థితా గ్రహాః**
**ధ్వజ యోగేஉత్ర యో జాతః స పుమాన్నాయకో భవేత్ 71**

అష్టమ గృహములో లగ్నములో శుభ గ్రహములున్న ధ్వజయోగమగును. ఈ యోగములో ఉత్పన్నమగు పురుషుడు నాయకుడగును.

**రన్ధ్రస్థానే యదా పాపాః కేన్ద్రస్థానే శుభగ్రహాః**
**సర్వసిద్ధిర్భవేత్తస్య రాజసమ్మానమేవచ 72**

అష్టమములో పాపగ్రహములు కేంద్రములో శుభ గ్రహములున్న జాతకునికి సర్వసిద్ధులు ప్రాప్తించును. రాజసమ్మానము కలుగును.

**మేషలగ్నే యదా భానుశ్చతుర్థే చ బృహస్పతిః**
**దశమే చ కుజో జతో విశ్వస్యాధిపతిర్భవేత్ 73**

మేషలగ్నములో సూర్యుడు, చతుర్థములో గురుడు, దశమములో కుజుడున్న జాతకుడు విశ్వమునకు స్వామియగును.

**కేన్ద్రే స్వోచ్చస్థితే సౌమ్యే రాజలక్ష్మీపతిర్భవేత్**
**కేన్ద్రే పాపే స్వోచ్చసంస్థే రాజా స్యాద్ దుహితుర్గృహే 74**

ఉచ్చ రాశిలోనున్న శుభ గ్రహము కేంద్రములోనున్న జాతకుడు రాజ్యలక్ష్మికి స్వామియగును. ఉచ్చరాశిలోనున్న పాప గ్రహములు కేంద్రములోనున్న కన్యా గృహములో రాజగును.

**బలీసౌమ్యగ్రహో లగ్నం కేన్ద్రస్థో యది వీక్షతే**
**తదా నిహన్త్యరిష్టాని తమః సూర్యోదయో యథా 75**

బలమైన శుభ గ్రహము కేంద్రములో నుండి లగ్నమును చూచుచున్న సమస్త దుఃఖములను సూర్యుడు అంధకారమును నశింపజేయునట్లుగా నాశనము చేయును.

**లగ్నాదష్టమగో భౌమస్త్రికోణే జీవగో రవిః**
**ధార్మికోజాయతే రాజా ధనవానపి జాయతే 77**

లగ్నము నుండి ఎనిమిదవ భావములో కుజుడు, తొమ్మిది ఐదవ స్థానములలో గురుడు సూర్యుడున్న జాతకుడు ధర్మము చేయువాడు ధనవంతుడైన రాజగును.

**లగ్నాత్తు పఞ్చమస్థానే యదా సూర్యబృహస్పతీ**
**తదా విద్యాధనైః పూర్ణో జాయతే జాతకోత్తమః 78**

లగ్నము నుండి ఐదవ స్థానములో రవి, గురులున్న జాతకుడు శ్రేష్ఠుడు విద్యావంతుడు ధనవంతుడగును.

**ఏకోఽపి యదికేన్ద్రస్థః శుక్రో జీవోఽథవాబుధః**
**జాయతేచ తదా బాలో ధనాఢ్యో వేదపారగః** **79**

శుక్ర, గురు, బుధులలో ఒకరు కేంద్ర స్థానములలోనున్న జాతకుడు ధనవంతుడు వేదపారంగతుడగును.

**ద్విత్రిసౌమ్యాః ఖగా నీచా వ్యయభావేఽథవా పునః**
**భవన్తి ధనినః షష్ఠే నిధనే చైవ భిక్షుకాః** **80**

రెండు లేక మూడు శుభ గ్రహములు నీచరాశిలోనున్న లేక పన్నెండవ స్థానములోనున్న లేక ఆరు, పన్నెండు స్థానములలోనున్న ధనవంతుడైనను భిక్షమెత్తుకొను వాడగును.

**నీచస్థితో జన్మని యో గ్రహః స్యాత్**
**తద్రాశినాథశ్చ తదుచ్చనాథః**
**భవేత్త్రికోణే యది కేన్ద్రవర్తీ**
**రాజా భవేద్ధార్మిక చక్రవర్తీ** **81**

జన్మ సమయములో గ్రహము నీచలో నున్న ఆ గ్రహ రాశి స్వామి లేక ఉచ్చరాశి స్వామి త్రికోణము (5,9) లో లేక కేంద్రములోనున్న జాతకుడు ధర్మవంతుడై చక్రవర్తి యగును.

**షష్ఠేక్రూరే నరో జాతః పాపశత్రు విమర్దకః**
**షష్ఠే సౌమ్యే సదారోగీ షష్ఠే చన్ద్రస్తు మృత్యుదః** **82**

ఆరవ గృహములో క్రూర గ్రహమున్న జాతకుడు పాపులను శత్రువులను నాశనము చేయును. ఆరవ గృహములో శుభ గ్రహములున్న సదా రోగియగును. షష్ఠమ గృహములో చంద్రుడున్న మృత్యువును కలిగించువాడగును.

**లగ్నాత్తృతీయభవనే యది సోమసుతో భవేత్**
**ద్వౌ పుత్రౌ కన్యకాస్తిస్రో జాయన్తే నాత్రసంశయః** **83**

లగ్నము నుండి తృతీయ స్థానములో బుధుడున్న జాతకునికి ఇద్దరు పుత్రులు, ముగ్గురు కన్యలు కలుగుదురు. దీనిలో సంశయము లేదు.

**లగ్నాత్తృతీయ భవనే బలీ వాచస్పతిర్యదా**
**పఞ్చ పుత్రాస్తదా తస్య జాయన్తే మానవస్యవై** **84**

లగ్నము నుండి మూడవస్థానములో గురుడున్న జాతకునికి ఐదుగురు పుత్రులు కలుగుదురు.

**లగ్నాత్తృతీయ భవనే బలీశుక్రో యదాభవేత్**
**కన్యాద్వయం త్రయః పుత్రా జాయతే తస్య నిశ్చితమ్** **85**

లగ్నము నుండి తృతీయ స్థానములో బలమైన శుక్రుడున్న జాతకునికి ఇద్దరు కన్యలు ముగ్గురు పుత్రులు తప్పక కలిగెదరు.

**లగ్నాత్తృతీయ భవనే శనిచన్ద్రౌ యదాస్థితౌ**
**శ్యామవర్ణస్తదా బాలో భ్రాతృహీనస్తు జాయతే** **86**

లగ్నము నుండి మూడవ స్థానములో శని, చంద్రులున్న జాతకునికి నల్లని వర్ణము కలిగిన ఒక బాలుడు కలుగును.

**లగ్నాత్తృతీయ భవనే రాహుయుక్తో యదాశశీ**
**భ్రాతృహీనో భవేద్బాలో లక్ష్మీవానపి జాయతే** **87**

లగ్నము నుండి తృతీయ స్థానములో రాహువుతో కూడి చంద్రుడున్న జాతకుడు సోదర రహితుడగును. కాని బాలకుడు ధనవంతుడగును.

**లగ్నాత్తృతీయ భవనే పఞ్చమే వా ధరాసుతః**
**మ్రియతే పుత్రదుఃఖేన నారీవా పురుషోఽపివా** **88**

లగ్నము నుండి మూడవ స్థానము లేక ఐదవ స్థానములో కుజుడున్న జాతకుడు కాని అతని భార్యకాని పుత్ర శోకముతో మరణించును.

**లగ్నాత్సప్తమగేహస్థో యది శుక్రో బలీభవేత్**
**కన్యాద్వయం త్రయః పుత్రా ధనవన్తో భవన్తిహి** **89**

లగ్నము నుండి సప్తమ స్థానములో బలవంతుడైన శుక్రుడున్న జాతకునికి ఇద్దరు కన్యలు ముగ్గురు పుత్రులు కలిగెదరు.

**సింహలగ్నే యదాశుక్రః శనిర్వాపి వ్యవస్థితః**
**తత్ర జాతస్య బాలస్య నేత్రనాశోహి జాయతే** **90**

సింహలగ్నములో శుక్రుడు లేక శని యున్న జాతకుని పుత్రునికి నేత్రములు నాశనమగును.

**సూర్యోఽష్టమే రిపౌ చన్ద్రో ధనే భౌమో వ్యయోశనిః**
**గ్రహదోషేణ నేత్రాణామన్ధతాం జనయన్త్యమీ** **91**

అష్టమ గృహములో రవి, షష్ఠమ గృహములో చంద్రుడు, ద్వితీయములో కుజుడు, ద్వాదశములో శనియున్న గ్రహ దోషము వలన బాలకుని నేత్రములు నాశనమగును.

**శుభవర్గోత్తమే జన్మ వ్యయస్థానే చ సద్గ్రహే**
**అశూన్యేషు చ కేన్ద్రేషు కారకాఖ్య గ్రహేషు చ** **92**

శుభ వర్గోత్తమలగ్నములో జన్మించిన, పన్నెండవ స్థానములో శుభ గ్రహములున్న, కేంద్రములో గ్రహములున్న, కారక సంజ్ఞక గ్రహములున్న రాజయోగమగును.

**సూర్య కేన్ద్రే రాజసేవీ వైశ్యవృత్తిర్నిశాకరే**
**శస్త్ర వృత్తిః కుజే శూరో బుధే చాధ్యాయకో భవేత్** **93**

కేంద్రములో సూర్యుడున్న రాజసేవకుడు, చంద్రుడు కేంద్రములో నున్న వైశ్య వృత్తి చేయువాడు, కుజుడు కేంద్రములోనున్న శూరవీర వృత్తి చేయువాడు బుధుడు కేంద్రములోనున్న అధ్యాపకుడగును.

**స్వానుష్ఠానగతో నిత్యం దివ్య బుద్ధిర్నరో గురౌ**
**శుక్రే విద్యార్థసమ్పన్నో నీచసేవీ శనైశ్చరే** **94**

గురుడు కేంద్రములోను అనుష్ఠానము చేయు బుద్ధిమంతుడు శుక్రుడు కేంద్రములో నున్న విద్యధనములతో కూడినవాడు శని కేంద్రములో నున్న నీచులకు సేవ చేయువాడగును.

**ఇతిపురుష రాజ యోగాః   పురుషరాజయోగము సమప్తము**

--- oOo ---

**స్త్రీ రాజయోగము**

**కేన్ద్రే చ సౌమ్యాయది పృష్ఠభాజః**
**పాపాః కలత్రే చ మనుష్యరాశౌ**
**రాజ్ఞీ భవేత్ స్త్రీ బహుకోశయుక్తా**
**నిత్యం ప్రశాన్తా చ సుపుత్రిణీ చ** **95**

కేంద్ర స్థానములో శుభ గ్రహములు పాపగ్రహములు పురుష సంజ్ఞకరాశిలో సప్తమ స్థానములో నున్న జాతకురాలు శాంత స్వభావురాలు ధనయుక్తురాలు పుత్రులతో కూడిన రాణియగును.

**బుధే విలగ్నే యది తుఙ్గ సంస్థే**
**లాభస్థితో దేవపురోహితశ్చ**
**నరేన్ద్రపత్నీ వనితాప్రసఙ్గే**
**తదాప్రసిద్ధా భవతీహ భూమౌ** **96**

ఉచ్చలో లగ్నములో బుధుడు ఏకాదశ గృహములో గురుడున్న జాతకురాలు రాణియగును. స్త్రీల మధ్యలో గౌరవనీయురాలగును.

**ఏకోఽపి జీవో రసవర్గ శుద్ధః**
**కేన్ద్రేయదా చన్ద్రనిరీక్షితశ్చ**
**రాజ్ఞీభవేత్ స్త్రీ సధనా సపుత్రా**
**రూపాన్వితా పీననితమ్బబిమ్బా** **97**

గురుడొక్కడు షడ్వర్గశుద్ధుడై కేంద్రములో నుండి చంద్రునితో చూడబడిన స్త్రీ రాణియగును. ధన, పుత్రులతో కూడినదై పెద్దవైన పిరుదులు కలదగును.

**కర్కోదయే సప్తమగే పతఙ్గే**
**జీవేన దృష్టే పరిపూర్ణదేహా**
**విద్యాధరీ చాత్ర భవేత్ప్రధానా**
**రాజ్ఞీ గతారిర్బహు పుత్రపౌత్రా** **98**

కర్కాటకలగ్నములో జన్మించి సప్తమస్థానములో రవి యుండి గురునిచే చూడబడున్న స్త్రీ పరిపూర్ణ దేహము కలిగి విద్యాయుక్తురాలు శత్రువులు లేనిదై అనేక పుత్రపౌత్రులతో కూడినదై రాణియగును.

**షగ్వర్గశుద్ధై స్త్రిభిరేవ రాజ్ఞీ**
**చతుర్భిరంశైశ్చ తథైకపత్నీ**
**పఞ్చాదిభిర్దేవ విమానభాజా**
**త్రైలోక్యనాథప్రమదా తదా స్యాత్** **99**

షడ్వర్గులలో మూడు వర్గులు శుద్ధమైన రాణియగును, నాలుగువర్గులు శుభమైన భూమిపై అద్వితీయమైన పత్నియగును, ఐదుగురులు శుభమైన దేవ విమానములో కూర్చొని త్రైలోక్యనాథునికి పత్నియగును.

**లాభస్థితః శీతకరో భృగుశ్చ**
**కలత్రగః సోమసుతేన యుక్తః**
**జీవేన దృష్టో భవతీహరాజ్ఞీ**
**ఖ్యాతా ధరణ్యాం సకలైః స్తుతా చ** **100**

ఏకాదశ స్థానములో చంద్రుడు సప్తమములో బుధ యుక్త శుక్రుడుండి గురునితో చూడబడిన స్త్రీ భూమిపై ప్రసిద్ధురాలు అందరిచే పూజింపబడినదగును.

**స్త్రీ పుంసయోః ఫలం తుల్యం జాతకే కిన్తు సప్తమే**
**సౌభాగ్యం చంద్రలగ్నాభ్యాం వపురాకృతి రుచ్యతే** **101**

జాతక గ్రంథములలో సప్తమగృహములో నున్న గ్రహముల వలన స్త్రీ పురుషులిరువురికి సమాన ఫలము తెలుపబడెను. చంద్రుడు లగ్నముల వలన సౌభాగ్యము శరీరాకృతి తెలుపబడును.

**స్త్రీ రాజ యోగము సమాప్తము**

**--- oOo ---**

**శుభాశుభయోగము**

**కర్మస్థానే నిజక్షేత్రే భౌమశుక్ర బుధైర్యుతః**
**యదిరాహుర్భవేత్తస్య క్షణేవృద్ధిః క్షణే క్షయః** 102

తన క్షేత్రములో, దశమస్థానములో కుజ, శుక్ర, బుధులతో రాహు వున్న క్షణములో వృద్ధి క్షణములో క్షయము కలుగును.

**హోరాయాం ద్వాదశే రాశౌ స్థితోయది దివాకరః**
**కరోతి దక్షిణే కాణం వామనేత్రే చ చన్ద్రమాః** 103

హోరలో, ద్వాదశ రాశిలో సూర్యుడున్న జాతకుని కుడి కన్ను గ్రుడ్డిదగును చంద్రుడున్న ఎడమకన్ను గ్రుడ్డిదగును.

**భౌమక్షేత్రే యదాజీవో జీవక్షేత్రే చ భూసుతః**
**ద్వాదశే వత్సరే మృత్యుర్బాలకస్య న సంశయః** 104

కుజస్థానములో గురుడు, గురు స్థానములో కుజుడున్న బాలకునికి నిస్సందేహముగా పన్నెండవ సంవత్సరము మృత్యువు కలుగను.

**ధనస్థానే యదాభౌమః శనైశ్చర సమన్వితః**
**సహజే చ భవేద్రాహుర్భ్రాతా తస్య న జీవతి** 105

ద్వితీయ స్థానములో శని కుజగ్రహములు, తృతీయములో రాహువున్న జాతకుని సోదరుడు జీవించడు.

**చతుర్థేచ యదారాహుః షష్ఠే చన్ద్రోఽ ష్టమేపి వా**
**సద్యఏవ భవేన్మృత్యుః శఙ్కరో యది రక్షితా** 106

నాల్గవ స్థానములో రాహువు ఆరు, ఎనిమిదవ స్థానములలో చంద్రుడున్న జాతకుని శివుడు రక్షింపవలెనన్నను శీఘ్రముగా మృత్యువును పొందును.

**అష్టమస్థో నిశానాథః కేన్ద్రే పాపేన సంయుతః**
**చతుర్థే చ యదా రాహుర్వర్షమేకం స జీవతి** 107

అష్టమస్థానములో చంద్రుడు లేక పాపగ్రహములు కేంద్రములో నాల్గవ స్థానములో రాహువున్న బాలకుడు ఒక వర్షము జీవించును

**పాతాలే చామ్బరే పాపో ద్వాదశే చ యదాస్థితః**
**పితరం మాతరం హన్తి దేశాద్దేశాన్తరం వ్రజేత్** 108

పది, పన్నెండవ భావములలో పాపగ్రహములున్న బాలకుడు మాతాపితలను నాశనము చేయును. దేశాంతరమునకు వెళ్ళును.

**పఞ్చమస్థో నిశానాథస్త్రికోణే చ బృహస్పతిః**
**దశమేచ మహీసూనుః పరమాయుః స జీవతి** 109

పంచమ స్థానములో చంద్రుడు, నవమ పంచమములలో గురుడు దశమములో కుజుడున్న బాలకుడు చాలకాలము వరకు జీవించును.

**ధనస్థానే యదా క్రూరః సహజే సప్తమే తథా**
**పఞ్చమే భవనే జీవో నీచజాతస్తదా భవేత్ 110**

రెండవ స్థానములో క్రూరగ్రహములు మూడు, ఏడు, ఐదవ స్థానములలో గురుడున్న బాలకుడు నీచస్థితిలోనుత్పన్నమగును.

**లగ్నే ధనేవ్యయే క్రూరో తదా మృత్యౌ చ జాయతే**
**విష్ఠయా మార్గ బన్ధోఽస్య ద్వాదశాష్టమవాసరే 111**

లగ్న ద్వితీయ ద్వాదశ, అష్టమ స్థానములలో క్రూర గ్రహములున్న బాలకుడు పన్నెండవ లేక ఎనిమిదవ దినములో పురీషమార్గమాగుట వలన మరణించును.

**షష్ఠేచ భవనే భౌమః సప్తమే సింహికాసుతః**
**అష్టమే చ యదాసౌరిర్భార్యాతస్య న జీవతి 112**

ఆరవ స్థానములో కుజుడు, ఏడవ స్థానములో రాహువు, ఎనిమిదవ స్థానములో శనియున్న జాతకుని భార్య జీవించదు.

**తిథ్యన్తే చ దినాన్తేచ లగ్నస్యాన్తే తథైవ చ**
**చరరాశౌ యదా జాతః సోఽన్యజాతః శిశుర్భవేత్ 113**

తిథి చివరిలో దినాంతములో లగ్నాంతములో చర రాశితో ఉత్పన్నమైన జాతకుడు ఇతరుల వలన ఉత్పన్నమైన వానిగా భావించవలెను.

**రిపుస్థానే యదాచన్ద్రో లగ్నస్థానే శనైశ్చరః**
**కుజశ్చ సప్తమస్థానే పితా తస్య న జీవతి 114**

షష్ఠమములో చంద్రుడు, లగ్నములో శని, సప్తమ స్థానములో కుజుడున్న జాతకుని తండ్రి జీవించదు.

**బాలస్య జన్మకాలే చేదష్టమస్థః శనైశ్చరః**
**పాప దృష్టో నాశకః స్యాదన్యథా క్లేశదాయకః 115**

పాపగ్రహములతో చూడబడుచున్న శని అష్టమ స్థానములో నున్న బాలకుని నాశనము చేయును. పాపగ్రహములతో చూడబడుకున్న క్లేశకారకుడగును.

**క్రూరైర్దృష్టో జన్మలగ్నాత్ షష్ఠే వాప్యష్టమే బుధః**
**చతుర్వర్షే భవేన్మృత్యుః శఙ్కరో యది రక్షతి 116**

ఆరు, ఎనిమిదవ భావములలో నున్న క్రూర గ్రహములతో చూడబడుతున్న బుధుడు జన్మ లగ్నములో నున్న జాతకుడు నాలుగు సంవత్సరములలో మృత్యువును పొందును. శివుడు రక్షించినప్పటికి జీవించదు.

**క్రూరశ్చతుర్షు కేన్ద్రేషు తథా క్రూరో ధనేஉపివా**
**దారిద్ర్యయోగం జానీయాత్స్వవంశస్య క్షయఙ్కరః 117**

క్రూర గ్రహములు కేంద్రములలో రెండవ స్థానములో నున్న దారిద్ర్యయోగముగా భావించవలెను. ఈ యోగములో జన్మించిన బాలకుడు తనవంశమును నాశనము చేయును.

**లగ్నస్థానే యదా జీవో ధనస్థానే శనైశ్చరః**
**రాహుశ్చ సహజస్థానే మాతా తస్య నజీవతి 118**

లగ్నములో గురుడు ద్వితీయములో శని తృతీయస్థానములో రాహువున్న జాతకుని తల్లి జీవించదు.

**సప్తమే భవనే భౌమశ్చాష్టమే భార్గవో యదా**
**నవమే భవనే సూర్యః స్వల్పాయుస్తస్య జాయతే 119**

సప్తమస్థానములో కుజుడు అష్టమములో శుక్రుడు, నవమములో సూర్యుడున్న జాతకుడు స్వల్ప ఆయువు కలవాడగును.

**క్షీణ చన్ద్రో యదా లగ్నే పాపాశ్చాష్టమకేన్ద్రగాః**
**స్మరే లగ్నపతిః పాపయుక్తో నశ్యేత్తదా శిశుః 120**

క్షీణ చంద్రుడులగ్నములో, పాప గ్రహము అష్టమ, కేంద్ర స్థానములలో సప్తమములో లగ్నస్వామి పాపగ్రహములతో కూడియున్న బాలకుడు తప్పక మరణించును.

**క్షీణచన్ద్రో ద్వాదశస్థః పాపాలగ్నే స్మరేஉష్టమే**
**శుభైశ్చ రహితే కేన్ద్రేశీఘ్రం నశ్యతి జాతకః 121**

క్షీణ చంద్రుడు ద్వాదశ గృహములో పాప గ్రహములు లగ్నము, ఏడవ, ఎనిమిదవ గృహములలోనున్న, కేంద్రములో శుభగ్రహములు లేకున్న బాలకుడు శీఘ్రముగా మరణించును.

**దశమస్థో దివానాథః పాపైర్బహుభిరీక్షితః**
**మేషవృశ్చికకర్కస్య సద్యో మృత్యుప్రదో భవేత్ 122**

మేష, వృశ్చిక, కర్కాటకములలో సూర్యుడు పదవ గృహములోనున్న పాప గ్రహములతో చూడబడుచున్నపుడుత్పన్నమైన జాతకుడు శీఘ్రముగా మృత్యువును పొందును.

**రాహుజీవౌ రిపుక్షేత్రే లగ్నేవాథ చతుర్థగౌ**
**త్రయోవింశే తదావర్షే పుత్రస్తాతం వినాశయేత్ 123**

రాహువు గురుడు ఆరవ స్థానములో లగ్నములో నాల్గవస్థానములోనున్న బాలకుడు ఇరువది మూడవ సంవత్సరములో తండ్రిని నాశనము చేయును.

**అష్టమస్థో యదా భౌమస్త్రికోణే నీచగోరవిః**
**సశీఘ్రమేవ జాతః స్యాద్ భిక్షాజీవీ చ దుఃఖితః 124**

అష్టమములో కుజుడు నవమ పంచములలో నీచ సూర్యుడున్న బాలకుడు శీఘ్రముగా భిక్షమెత్తుకొనువాడు దుఃఖితుడగును.

**సింహే భౌమస్తులే సౌరిః కన్యాయాం చ యదా సితః**
**మిథునే చ యదా రాహుర్జననీ తస్య నశ్యతి 125**

సింహములో కుజుడు, తులలో శని, కన్యలో శుక్రుడు, మిథునములో రాహువున్న బాలకుడు తల్లిని నాశనము చేయును.

**లగ్నే క్రూరః స్వభవనే క్రూరః పాతాలగోయది**
**దశమే భవనే క్రూరః కష్టం జీవతి బాలకః 126**

లగ్నములో తన గృహములో క్రూర గ్రహమున్న, క్రూర గ్రహము నాలుగు పదవస్థానములలోనున్న బాలకుడు కష్టముతో జీవించును.

**సప్తమే భవనే భానుః కర్మస్థో భూమినన్దనః**
**రాహుర్వ్యయే చ తస్యైవ పితా కష్టేన జీవతి 127**

సప్తమములో సూర్యుడు, దశమములో కుజుడు ద్వాదశములో రాహువున్న జాతకుని తండ్రి కష్టముతో జీవించును.

**త్రికోణ కేన్ద్రగాః పాపాః శుభా రన్ధ్రవ్యయారిగాః**
**సూర్యోదయే ప్రసూతస్య హరన్తి ఖలు జీవనమ్ 128**

త్రొకోణ కేంద్రస్థానములలో పాపగ్రహములు ఎనిమిదవ పన్నెండవ ఆరవస్థానములలో శుభ గ్రహములున్నపుడు జన్మించిన జాతకుడు సూర్యోదయమైన వెంటనే మరణించును.

**స్మరే వ్యయే చ సహజే మధ్యే క్రూరా యదా గ్రహాః**
**తదా జాతస్య బాలస్య, శరీరే కష్టమాదిశేత్ 129**

ఏడు, పన్నెందు, మూడు, పదవ స్థానములలో క్రూరగ్రహములున్నపుదుత్పన్నమైన బాలకుని శరీరమునకు కష్టము కలుగును.

**కన్యాయాం చ యదా రాహుః శుక్రో భౌమః శనిస్తథా**
**తత్ర జాతస్య జాయేత కుబేరాదధికం ధనమ్ 130**

కన్యలో రాహువు శుక్రుదు కుజుడు శని గ్రహములున్న బాలకుడు కుబేరుని కన్న అధిక ధనవంతుడగును.

**క్రూరలగ్నే యదా జాతస్తత్స్వామీక్రూరవేష్టితః**
**ఆమవాతో భవేత్తస్య శరీరే కష్టమాదిశేత్ 131**

క్రూర లగ్నములో జన్మించిన, ఆ లగ్నస్వామి క్రూర గ్రహములతో కూడియున్న జాతకుని శరీరమునకు ఆమవాతము వలన శరీరమునకు నష్టము కలుగును.

**సహజే సహజాధీశో లగ్నే పుత్రేధనేపి వా**
**జాయతే న తదా బాలో యదిజాతోన జీవతి 132**

మూడవ రాశి స్వామి తృతీయ లగ్న, పంచమ, ద్వితీయ స్థానములోనున్నపుడు బాలకుడుత్పన్నముకాడు ఉత్పన్నమైనను జీవించడు.

**కన్యామిథునగే రాహుః కేన్ద్రే షష్ఠే వ్యయే యదా**
**త్రికోణే వా యదా జాతోదాతాభోక్తా నిరామయః 133**

కన్య లేక మిథునములలో రాహువు కేంద్రములో, షష్ఠ ద్వాదశ త్రికోణములోనున్న బాలకుడు దాని, భోగి, రోగరహితుడగును.

**ఏకః పాపోష్టమస్థోఽపి శత్రుక్షేత్రే యదాభవేత్**
**పాపేన దీక్షితో వర్షాన్మారయత్యేవ బాలకమ్ 134**

పాపగ్రహములు అష్టమములో నుండి పాపగ్రహములతో చూడబడిన శత్రుక్షేత్రములోనున్న పాపగ్రహములు సంవత్సరములోపలనే బాలకుని చంపును.

**భౌమ భాస్కరమన్దాశ్చ శత్రుక్షేత్రేఽష్టమే యదా**
**యమేన రక్షితోఽప్యేవం వర్షమాత్రం న జీవతి 135**

కుజ సూర్య, శనులు, షష్ఠ, అష్టమ స్థానములలోనున్న బాలకుని యమరాజు రక్షించినను సంవత్సరములోపల మరణించును.

**వక్రీ శనిర్భౌమగేహే కేన్ద్రే షష్ఠేఽష్టమేపివా**
**కుజేన బలినా దృష్టో హన్తి వర్షద్వయే శిశుమ్ 136**

వక్రియైనశని కుజస్థానములో, కేంద్రములో లేక ఆరవ, ఎనిమిదవ స్థానములో నున్న బాలకుడు రెండు సంవత్సరములలో మరణించును.

**రాహౌవృషే త్రిభిర్దృష్టే కేతుదృష్టే చతుష్టయే**
**దృష్టేచ గురుశుక్రాభ్యాం దీర్ఘకాలం స జీవతి 137**

వృషభ రాశిలో రాహువు మూడు గ్రహములతో చూడబడిన కేతువు ద్వారా చూడబడిన, గురు, శుక్రుల ద్వారా చూడబడిన జాతకుడు దీర్ఘాయుష్మంతుడగును.

**చన్ద్రేణమఙ్గలో యుక్తో జన్మకాలే యదాభవేత్**
**తస్య జాతస్య గేహం తు లక్ష్మీర్నైవ విముఞ్చతి 138**

జన్మ సమయములో చంద్రుడు కుజుడు కలిసియున్న జాతకుని గృహమును లక్ష్మి వదిలివెళ్ళదు.

**షష్ఠాష్టమగశ్చన్ద్రః సద్యోమరణాయ పాపసందృష్టః**
**అష్టాభిః శుభసందృష్టే వర్షైర్మిశ్రైస్తదర్ధేన 139**

షష్ఠ అష్టమ స్థానములలోనున్న చంద్రుడు పాప గ్రహములలో చూడబడిన బాలకుడు వెంటనే మరణించును. చంద్రుడు ఎనిమిది శుభగ్రహములతో చూడబడిన ఒకటిన్నర సంవత్సరములలో మరణించును.

**శుక్ల పక్షే నిశాయాం చ కృష్ణే జాతో దివా యదా**
**షష్ఠాష్టమ గతశ్చన్ద్రో న శిశుం హన్తి తాతవత్ 140**

శుక్లపక్ష రాత్రిలో లేక కృష్ణపక్ష దినములో జన్మించిన, ఆరు లేక ఎనిమిదవ గృహములోనున్న, చంద్రుడు తండ్రితోసమానుడై బాలకుని నాశనము చేయడు.

**లగ్నే త్రికోణే ద్యూనే చ వ్యయే పాపయుతః శశీ**
**శిశుం హన్తి న దృష్టశ్చేద్ బలవద్భిః శుభైర్గ్రహైః 141**

లగ్న, త్రికోణ, సప్తమ, ద్వాదశ గృహములలో పాప గ్రహములతో కూడియున్న చంద్రుడు బలమైన శుభ గ్రహములతో చూడబడకున్న బాలకుని నాశనము చేయును.

**సప్తమే చతురస్రే పాపయుగ్మాన్తరే స్థితః**
**కరోతి చన్ద్రమా నాశం బాలకస్య న సంశయః 142**

చంద్రుడు సప్తమ, చతుర్థ గృహములలో రెండు పాపగ్రహముల మధ్యలోనున్న జాతకుని నిస్సందేముగా నాశనము చేయును.

**క్షీణచన్ద్రో యదాలగ్నే పాపాః కేన్ద్రేషు సంస్థితాః**
**అష్టమే భవనే వాపి తదా మృత్యుః శిశోర్భవేత్ 143**

క్షీణ చంద్రుడు లగ్నములో పాపగ్రహములు కేంద్రములో లేక అష్టమ గృహములోనున్న బాలకునికి మృత్యువు కలుగును.

**శనిరాహుకుజైర్యుక్తః సప్తమే భవనే శశీ**
**సప్తమే దివసే హన్తి మాసే వా సప్తమే శిశుమ్ 144**

శని, రాహువు కుజులతో కూడిన చంద్రుడు సప్తమ గృహములోనున్న బాలకుడు ఏడు దినములు లేక ఏడు మాసములలో మరణించును.

**న పశ్యతి శశీలగ్నం మధ్యే వా సౌమ్య శుక్రయోః**
**తాతే పరోక్షే జన్మాస్య భౌమేఽ స్తే వా యమే తనౌ 145**

చంద్రుడు, బుధుడు, శుక్రుల మధ్యలో నుండి లగ్నమును చూడకున్న కుజుడు శనిలగ్నములోనున్న తండ్రి లేని సమయములో పుత్రుని జన్మమగును.

**లగ్నస్థశ్చ యదా భానుః పఞ్చమస్థో నిశాకరః**
**అష్టమస్థా యదా పాపాస్తదా జాతోన జీవతి 146**

లగ్నములో సూర్యుడు, పంచమములో చంద్రుడు, అష్టమములో పాప గ్రహములున్న సమయమున పుట్టిన బాలకుడు జీవించడు.

**త్రికోణ కేన్ద్రగాః పాపాః సౌమ్యాః షష్ఠవ్యయాష్టగాః**
**సూర్యోదయే సంప్రసూతః ప్రాణాంస్త్యజతి బాలకః** **147**

త్రికోణము కేంద్రములలో పాపగ్రహములు, షష్ఠ ద్వాదశ, అష్టమ గృహములలో శుభ గ్రహములున్న సూర్యోదయ సమయమునకుత్పన్నమైన బాలకుడు ప్రాణములను త్యజించును.

**లగ్నే షష్ఠేఽష్టమే ద్యూనే శనియుక్తోయదాకుజః**
**శుభగ్రహైరదృష్టశ్చ శిశుం హన్తి న సంశయః** **148**

లగ్న, షష్ఠ, అష్టమ, సప్తమములలో నున్న శనితో కూడిన కుజుడు శుభ గ్రహములతో చూడబడకున్న బాలకుడు నిస్సందేహముగా మరణించును.

**షష్ఠాష్టమే కర్కరాశౌ చన్ద్ర దృష్టోభవేత్ బుధః**
**చతుర్భిర్వత్సరైర్బాలం మారయత్యేవ నిశ్చితమ్** **149**

బుధుడు షష్ఠమ, అష్టమములలో లేక కర్కాటక రాశిలో నుండి చంద్రునితో చూడబడుచున్న బాలకుడు నాలుగు సంవత్సరములలో మరణించును.

**దృష్టః సూర్యేన్దుమన్దారైర్న దృష్టో భృగుణాగురుః**
**వర్షై స్త్రిభిః శిశుం హన్తి భౌమగేహేఽష్టమే స్థితః** **150**

గురుడు, రవి, చంద్ర శనులతో చూడబడినపుడు శుక్రుని దృష్టి లేనపుడు, అష్టమములో కుజుడున్నపుడు జన్మించిన బాలకుడు మూడు వర్షములలో మరణించును.

**కర్కే సింహేఽష్టమే షష్ఠే వ్యయే చ భృగునన్దన**
**సర్వైర్దృష్టోఽశుభైర్బలిం షడ్భిర్వర్షై ర్వినాశయేత్** **151**

కర్కాటకములో, సింహములో, ఎనిమిదవ, ఆరవ, పన్నెండవ గృహములలో అ శుభ గ్రహములన్నింటితో చూడబడుతు చంద్రుడున్న బాలకుడు ఆరు వర్షములలో నాశనముపొందును.

**లగ్నే శనిః పాపదృష్టో హన్తి షోడశవాసరైః**
**పాపయుక్తాశ్చ మాసేన శుద్ధో వర్షేణ బాలకమ్** **152**

శని లగ్నములో నున్న శని పాప గ్రహములతో చూడబడుతున్న బాలకుడు పదహారు దినములలో మరణించును. పాప గ్రహములు లగ్నములోనున్న నెల లోపల, శుద్ధముగానున్న సంవత్సరములో బాలకుడు మరణించును.

**స్వగేహే గురుగేహే వా తులాలగ్నే శనిస్థితః**
**సూర్యే మఙ్గలమధ్యే వా నాయుర్వస్తి కదాచన** **153**

శని తన గృహములో లేక గురు స్థానములో లేక తులా లగ్నములోనున్న రవి, కుజుల మధ్యలోనున్న ఆయువు నశించదు.

**కేన్ద్రే రాహుః పాపదృష్టో దశభిర్హన్తి వత్సరైః**
**బాలం ద్వాదశభిః కశ్చిత్ కశ్చిత్ షోడశభిర్వదేత్** **154**

పాపగ్రహములతో చూడబడుచున్న రాహువు కేంద్రములోనున్న బాలుడు పది సంవత్సరములలో మరణించును. కొంత మంది ఆచార్యులు పన్నెండు, పదహారు వర్షములలో మరణించునని తెల్పిరి.

**జన్మలగ్నపతిః షష్ఠేవ్యయే మృత్యౌ చ తిష్ఠతి**
**అస్తంగతో మృత్యుకరో రాశితుల్యశ్చ వత్సరైః** **155**

జన్మ కాలపు స్వామి షష్ఠమ, అష్టమ ద్వాదశ గృహములలో అస్తమించిన ఆ రాశికి సమానమైన వర్షములలో మృత్యువు కలుగును.

**సౌమ్యాః షష్ఠేఽష్టమే పాపైర్వక్రీభూతై ర్విలోకితాః**
**శుభైరదృష్టా మాసేన మారయన్త్యేవ బాలకమ్** **156**

శుభ గ్రహములు షష్ఠమ, అష్టమ గృహములలోనున్న వక్రిమైన పాపగ్రహములతో చూడబడిన, శుభ గ్రహముల ద్వారా చూడబడకున్న బాలకుడు నెల రోజులలో మరణించును.

**ఉదితో యత్ర నక్షత్రే కేతుర్యస్తత్ర జాయతే**
**రౌద్రే ముహూర్తే సోఽప్యేవ సద్యః ప్రాణైర్వియుజ్యతే** **157**

కేతువుదయించిన నక్షత్రములో, రౌద్రముహూర్తములో జన్మించిన బాలుడు వెంటనే ప్రాణములను విడచును.

**మేషే వృషే చ కర్కేచ సర్వాపద్భ్యో హి రక్షతి**
**సింహికాతనయో బాలం ప్రియం పుత్రం యథా పితా** **158**

రాహువు మేష, వృషభ, కర్కాటములలోనున్న తండ్రి తన పుత్రుని రక్షించునట్లుగ రాహువు ఆపదల నుండి రక్షించును.

**షష్ఠే తృతీయే లాభేచ స్థితః సమ్పత్తికారకః**
**రాహుః సర్వాపదాం హన్తా స్వగృహే చ విశేషతః** **159**

రాహువు షష్ఠమ, తృతీయ, ఏకాదశ గృహములోనున్న సంపత్తిని కలిగించును అన్ని సంకటములను నశింపజేయును. రాహువు తనస్థానములోనున్న విశేష ఫలములనిచ్చును.

**చన్ద్రః పాప గ్రహైర్యుక్తశ్చన్ద్రో వా పాపమధ్యగః**
**చన్ద్రాత్సప్తమగః పాపస్తదా మాతృవధో భవేత్** **160**

చంద్రుడు పాప గ్రహములతో కూడి లేక పాప గ్రహముల మధ్యనున్న లేక చంద్రుని నుండి సప్తమ గృహము పాపగ్రహములతోనున్న బాలకుని తల్లికి మరణము కలుగును.

**సూర్యః పాపేన సంయుక్తస్తదా పితృవధోభవేత్**
**లగ్నం పాపేన సంయుక్తం లగ్నం వా పాపమధ్యగమ్** **161**

సూర్యుడు పాపగ్రహములతోనున్న లగ్నములో పాప గ్రహములున్న లేక పాప గ్రహముల మధ్యలోనున్న తండ్రికి మరణము కలుగును.

**లగ్నాత్సప్తమగాః పాపస్తదా చాత్మవధోభవేత్**
**అపకర్మా తదాజాతః సప్తవర్షాణి జీవతి** **162**

లగ్నము నుండి సప్తమ స్థానములో పాప గ్రహములున్న జాతకుడు చెడు కర్మలు చేయుచు ఏడు వర్షములలో మరణించును.

**అష్టమే చ యదా సౌరిర్జన్మస్థానే చ చన్ద్రమాః**
**మన్దాగ్న్యుదర రోగీ చ గాత్రహీనశ్చ జాయతే** **163**

అష్టమములో శని, జన్మస్థానములో చంద్రుడున్న బాలకుడు మందాగ్నితో ఉదర రోగముతో పీడింపబడి అంగహీనుడగును.

**శనిక్షేత్రే యదా భానుర్భాను క్షేత్రే యదాశనిః**
**ద్వాదశే వత్సరే మృత్యుస్తస్య జాతస్య జాయతే** **164**

శనిస్థానములో రవి, రవిస్థానములో శని యున్న పన్నెండు సంవత్సరములలో మృత్యువు కలుగును.

**బుధ భౌమౌ యదా లగ్నే షష్ఠే వా యది తిష్ఠతః**
**తస్కరో ఘోరకర్మా చ హస్తపాదౌ వినశ్యతః** **165**

బుధ, కుజులు లగ్నములో లేక ఆరవ స్థానములోనున్న జాతకుడు దొంగ, చెడు పనులు చేయువాడగును. అతని చేతులు, కాళ్లు నాశనము పొందును.

**షష్ఠేఽష్టమే చ మూర్తే చ శనిక్షేత్రే యదాబుధః**
**పాపాక్రాన్తశ్చతుర్వర్షే మారయత్యేవ బాలకమ్** **166**

బుధుడు లగ్న, షష్ఠమ, అష్టమ భావములో శని స్థానములోనున్న పాప గ్రహములతో కూడియున్న బాలకుడు పద్నాలుగు వత్సరములలో మరణించును.

**అష్టమస్థోయదా రాహుః కేన్ద్రస్థానే చ చన్ద్రమాః**
**సద్యఏవ భవేన్మృత్యుర్బాలస్యన సంశయః** **167**

సప్తమ, నవమస్థానములలో శత్రు గృహాములలో రాహువున్న జాతకునికి నిస్సందేహముగా పదహారు వర్షములలో మృత్యువు కలుగును.

**సప్తమే నవమే రాహుః శత్రుక్షేత్రే యదా భవేత్**
**ప్రాప్తేచ షోడశే వర్షేతస్యమృత్యుర్న సంశయః** **168**

సప్తమ నవమగృహములలో శత్రుగృహములో రాహువున్న తప్పక పదహారవ వర్షములో మృత్యువు కలగును.

**ద్వాదశస్థో యదాచన్ద్రః పాపః స్యాదష్టమే గృహే**
**ఏకమాసే భవేన్మృత్యుస్తస్య బాలస్య నిశ్చితమ్** **169**

ద్వాదశ గృహములో చంద్రుడు, అష్టమ గృహములో పాప గ్రహములున్న బాలకుడు ఒక నెలలో తప్పక మృత్యువును పొందును.

**జన్మస్థానే యదా రాహుః షష్ఠస్థానే చ చన్ద్రమాః**
**అపస్మారౌ తదా బాలో జాయతే నాత్ర సంశయః** **170**

జన్మస్థానములో రాహువు షష్ఠమ స్థానములో చంద్రుడున్న బాలకుడు నిస్సందేహముగా అపస్మార రోగము కలిగియుండును.

**భార్గవేణ యుతశ్చన్ద్రః షష్ఠాష్టమగతో భవేత్**
**మన్దాగ్నిః కుక్షిరోగీచ హీనాఙ్గోఽపి చ బాలకః** **171**

శుక్రునితో కూడి చంద్రుడు షష్ఠమ, అష్టమ స్థానములలో నున్న బాలకుడు మందాగ్ని పీడితుడు కుక్షి రోగి, అంగహీనుడగును.

**షష్ఠేఽష్టమే యదా చన్ద్రో బుధ యుక్తస్తు తిష్ఠతి**
**విషదోషేణ బాలస్య తదా మృత్యుశ్చ జాయతే** **172**

షష్ఠమ, అష్టమ గృహములలో బుధునితో కూడి చంద్రుడున్న బాలకుడు విషముతో మరణించును.

**భానునా సంయుతశ్చన్ద్రః షష్ఠాష్టమగతోయదా**
**రాజ దోషేణ మృత్యుర్వా సింహదోషేణ వా భవేత్** **173**

రవితో కూడి చంద్రుడు షష్ఠమ, అష్టమ గృహములలో నున్న బాలకుడు రాజ దోషము వలన లేక సింహము వలన మృత్యువును పొందును.

**ఏకోఽపి యదిమూర్తౌ స్యాజ్జన్మకాలే దివాకరః**
**స్థానహీనో భవేద్బాలః శోకసన్తాప పీడితః** **174**

సూర్యుడొక్కడే లగ్నములోనున్న బాలకుడు గృహము లేనివాడు శోకసంతాప పీడితుడగును

**దశమస్థో యదాభౌమః శత్రుక్షేత్ర స్థితో భవేత్**
**మ్రియతే తస్య బాలస్య పితా శీఘ్రం న సంశయః** **175**

దశమములో కుజుడు శత్రుస్థానములోనున్న బాలకుని తండ్రి శీఘ్రముగా మరణించును.

**లగ్నేఽ ష్టమే యదా రాహుశ్చన్ద్రయుక్తో హి తిష్ఠతి**
**దశాహే జాయతే తస్య బాలస్య మరణంధ్రువమ్** **176**

లగ్నము లేక అష్టమ స్థానములో చంద్ర రహిత రాహువున్న బాలకుడు పదిరోజులలో తప్పక మరణించును.

**శనైశ్చరస్తులాకుమ్భమకరే యది జ్ఞాయతే**
**లగ్నేఽ ష్టమే తృతీయే వా తదారిష్టం న జాయతే** **177**

శని తులారాశిలో, కుంభ, మకరములలో లగ్నములో, తృతీయ అష్టమ స్థానములలోనున్న అరిష్టము జరుగును.

**లగ్నాచ్చ నవమే సూర్యే సూర్యపుత్రే తథాఽ ష్టమే**
**ఏకాదశే భార్గవే చ మాసమేకం న జీవతి** **178**

నవమ గృహములో రవి, అష్టమములో శని, ఏకాదశ స్థానములో శుక్రుడున్న బాలకుడు ఒకనెల కుడ జీవించదు.

**ధనే గురుః సింహికేయో భౌమఃశుక్రశ్చ సప్తమే**
**అష్టమే రవిచన్ద్రౌ చ మ్లేచ్ఛః స్యాద్యౌవనే హి సః** **179**

గురువు రాహువులు ద్వితీయములో, కుజ శుక్రులు సప్తమములో సూర్యచంద్రులు అష్టమములోనున్న జాతకుడు వయసు వచ్చి తర్వాత ముసల్మానుడగును.

**నవమే దశమే చన్ద్రః సప్తమే చ యదా సితః**
**పాపే పాతాలసంస్థే చ వంశక్షయకరో నరః** **180**

నవమ దశమ గృహములలో చంద్రుడు సప్తమములో శుక్రుడు చతుర్థములో పాప గ్రహములున్న మనుష్యుడు వంశమును నాశనము చేయువాడగును.

**భ్రాతృస్థానే యదా జీవో లాభస్థానే యదాశశీ**
**సలోకే గృహమధ్యస్థో జాయతే కులదీపకః** **180**

తృతీయములో గురుడు ఏకాదశములో చంద్రుడున్న జాతకుడు గృహ మధ్యములో నుండి కులదీపకుడగును.

**సింహలగ్నే యదాభౌమః పఞ్చమే చ నిశాకరః**
**వ్యయస్థానే యదా రాహుః సజాతః కులదీపకః** **182**

సింహలగ్నములో కుజుడు, పంచమ గృహములో చంద్రుడు ద్వాదశ గృహములో రాహువున్న బాలకుడు కులదీపకుడుగును.

**ఏకః పాపో యదాలగ్నే పాపశ్చైకో రసాతలే**
**జాయతే చ ద్వినాలాభ్యాం సజాతః కులదీపకః 183**

ఒక పాపగ్రహము లగ్నములో, ఒక పాప గ్రహము చతుర్థ గృహములో నున్న బాలకుడు రెండు నాళములతోనుత్పన్నమై కులదీపకుడగును.

**లగ్నేవా సప్తమే భౌమః పఞ్చమే చ దివాకరః**
**జీవేదరణ్య మధ్యేఽపి విఖ్యాతః స న సంశయః 184**

లగ్నము లేకసప్తమ గృహములో కుజుడు, పంచములలో సూర్యుడున్న బాలకుడు వన మధ్యములో కూడ జీవించును. నిస్సందేహముగా ప్రసిద్ధుడగును.

**గండయోగ విచారము**

**ఆదౌమూల మఘాశ్విన్యాం తిస్రః స్యుర్గణ్డనాడికాః**
**జ్యేష్ఠాశ్లేషారేవతీనామన్తే చ పఞ్చ నాడికాః 185**

మూలమఘ అశ్విని నక్షత్రములలో మొదటి మూడునాడులు గండనాడులగును. జ్యేష్ఠ ఆశ్లేష రేవతి నక్షత్రములలో చివరి ఐదు నాడులు గండనాడులగును.

**గండయోగ ఫలము :**

**సన్ధ్యారాత్రి దివాభాగే గణ్డయోగే ధ్రువం శిశుః**
**ఆత్మానం మాతరం తాతం వినిహన్తి యథా క్రమమ్ 186**

సంధ్య, రాత్రి, పగటి సమయములో గండయోగములో జన్మించిన బాలకుడు క్రమముగా తనను, తన తల్లిని, తన తండ్రిని చంపును.

**యాత్రాయాం స్యాచ్చోర భయం వివాహే మృత్యురేవ చ**
**జననీ పితరౌ హన్తి వదత్యేవం బృహస్పతిః 187**

గండయోగములో యాత్ర చేసిన దొంగల వలన భయము, వివాహము చేసికొనిన మృత్యువు కలుగును. ఈ యోగములో మాతాపితలకు మరణము కలుగునని బృహస్పతి తెలిపెను.

**గండశాంతి విధానము :**

**గణ్డారిష్టే చన్దనం చ కుష్ఠ గోరోచనం తథా**
**ఘృతేన మిశ్రితం కృత్వా చతుర్భిః కలశైస్తతః 187**
**సహస్ర శీర్షా మన్త్రేణ బాలకం స్నానయేద్ బుధః**
**పితృయుక్తం దివాజాతం మాతృయుక్తంచ రాత్రికమ్ 189**
**స్థాపయేద్ పితృమాతృభ్యాం సన్ధ్యయోరుభయోరపి**

**కాంస్యపాత్రం ఘృతైః పూర్ణం దద్యాద్ గణ్డోపశాన్తయే** 190
**కృష్ణం ధేనుం సువర్ణం చ గ్రహజాప్యం చ కారయేత్**
**ఆశ్లేషాయాం చ మూలేఽపి శాన్తిరేవం విధీయతే** 191

గండారిష్టము కలిగినపుడు చందనము, కుష్ఠము (సుగంధ ద్రవ్యము) గోరోచనమును నెయ్యిలో కలిపి నాలుగు కలశములలో నుంచవలెను. పండితుడు సహస్రశీర్షమంత్రమును బాలకుడు పగలు జన్మించిన తండ్రితో రాత్రి జన్మించిన తల్లితో రెండు సంధ్యలలో జన్మించిన మాత పితలతో కూడి బాలకునికి స్నానము చేయించవలెను. గండశాంతి కొరకు నెయ్యితో కూడిన కంచు పాత్రను, నల్లని గోవును, బంగారమును దానము చేయువలెను. గ్రహ జపమును చేయించవలెను. ఇదే విధముగా ఆశ్లేషమూల నక్షత్రములలో కూడ చేయవలెను.

**శుభాశుభయోగము :**

**న లగ్న మిన్దుం చ గురుర్నిరీక్షతే**
**న వా శశాఙ్కో రవిణా సమాగతః**
**స పాపకోఽర్కేణ యుతోఽథవా శశీ**
**పరేణ జాతం ప్రవదన్తి నిశ్చయమ్** 192

గురుడు లగ్నమును చంద్రుని చూడకున్న, చంద్రుడు సూర్యునితో కూడియుండకున్న లేక చంద్రుడు పాప గ్రహములు మరియు సూర్యునితో కూడియున్న జాతకుడు ఇతరుల వలన జన్మించెనని పండితులు తెలిపెదరు.

**గురుక్షేత్రే గతే చన్ద్రే తద్యుక్తే వాన్యవేశ్మని**
**నద్రేష్కాణే నవాశే వా జాయతే చ పరేణ సః** 193

చంద్రుడు గురుని స్థానములోనున్న లేక గురునితో కూడి ఇతర గ్రహముల గృహములోనున్న, ద్రేక్కాణనవాంశములలో లేకున్న బాలకుడు ఇతరుల వలన జన్మించెనని తెలిసికొనవలెను.

**భౌమక్షేత్రే యదాజీవో మూర్తౌ క్రూర గ్రహో భవేత్**
**వర్ష మధ్యే భవేన్మృత్యుర్బాలకస్య న సంశయః** 194

కుజుని స్థానములో గురుడున్న, లగ్నములో క్రూర గ్రహములున్న బాలకుడు సంవత్సరము లోపలనే నిస్సందేహముగా మృత్యువును పొందును.

**క్షీణచన్ద్రో ద్వాదశస్థో దుఃఖదః పాపవీక్షితః**
**కరోతి విపులం క్లేశమష్టమస్థో యదాశనిః** 195

శని అష్టమ గృహములో నుండి పాపగ్రహములతో చూడబడిన క్షీణ చంద్రుడు ద్వాదశ గృహములోనున్న దుఃఖమును కలిగించును.

**ద్వాదశే చ యదా చన్ద్రః షష్ఠే పాప గ్రహో భవేత్**
**అల్పాయుశ్చ సదా రోగీ జాయతే జాతకో ధ్రువమ్** 196

ద్వాదశ గృహములో చంద్రుడు షష్ఠమములో పాపగ్రహములున్న జాతకుడు నిశ్చయముగా స్వల్పాయువు కలవాడు రోగి యగును.

**దశమే భవనే రాహుః పితృమాత్రోః ప్రపీడకః**
**ద్వాదశే వత్సరే తస్య జాతకో మరణం ధ్రువమ్** 197

దశమ గృహములో రాహువున్న జాతకుని మాతాపితలకు పీడ కలుగును. ఆ బాలునికి పన్నెండు వత్సరములలో మరణము కలుగును.

**రిపుస్థానే యదాపాపో వ్యయస్థానే చ చన్ద్రమాః**
**చతుర్థే మఙ్గలో యస్య మాతా తస్య న జీవతి** 198

షష్ఠ స్థానములో పాప గ్రహములు, ద్వాదశ స్థానములో చంద్రుడు చతుర్థములో కుజుడున్న జాతకుని తల్లి జీవించదు.

**లగ్నస్థానే యదాసౌరిః శత్రుస్థానే చ చన్ద్రమాః**
**కుజస్తు సప్తమస్థానే పితాతస్య న జీవతి** 199

లగ్నములో శని షష్ఠమములో చంద్రుడు, సప్తమ స్థానములో కుజుడున్న జాతకుని తండ్రి జీవించడు.

**చతుర్థే మాతృహా పాపో దశమే పితృహా భవేత్**
**సప్తమే భవనే పాపః పితృమాత్రోర్వినాశకః** 200

చతుర్థములో పాపగ్రహమున్న తల్లికి, దశమములోనున్న తండ్రికి సప్తమ స్థానములోనున్న మాతాపితలకు నాశనము కలుగును.

**ద్వాదశే రిపుభావే వా యదా క్రూరో వ్యవస్థితః**
**తదా మాతృభయం విద్యాచ్చతుర్థే దశమే పితుః** 201

ద్వాదశ, షష్ఠమ గృహములలో క్రూర గ్రహములున్న తల్లికి భయము కలుగును. చతుర్థ దశమములలో క్రూర గ్రహములున్న తండ్రికి భయమగునని తెలిసికొనవలెను.

**ఉచ్చో వా యది వా నీచః సప్తమస్థో యదా రవిః**
**తదా జాతో నిహన్త్యాశు మాతరం నాత్రసంశయః** 202

ఉచ్చలో లేక నీచలో సూర్యుడు సప్తమ స్థానములోనున్న జాతకుడు నిస్సందేహముగా తల్లికి మరణము కలిగించును.

**వర్ష క్రమముతో నాశ విచారము**

**నాగ గో సిద్ధ జాతీ షు క్ష్మా బ్ధి శివ నఖా ధృతిః**
**క్ష్మా శ్వి దిక్ చేష్వజాద్యంశైస్తుల్యాబ్దైశ్చ విధౌ వ్యసుః** 203

పై శ్లోకములో తెల్పిన సంఖ్యలతో సమానమైన వర్షములలో మేషాది రాశులలో చంద్రుదున్నపుడు మరణము కలుగునని తెలిసికొనవలెను ఉదాహరణకు చంద్రుడు మేష రాశిలోనున్న 8 సంవత్సరములలో, వృషభములోనున్న 9 సంవత్సరములలో అదే విధముగా మిగిలిన రాశులలో చంద్రుడున్నపుడు క్రమముగా 24, 12, 5, 1, 4, 11, 20, 18, 21, 10 సంవత్సరాలలో మరణము కలుగును.

**లగ్నే శనిర్యదా భౌమో రాహుః సూర్యశ్చ సంస్థితః**
**సన్తాపో రక్తదోషస్య సర్వసౌమ్యేష్వరోగితా 204**

లగ్నములో శని, కుజుడు, రాహువు, సూర్యులున్న సంతాపము రక్త దోషమగును, లగ్నములో శుభ గ్రహములున్న రోగరహితుడగును.

**కేన్ద్రే శుభో యదైకోఽపి బలీ విశ్వప్రకాశకః**
**సర్వేదోషాః క్షయం యాన్తి దీర్ఘాయుశ్చ భవేన్నరః 205**

జగత్తుకు ప్రకాశమును కలిగించు శుభ గ్రహము కేంద్రములోనున్న జాతకుని దోషములన్ని నశించును అతడు అధిక ఆయువు కలవాడగును.

**అర్కః కేన్ద్రే యదా చన్ద్రో మిత్రాంశే గురుణేక్షితః**
**విత్తవాన్ జ్ఞానసమ్పన్నో జాయతే చ తదా నరః 206**

సూర్యుడు కేంద్రములోనున్న, చంద్రుడు గురువుతో చూడబడుతు మిత్రాంశములోనున్న జాతకుడు ధనవంతుడు జ్ఞానియగును.

**బుధోవా భార్గవో వాపి కేన్ద్రే వా యది సంస్థితః**
**బలినానుదితోఽరిష్టం సర్వం నాశయతి ధ్రువమ్ 207**

బుధ, శుక్రులు, బలవంతులై కేంద్రములోనున్న నిశ్చయముగా అరిష్టములన్ని నాశనమును పొందును.

**శుభాశుభయోగము సమాప్తము**

--- oOo ---

**జన్మవారముతో ఆయుర్జ్ఞానము**

**విపదః ప్రథమే మాసే ద్వాత్రింశే చ త్రయోదశే**
**షష్ఠేఽపి చ యదా సూర్యే జాతో జీవతి షష్టికమ్ 208**

రవివారము జన్మించిన వ్యక్తికి మొదటి మాసములో, ముప్పది రెండవ, పదమూడవ, ఆరవ సంవత్సరములలో పీడకలగును. అరువది సంవత్సరములు జీవించును.

**ఏకాదశేఽష్టమే మాసే చన్ద్రే పీడా చ షోడశే**
**సప్త వింశతిమే వర్షే చతుర్యుక్తాశితౌ మృతిః 209**

సోమవారము జన్మించిన వ్యక్తికి పదకొండవ, ఎనిమిదవ మాసములలో పదహారవ, ఇరువది ఏడవ సంవత్సరములలో పీడకలుగును. ఎనుబదినాలుగు సంవత్సరములు జీవించును.

**ద్వాత్రింశే చ ద్వితీయే చ వర్షే పీడా చ మఙ్గలే**
**చతుః సప్తతివర్షాణి సదా రోగీ స జీవతి** **210**

మంగళవారము జన్మించిన వ్యక్తికి ముప్పది రెండవ, ద్వితీయ సంవత్సరములలో పీడకలుగును. అతడు ఎల్లప్పుడు రోగముతో నుండును. డెబ్బది నాలుగు సంవత్సరములు జీవించును.

**బుధవారేష్టమే మాసే పీడా వర్షే తథాష్టమే**
**పూర్ణే చతుఃషష్టివర్షే తతో మృత్యుర్భవిష్యతి** **211**

బుధవారము జన్మించిన వ్యక్తికి ఎనిమిదవ మాసములో పన్నెండు సంవత్సరములో పీడకలుగును. అరువది నాలుగు సంవత్సరములు జీవించును.

**గురౌ చ సప్తమే మాసే షోడశే చ త్రయోదశే**
**పీడా తతశ్చతుర్యుక్తాశీతి వర్షాణి జీవతి** **212**

గురువారము జన్మించిన వ్యక్తికి ఏడవ మాసములో, పదహారవ పదమూడవ సంవత్సరములలో పీడ కలుగును ఎనుబది నాలుగు సంవత్సరములు జీవించును.

**శుక్రవారే చ జాతస్య దేహో రోగవివర్జితః**
**షష్టివర్షే చ సమ్పూర్ణే మ్రియతే మానవో ధ్రువమ్** **213**

శుక్రవారము జన్మించిన వ్యక్తి రోగ రహితుడుగును. నిశ్చయముగా అరువది సంవత్సరముల తర్వాతనే మరణించును.

**శనౌ చ ప్రథమే మాసే పీడాష్టాదశవత్సరే**
**దృఢదేహస్తదాజాతః శతం వర్షాణి జీవతి** **214**

శనివారము జన్మించిన వ్యక్తికి మొదటి మాసము పద్దెనిమిదవ సంవత్సరములో పీడకలుగును. మంచి దేహబలముతో వంద సంవత్సరములు జీవించును.

**జన్మవార ఫలము :**

**మిష్టాన్న భోగీ మానీ చ క్రోధీ చ రతిలాలసః**
**పిత్తాదికో రవేర్వారే ధనకామీ భవేన్నరః** **215**

రవివారము జన్మించిన వ్యక్తి మిష్టాన్నము (తీపి) ను భుజించువాడు, అభిమాని, క్రోధి, రతిక్రియలో ఆసక్తి కలవాడు అధిక పిత్త తత్త్వము కలవాడు ధనముకోరువాడగును.

**భోగీ కామీ శాస్త్రవేత్తా గునీ ధనీ జితేన్ద్రియః**
**విద్యాధికః శీలయుక్తో జాయతే సోమవాసరే 216**

సోమవారము జన్మించిన వ్యక్తి భోగి, కామి, శాస్త్రవేత్త, గుణి, ధని జితేంద్రియుడు, విద్యాధికుడు శీలయుక్తుడగును.

**మూర్ఖప్రియో ధనీక్రూరః శ్రుతిస్మృతివినిన్దకః**
**నాస్తికో వేదహీనశ్చ భౌమే భోగీ భవేన్నరః 217**

మంగళవారము జన్మించిన వ్యక్తి మూర్ఖులను ప్రేమించువాడు. ధని, క్రూరుడు, వేదములను స్మృతులను నిందించువాడు, నాస్తికుడు, వేదహీనుడు భోగియగును.

**వేదశాస్త్ర క్రియా యుక్తో దయాలుశ్చ బహుశ్రుతః**
**భయానకో యోగయుక్తో జాయతే బుధవాసరే 218**

బుధవారము జన్మించిన వ్యక్తి వేదశాస్త్రములనాచరించువాడు దయాళువు, పురాణములను వినువాడు భయానకుడు యోగయుక్తుడగును.

**వేదవిజ్ఞోఽగ్ని హోత్రీ చ పుత్రపౌత్రధనాన్వితః**
**పూర్ణవేత్తా గురౌవారే సర్వలక్షణ సంయుతః 219**

గురువారము జన్మించిన వ్యక్తి వేదములను తెలిసినవాడు అగ్నిహోత్రుడు, యజ్ఞము చేయువాడు, పుత్రపౌత్ర ధనములతో కూడినవాడు పూర్ణవిద్వాంసుడు సర్వలక్షణ సంపన్నుడగును.

**పుత్రీ భోగీ ధనీ శూరః కృపాలుర్బహుసేవకః**
**దైవజ్ఞోఽపిజనః శుక్రే దినే యది చ జాయతే 220**

శుక్రవారము జన్మించిన వ్యక్తి అధికమైన పుత్రులు కలవాడు, భోగి, ధని, వీరుడు, దయాళువు, అనేక మంది సేవకులు కలవాడు జ్యోతిష్కుడగును.

**నీచసక్తః కృతఘ్నశ్చ కుటిలో బన్ధుపీడకః**
**కృతకార్యహరో రోషీ జాయతే శనివాసరే 221**

శనివారము జన్మించిన వ్యక్తి నీచ క్రియలందా సక్తి కలవాడు, కృతఘ్నుడు, కుటిలుడు బంధువులను పీడించువాడు. కార్యములను నాశనము చేయువాడు క్రోధము కలవాడగును.

**మేషాదిరాశిస్థ ఫలము :**

**లోలనేత్రః సదారోగీ ధర్మార్థకృతనిశ్చయః**
**పృథుజఙ్ఘ కృతజ్ఞశ్చ విక్రాన్తో రాజపూజితః 222**
**కామినీ హృదయానన్దో దాతాభీతో జలాదపి**
**చణ్డకర్మా మృదుశ్చాన్తే మేషరాశౌ భవేన్నరః 223**

మేషరాశిలో జన్మించిన వ్యక్తి చంచల నేత్రములవాడు, సదారోగి ధర్మకార్యనిరతుడు, లావైనతొడలు కలవాడు కృతజ్ఞుడు, బలవంతుడు రాజపూజితుడు స్త్రీ హృదయమునకు ఆనందము కలిగించువాడు దాని, నీటితో భయపడవాడు, ఘోరకర్మలు చేయువాడు చివరిలో కోమల హృదయముకలవాడగును.

**భోగీ దాతా శుచిర్దక్షో మహాగర్వోమహాబలః**
**ధనీ విలాసీ తేజస్వీ సుమిత్రశ్చ వృషే భవేత్ 224**

వృషభరాశిలో జన్మించినవాడు భోగి, దాని, పవిత్రుడు, చతురుడు అభిమానవంతుడు, మహాబలుడు, ధని, విలాసుడు, తేజస్వి, సుందరమైన మిత్రులు కలవాడగును.

**మిష్టవాక్యో లోలదృష్టిర్దయాలుర్మైథునప్రియః**
**గాన్ధర్వవిత్ కణ్ఠరోగీ కీర్తిభాగీ ధనీగుణీ 225**
**గౌరో దీర్ఘః పటుర్వక్తా మేధావీ చ దృఢవ్రతః**
**సమరో హ్యతివాదీ చ జాయతే మిథునే నరః 226**

మిథునరాశిలో జన్మించిన వ్యక్తి మధురవచనములు పలుకువాడు చంచల దృష్టి కలవాడు, దయావంతుడు, మైథునప్రియుడు, గాయకుడు కంఠరోగము కలవాడు, యశస్వి, ధని, గుణి, గౌరవర్ణము కలవాడు. పొడగరి మంచి వక్త, బుద్ధిమంతుడు, దృఢసంకల్పము కలవాడు, సమర్థుడు, అతివాదియగును.

**కార్యకారీ ధనీ శూరో ధర్మిష్ఠో గురువత్సలః**
**శిరోరోగీ మహాబుద్ధిః కృశాఙ్గః కృతవిత్తమః 227**
**ప్రవాసశీలః కోపాన్ధో బాల్యే దుఃఖీ సుమిత్రకః**
**అనాసక్తో గృహే వక్తా కర్కరాశౌ భవేన్నరః 228**

కర్కాటక రాశిలో జన్మించినవాడు కార్యశీలుడు, ధని, శూరుడు, ధర్మవంతుడు, గురువు ప్రేమను పొందువాడు, శిరో రోగి, మహాబుద్ధిమంతుడు, దుర్బలశరీరుడు, చేసినకార్యమును తెలిసికొన్నవాడు పరదేశముననుండువాడు. క్రోధముతో అంధత్వమును పొందినవాడు. బాల్యావస్థలో దుఃఖముననుభవించినవాడు, సుందరమైన మిత్రులు కలవాడు గృహమన్న ఆసక్తి లేనివాడు, వక్తయగును.

**క్షమాయుక్తస్త్రపాయుక్తో మద్యమాంసరతః సదా**
**దేశభ్రమణశీలశ్చ శీతభీతః సుమిత్రకః 229**
**వినయీ శీఘ్రకోపశ్చ జననీజనవల్లభః**
**వ్యసనీ ప్రకటో లోకే సింహే రాశౌ నరోభవేత్ 230**

సింహరాశిలో జన్మించినవాడు క్షమాయుక్తుడు, లజ్జాశీలుడు

మద్యమాంసములను సేవించువాడు, దేశములు తిరుగువాడు, చలికి భయపడువాడు సుందరమైన మిత్రులు కలవాడు, సుశీలుడు, శీఘ్ర క్రోధము కలవాడు తల్లికి ప్రియుడు, వ్యసనపరుడు, లోకములో ప్రసిద్ధుడగును.

**విలాసీ సుజనాహ్లాదీ శుభలక్షణపూరితః**
**దాతాదక్షః కవివర్యృద్ధో వేదమార్గపరాయణః** **231**
**సర్వలోకప్రియో నాట్యగన్ధర్వవ్యసనే రతః**
**ప్రవాసశీలః స్త్రీ దుఃఖీ కన్యాజాతో భవేన్నరః** **232**

కన్యారాశిలో జన్మించినవాడు విలాసి, సజ్జనులకు ఆనందము కలిగించువాడు, శుభలక్షణయుక్తుడు, దాని. నిపుణుడు, శ్రేష్ఠ కవి, వేదవిహిత మార్గములో నడచువాడు, లోకులకుహితుడు, నాట్యగానములందాసక్తికలవాడు ప్రవాసశీలుడు స్త్రీ వలన దుఃఖమును పొందువాడగును.

**స్వస్థానరోషణే దుఃఖీ పటభాషీ కృపాన్వితః**
**చఞ్చలాక్షశ్చ లక్ష్మీకో గృహమధ్యేఽతి విక్రమః** **233**
**వాణిజ్యదక్షో దేవానాం పూజకో మిత్రవత్సలః**
**ప్రవాసీ సుహృదామిష్టస్తులే జాతో భవేన్నరః** **234**

తులారాశిలో జన్మించినవాడు గృహములో క్రోధముతోనుండువాడు, దుఃఖి, సంభాషణా ప్రవీణుడు, దయాళువు, చంచలనేత్రములవాడు, లక్ష్మీయుక్తుడు, గృహములో పెద్దవాడు, బలవంతుడు, వ్యాపారనిపుణుడు, దేవతలను పూజించువాడు. పరదేశవాసి, సజ్జనప్రియుడగును.

**బాలప్రవాసీ క్రూరాత్మాశూరః పిఙ్గలలోచనః**
**పరదారరతో మానీ నిష్ఠురః స్వజనే జనే** **235**
**సాహసప్రాప్తలక్ష్మీకో జనన్యామపి దుష్టధీః**
**ధూర్తశ్చోరః కలారమ్భీ వృశ్చికే జాయతే నరః** **236**

వృశ్చిక రాశిలో జన్మించినవాడు బాల్యావస్థలో పరదేశములో నుండువాడు, క్రూరస్వభావుడు, వీరుడు. పింగళ (పచ్చని) నేత్రములవాడు, పరస్త్రీరతుడు, అభిమాని, స్వజనులతో కఠినముగా వ్యవహరించువాడు, సాహసముతో ధనార్జన చేయువాడు, తల్లితో కూడ దుష్ట ప్రవర్తన కలిగినవాడు, ధూర్తుడు, చోరుడు, కళలనారంభించువాడగును.

**శూరః సమధియా యుక్తః సాత్వికో జననన్దనః**
**శిల్ప విజ్ఞాన సంపన్నో ధనాఢ్యో దివ్యభార్యకః** **237**

**మానీ చరిత్ర సమ్పన్నో లలితాక్షరభాషకః**
**తేజస్వీ స్థూలదేహశ్చ ధనుర్జాతః కులాన్తకః** **238**

ధనూరాశిలో జన్మించినవాడు వీరుడు, సామాన్య బుద్ధి కలవాడు, సాత్వికుడు లోకులకు ఆనందము కలిగించువాడు, శిల్పవిద్యానిపుణుడు, ధని, సుందరియైనభార్య కలవాడు, అభిమాని, సచ్చరిత్రుడు, మనోహరముగా పలుకువాడు, తేజస్వి, స్థూల శరీరుడు, కులమును నాశనము చేయువాడగును.

**కులే నేష్టో వశః స్త్రీణాం పణ్డితః పరివారకః**
**గీతజ్ఞో లాలసీ గుహ్యః పుత్రాఢ్యోమాతృవత్సలః** **239**
**ధనీ త్యాగీ సభృత్యశ్చ దయాలుర్బహుబాన్ధవః**
**పరిచిన్తితసౌఖ్యశ్చ మకరే జాయతే నరః** **240**

మకరరాశిలో జన్మించివాడు కులములో ముఖ్యుడు స్త్రీల వశములో నుండువాడు, పండితుడు, అధిక పరివారము కలవాడు, గానమును తెలిసినవాడు మహత్వాకాంక్షి, గుప్తముగా నుండువాడు, పుత్రులు కలవాడు తల్లికి ప్రియుడు, ధని, దాని, మంచిసేవకులు కలవాడు, దయాళువు, అధికముగా సోదరులు కలవాడు సుఖ చింతనచేయువాడగును.

**దాతాలసః కృతజ్ఞశ్చ గజవాజిధనేశ్వరః**
**శుభదృష్టిః సదాసౌమ్యో మానీ విద్యాకృతోద్యమః** **241**
**ధనాఢ్యః స్నేహహీనశ్చ ధనీభోగీ స్వశక్తితః**
**శాలూరకుక్షినిర్భీతః కుమ్భే జాతో భవేన్నరః** **242**

కుంభరాశిలో జన్మించిన వ్యక్తి దాని, ఆలసి, కృతజ్ఞుడు గజాశ్వధనాధిపతి, మంచి దృష్టికలవాడు, సౌమ్యుడు, అభిమాని, విద్యపార్జనకు కష్టపడువాడు, ధనవంతుడు, స్నేహశీలుడు, ధని, భోగి, బలవంతుడు, శాలూరపక్షివలె కుక్షి (గర్భము) కలవాడు, నిర్భయుడగును.

**గమ్భీరచేష్టితః శూరః పటుర్వాగ్మీ నరోత్తమః**
**కోపనః కృపణో జ్ఞానీ కులశ్రేష్ఠః కులప్రియః** **243**
**నిత్యసేవీ శీఘ్రగామీ గాన్ధర్వకుశలః శుభః**
**మీనరాశౌ సముత్పన్నో జాయతే బన్ధువత్సలః** **244**

మీనరాశిలో జన్మించివాడు గంభీరమైన చేష్టలు చేయువాడు, శూరుడు మంచి భాషణము చేయువాడు, నరోత్తముడు, క్రోధి, పిసినారి, జ్ఞాని కులశ్రేష్ఠుడు, కులమునకు ప్రియుడు, నిత్యము సేవించువాడు శీఘ్రగామి, గాననిపుణుడు, సోదరులను ప్రేమించువాడగును.

**సంక్షేపతః జన్మరాశిఫలము**

**మేషేదీనో వృషేమానీ పటుబుద్ధిశ్చ మన్మథే**
**క్రూరః కర్కే ధృతిః సింహే కన్యాయాం బహుమాయితా 245**
**జూకే స్త్రీత్వమలౌ మానీ చాపే పాపాశయో నరః**
**ముఖరో మకరే కుమ్భే చతురః స్థిరధీర్ఝషే 245**

సంక్షేపముగా మేషాదిరాశులలో జన్మించిన వ్యక్తి లక్షణములు తెలుపబడుచున్నవి. మేషములో దీరుడు, వృషభములో అభిమాని, మిథునములో అధికబుద్ధిమంతుడు, కర్కాటకములో మహారాజు, సింహములో ధైర్యవంతుడు, కన్యలో అధికమాయలు చేయువాడు, తులలో స్త్రీ భావముకలవాడు, వృశ్చికములో అభిమాని, ధనుస్సులో పాపి, మకరములో నిష్ఠురవచనములు పలుకువాడు, కుంభములో చతురుడు, మీనములో జన్మించిన బుద్ధిమంతుడగును.

**జన్మరాశిఫలము సమాప్తము**

--- oOo ---

**జన్మలగ్నఫలము :**

**మేషలగ్నే సముత్పన్నశ్చణ్డో మానీ సకోపకః**
**సుధీః స్వజనహన్తా చ విక్రమీ పరవత్సలః 246**

మేషలగ్నములో జన్మించినవాడు తేజస్వి, అభిమాని, క్రోధయుక్తుడు మంచిబుద్ధి కలవాడు, సోదరులను నాశనము చేయువాడు, పరాక్రమవంతుడు, ఇతరులు ప్రేమించువాడగును.

**వృషలగ్న భవో బాల్యే గురుభక్తః ప్రియంవదః**
**గుణీ కృతీ ధనీ లుబ్ధః శూరః సర్వజనప్రియః 247**

వృషభలగ్నములో జన్మించినవాడు గురుభక్తి కలవాడు, ప్రియవచనములు పలుకువాడు, గుణి, కృతి (నిర్మాణము చేయువాడు) ధని, లోభి, వీరుడు అందరికి ప్రియుడగును.

**మిథునోదయసఞ్జాతో మానీ స్వజనవత్సలః**
**త్యాగీ భోగీ ధనీ కామీ దీర్ఘ సూత్ర్యరిమర్దకః 248**

మిధున లగ్నములో జన్మించినవాడు అభిమాని, సోదరులకు ప్రియుడు, దాని, భోగి, ధని, కామి దీర్ఘసూత్రి, ఎత్తైన భోజనాలయములు నిర్మించువాడు శత్రువులను సంహరించువాడగును.

**కర్కలగ్నే సముత్పన్నే భోగీ ధర్మీ జనప్రియః**
**మిష్టాన్నపానభోగీ చ సౌభాగ్యః స్వజనప్రియః 249**

కర్కాటక లగ్నములో జన్మించినవాడు భోగి, దార్మికుడు, జనులకు ప్రియుడు, మధురాన్నమునుతినువాడు భాగ్యశాలి, సోదరులకు ప్రియుడగును.

**సింహలగ్నోదయే జాతో భోగీ శత్రువిమర్దకః**
**స్వల్పోదరోఽల్పపుత్రశ్చ సోత్సాహీ రణవిక్రమః 250**

సింహ లగ్నములో జన్మించినవాడు. భోగి, శత్రువులను సంహరించువాడు. చిన్న ఉదరము (పొట్ట) కలవాడు. అల్పసంతానము కలవాడు, ఉత్సాహి యుద్ధములో పరాక్రమవంతుడగును.

**కన్యాలగ్నభవో బాలో నానాశాస్త్రవిశారదః**
**సౌభాగ్యగుణసమ్పన్నః సున్దర సురతప్రియః 251**

కన్యాలగ్నములో జన్మించిన బాలకుడు శాస్త్రములలో నిపుణుడు సౌభాగ్యశాలి, గుణవంతుడు, సుందరుడు సురతప్రియుడగును.

**తులా లగ్నోదయే జాతః సుధీః సత్కర్మజీవనః**
**విద్వాన్సర్వకలాభిజ్ఞో ధనాఢ్యో జనపూజితః 252**

తులా లగ్నములో జన్మించినవాడు బుద్ధిమంతుడు, మంచి పనులతో జీవనము చేయువాడు, విద్వాంసుడు, సర్వకళలు తెలిసినవాడు, ధనవంతుడు లోకపూజితుడగును.

**వృశ్చికోదయ సఞ్జాతః శౌర్యవానతిదుష్టధీః**
**విజ్ఞాన జ్ఞానసమ్పన్నః సుఖీ సువిగ్రహః సుధీః 253**

వృశ్చిక లగ్నములో జన్మించినవాడు శూరుడు అతిదుష్ట బుద్ధికలవాడు, విజ్ఞానవంతుడు, సుఖి, సుందరమైన దేహము కలవాడు బుద్ధిమంతుడగును.

**ధనుర్లగ్నోదయే జాతో నీతిమాన్ధర్మవాన్ సుధీః**
**కులమధ్యే ప్రధానశ్చ ప్రాజ్ఞ సర్వస్య పోషకః 254**

ధనుర్లగ్నములో జన్మించినవాడు నీతిమంతుడు, ధర్మవంతుడు, బుద్ధిమంతుడు, కులశ్రేష్ఠుడు, చతురుడు అందరిని పాలించువాడగును.

**మకరోదయసఞ్జాతో నీచకర్మ బహుప్రజః**
**లుబ్ధో వినష్టోఽలసశ్చ స్వకార్యేషు కృతోద్యమః 255**

మకరలగ్నములో జన్మించినవాడు బాలకుడు నీచకర్మ చేయువాడు, అధిక సంతానము కలవాడు, లోభి, నష్టజాతకుడు, ఆలసి, తన పనిని పూర్తి చేయువాగును.

**కుమ్భలగ్నోదయే జాతశ్చలచిత్తోఽతిసౌహృతః**
**పరదారరతో నిత్యం మృదుకాయో మహాసుఖీ 257**

కుంభ లగ్నములో జన్మించినవాడు చంచలచిత్తము కలవాడు అధిక మిత్రులు కలవాడు. పరస్త్రీరతుడు కోమలదేహముకలవాడు, మహాసుఖవంతుడగును.

**మీనలగ్నోదయే జాతో రత్నకాఞ్చనపూరితః**
**అల్పకామోఽతిరక్తశ్చ దీర్ఘకాలవిచిన్తకః 258**

మీనలగ్నములో జన్మించినవాడు రత్నములు బంగారముతో కూడినవాడు అల్పకాముకుడు, అధిక దుర్బలుడు, ఎక్కువ సమయము వరకు చింతన చేయువాడగును.

**జన్మలగ్నఫలము సమాప్తము**

--- oOo ---

**జన్మతిథి ఫలము**

**క్రూరసఙ్గీ ధనైర్హీనః కులసన్తాపకారకః**
**వ్యసనాసక్తచిత్తశ్చ ప్రతిపత్తిథిజో నరః 259**

పాడ్యమిలో జన్మించినవాడు క్రూరులతో సహవాసము చేయువాడు, ధనహీనుడు కులమును సంతాపమునకు గురిచేయువాడు వ్యసనాసక్తుడగును.

**పరదారరతో నిత్యం సత్యశౌచవివర్జితః**
**తస్కరః స్నేహహీనశ్చ ద్వితీయ సమ్భవో నరః 260**

ద్వితీయ తిథిలో జన్మించినవాడు పరస్త్రీరతుడు, సత్యపవిత్రతలు లేనివాడు చోరుడు స్నేహరహితుడగును.

**అచేతనోఽతి వికలో నిర్ద్రవ్యో దుర్బలః సదా**
**పరద్వేషరతో నిత్యం తృతీయాయాం భవేన్నరః 261**

తృతీయ తిథిలో జన్మించినవాడు చైతన్యరహితుడు అతివికలుడు (చేడుస్వభావముకలవాడు) ద్రవ్యహీనుడు, దుర్బలుడు, ఇతరులను ద్వేహించువాడుగును.

**మహాభోగీ చ దాతాచ మిత్రస్నేహవిచక్షణః**
**ధనసన్తాన యుక్తశ్చ చతుర్థ్యా యది జాయతే 262**

చతుర్థీ తిథిలో జిన్మించినవాడు మహాభోగి, దాని, మిత్రులతో స్నేహము చేయువాడు, ధన సంతానములతో కూడినవాడగును.

**వ్యవహారీ గుణగ్రాహీ మాతృపిత్రోశ్చ రక్షకః**
**దాతా భోక్తా తనుప్రీతిః పఞ్చమీసమ్భవోనరః 263**

పంచమి తిథిలో జన్మించినవాడు వ్యవహారకుశలుడు, గుణములను గ్రహించువాడు, మాతాపితలను రక్షించువాడు, దాని, భోగి, కొంచము ప్రీతి కలవాడగును.

**నానాదేశాభిగామీ చ సదా కలహకారకః**
**నిత్యం జఠరదోషీ చ షష్ఠీ జాతో భవేన్నరః 264**

షష్ఠి తిథిలో జన్మించినవాడు అనేక దేశములు తిరుగువాడు, ఎప్పుడు యుద్ధము చేయువాడు. నిత్యము ఉదర రోగముతో బాధపడువాడు రోగీయగును.

**అల్పతోషీ చ తేజస్వీ సౌభాగ్యగుణసున్దరః**
**పుత్రవాన్ ధనసమ్పన్నః సప్తమ్యాం జాయతే నరః 265**

సప్తమి తిథిలో జన్మించినవాడు అల్పసంతుష్టి కలవాడు, తేజస్వి, సౌభాగ్య గుణములతో సుందరుడు, పుత్రవంతుడు ధనియగును.

**ధర్మిష్ఠః సత్యవాదీ చ దాతా భోక్తాచ వత్సలః**
**గుణజ్ఞః సర్వకాలజ్ఞశ్చాష్టమీ సమ్భవో నరః 265**

అష్టమి తిథిలో జన్మించివాడు ధార్మికుడు, సత్యవాది, దాని, భోగి, సర్వులకు ప్రియుడు, గుణి కార్యములన్నింటిని తెలిసినవాడగును.

**దేవతారాధకః పుత్రీ ధనీస్త్రీమగ్నమానసః**
**శాస్త్రాభ్యాసరతో నిత్యం నవమ్యాం యది జాయతే 267**

నవమి తిథిలో జన్మించివాడు దేవతలను ఆరాధించువాడు, పుత్రవంతుడు, ధని, స్త్రీలయందాసక్తికలవాడు శాస్త్రాభ్యాసము చేయుట యందాసక్తి కలవాడగును.

**దశమ్యాం సర్వధర్మజ్ఞో దేవదేవీ చ జాపకః**
**గుణీ ధనీ వేదవిజ్ఞో బన్ధువిప్రప్రియో జనః 268**

దశమి తిథిలో జన్మించినవాడు సర్వధర్మ లీలలను తెలిసినవాడ, దేవతలను సేవించువాడు, జపము చేయువాడు. గుణి, ధని, వేదములు తెలిసినవాడు బంధుబ్రహ్మణ ప్రియుడగును.

**ఏకాదశ్యాం నరేన్ద్రస్య గేహగామీ శుచిర్భవేత్**
**ధర్మజ్ఞశ్చ వివేకీ చ గురుశుశ్రూషకో గుణీ 269**

ఏకాదశీ తిథిలో జన్మించినవాడు రాజ గృహమునకు వెళ్ళువాడు, పవిత్రుడు ధర్మమును తెలిసినవాడు, వివేకి, గురుసేవను చేయువాడు గుణియగును.

**చపలచఞ్చలజ్ఞానః సదా క్షీణః స్వరూపతః**
**దేశభ్రమణశీలశ్చ ద్వాదశ్యాం జాయతే నరః 270**

ద్వాదశి తిథిలో జన్మించినవాడు చపలుడు, చంచలజ్ఞానము కలవాడు, సదాక్షీణ శరీరము కలవాడు, పరదేశములో తిరుగువాడగును.

**మహాసిద్ధో మహాప్రజ్ఞః శాస్త్రాభ్యాసీ జితేన్ద్రియః**
**పరకార్యరతో నిత్యం త్రయోదశ్యాం ప్రజాయతే 271**

త్రయోదశి తిథిలో జన్మించినవాడు మహాసిద్ధుడు, మహాబుద్ధిమంతుడు, శాస్త్రాభ్యాసము చేయువాడు, ఇంద్రియ నిగ్రహము కలవాడు ఇతరుల కార్యములలో ఆసక్తి కలవాడగును.

**ధనాఢ్యో ధర్మశీలశ్చ శూరః సద్వాక్యపాలకః**
**రాజమన్యో యశస్వీ చ చతుర్దశ్యాం నరోభవేత్ 272**

చతుర్దశి తిథిలో జన్మించినవాడు ధని, ధర్మశీలుడు, శూరవీరుడు, మంచి వచనములను పాలించువాడు, రాజులచే పూజింపబడువాడు యశస్వియగును.

**శ్రీయుతో మతియుక్తశ్చ మహాభోజనలాలసః**
**ఉజ్జ్వలః పరదారేషురతో నా పూర్ణిమాభవః 273**

పౌర్ణిమి తిథిలో జన్మించినవాడు, ధనవంతుడు, బుద్ధిమంతుడు, భోజనమునందాసక్తి కలవాడు. ఉజ్జ్వలుడు, పరస్త్రీలందాసక్తి కలిగినవాడగును.

**స్థిరారమ్భః పరద్వేషీ వక్రో మూర్ఖః పరాక్రమీ**
**గూఢమన్త్రీ చ సంజ్ఞానీ హ్యమావాస్యాభవో జనః 274**

అమావాస్యలో జన్మించినవాడు స్థిర కార్యములనారంభించువాడు, శత్రువులతో వైరమును పొందువాడు, కుటిలుడు, మూర్ఖుడు, పరాక్రమవంతుడు, గూఢమైన ఆలోచనలు చేయువాడగును.

**జన్మతిథి ఫలము సమాప్తము**

--- oOo ---

**జన్మయోగఫలము :**

**విష్కమ్భజాతో మనుజో రూపవాన్ భాగ్యవాన్ భవేత్**
**నానాలఙ్కార సమ్పూర్ణో మహాబుద్ధి విశారదః 275**

విష్కంభయోగములో జన్మించినవాడు రూపవంతుడు, భాగ్యవంతుడు అనేక విధములైన అలంకారములు చేసికొనువాడు, మహాబుద్ధిమంతుడు చతురుడగును.

**ప్రీతియోగే సముత్పన్నో యోషితాం వల్లభో భవేత్**
**తత్త్వజ్ఞశ్చ మహోత్సాహీ స్వార్థీ నిత్యం కృతోద్యమః 276**

ప్రీతి యోగములో జన్మించినవాడు స్త్రీలకు హితుడు, తత్త్వము తెలిసినవాడు, అత్యంత ఉత్సాహవంతుడు, స్వార్థి, సదా ఉద్యమము చేయువాడగును.

**ఆయుష్మాన్నామ్ని యోగే చ జాతో మానీ ధనీ కవిః**
**దీర్ఘాయుః సత్వసమ్పన్నో యుద్ధే చాప్యపరాజితః 277**

ఆయుష్మాన్ యోగములో జన్మించినవాడు అభిమాని, ధని, కవి, అధిక ఆయువు కలవాడు, ఐశ్వర్యవంతుడు, యుద్ధములో పరాజితుడు కానివాడగును.

**సౌభాగ్యే యః సముత్పన్నో రాజమన్త్రీ చ జాయతే**
**నిపుణః సర్వకార్యేషు వనితానాం చ వల్లభః 278**

సౌభాగ్య యోగములో జన్మించినవాడు, రాజుకు మంత్రి, సర్వకార్యములలో నిపుణుడు, స్త్రీలకు హితుడగును.

**శోభనే శోభనో బాలో బహుపుత్రకలత్రవాన్**
**ఆతురః సర్వకార్యేషు యుద్ధభూమే సదోత్సుకః** **279**

సర్వకార్యములందాసక్తి కలవాడు యుద్ధములోనికి వెళ్ళుటకాసక్తి చూపువాడగును.

**అతిగణ్డే చ యో జాతో మాతృహన్తా భవేచ్చ సః**
**గణ్డాన్తేషు చ జాతస్తు కులహన్తా ప్రకీర్తితః** **280**

అతిగండ యోగములో జన్మించినవాడు తల్లిని చంపువాడగును. అతిగండ యోగము చివరిలో జన్మించిన కులనాశకుడగును.

**సుకర్మణి చ యో జాతః సుకర్మా జాయతే నరః**
**సర్వైః ప్రీతః సుశీలశ్చ రాగీ భోగీ గుణాధికః** **281**

సుకర్మ యోగములో జన్మించినవాడు మంచి పనులు చేయువాడు అందరిని ప్రేమతో చూచువాడు, సుశీలుడు, రాగి, భోగి, అత్యంత గుణవంతుడగును.

**ధృతిమాన్ధృతి యోగే చ కీర్తి పుష్టిధనాన్వితః**
**భాగ్యవాన్ రూపసమ్పన్నో విద్యావాన్ గుణవాన్భవేత్** **282**

ధృతి యోగములో జన్మించినవాడు ధైర్యవంతుడు, యశస్వి, పుష్టికలవాడు, ధని, భాగ్యశాలి, రూపవంతుడు, విద్యాంసుడు గుణవంతుడగును.

**శూలే శూలవ్యథాయుక్తో ధార్మికః శాస్త్రపారగః**
**విద్యార్థకుశలో యజ్వా జాయతే మనుజః సదా** **283**

శూల యోగములో జన్మించినవాడు రోగి, ధర్మవంతుడు, శాస్త్రపారంగతుడు, విద్యా ద్రవ్యకుశలుడు, సదాయజ్ఞము చేయువాడగును.

**గణ్డే గణ్డవ్యథాయుక్తో బహుక్లేశో మహాశిరాః**
**హ్రస్వకాయో మహాస్థూలో బహుభోగీ దృఢవ్రతః** **284**

గండ యోగములో జన్మించినవాడు గండమాలా రోగము కలవాడు అధిక కష్టములు పడువాడు, పెద్దశిరలు కలవాడు, పొట్టివాడు, లావు శరీరము కలవాడు మహాభోగి, దృఢమైన ప్రతిజ్ఞ కలవాడగును.

**వృద్ధియోగే చ దీర్ఘాయుర్బహుపుత్రకలత్రవాన్**
**ధనవానతిభోక్తా చ సత్వవానపి జాయతే** **285**

బుద్ధి యోగములో జన్మించినవాడు అధిక ఆయువు కలవాడు, అనేక స్త్రీ పుత్రులతో కూడినవాడు, ధనవంతుడు, అతిభోగి, ఐశ్వర్యవంతడగును.

**ధ్రువయోగే చ దీర్ఘా యుః సర్వేషాం ప్రియదర్శనః**
**స్థిర కర్మాతిసక్తశ్చ ధ్రువబుద్ధిశ్చ జాయతే** **286**

ధ్రువ యోగములో జన్మించినవాడు అధికాయువు కలవాడు, అందరికి ప్రియుడు, స్థిరమైన కార్యములు చేయువాడు, స్థిరమైన బుద్ధి కలవాడగును.

**వ్యాఘాతయోగే జాతస్తు సర్వజ్ఞః సర్వపూజితః**
**సర్వకర్మకరో లోకే వ్యాఖ్యాతః సర్వకర్మసు** **287**

వ్యాఘాత యోగములో జన్మించినవాడు అన్ని తెలిసినవాడు అందరిచే పూజింపబడువాడు అన్నికర్మలు చేయువాడు లోకములో అన్ని కార్యములు చేయుటలో ప్రసిద్ధుడగును.

**హర్షణే జాయతే లోకే మహాభోగీ నృపప్రియః**
**హృష్టః సదా ధనైర్యుక్తో వేదశాస్త్ర విశారదః** **288**

హర్షణ యోగములో జన్మించినవాడు మహాభోగి, రాజులకు ఇష్టుడు ఎప్పుడు ప్రసన్నముగానుండువాడు ధని, వేదశాస్త్రములు తెలిసినవాడగును.

**వజ్రయోగే వజ్రముష్టిః సర్వవిద్యాసుపారగః**
**ధనధాన్యసమాయుక్తో మనుజో వజ్ర విక్రమః** **289**

వజ్రయోగములో జన్మించిన పురుషుడు వజ్ర సమానమైన ముష్టికలవాడు అన్ని విద్యలలో పారంగతుడు ధనధాన్యములు కలవాడు అధిక బలవంతుడగును.

**సిద్ధియోగే సముత్పన్నః సర్వసిద్ధియుతో భవేత్**
**దాతా భోక్తాసుఖీ కాన్తః శోకీ రోగీ చ మానవః** **290**

సిద్ధి యోగములో జన్మించినవాడు అన్ని సిద్ధులు తెలిసినవాడు దాని, భోగి, సుఖి, సుందరుడు, శోకరోగముక్తుడగును.

**వ్యతీపాతే నరో జాతో మహాకష్టేన జీవతి**
**జీవేచ్ఛేద్ భాగ్యయోగేన స భవేదుత్తమో నృణామ్** **291**

వ్యతీపాత యోగములో జన్మించినవాడు చాల కష్టముతో జీవనము సాగించును. భాగ్యముతో జీవించిన యెడల మనుషులలో ఉత్తముడగును.

**వరీయాన్నామ్ని యోగే చ వరిష్ఠో జాయతే నరః**
**శిల్పకావ్య కలాభిజ్ఞో గీతనృత్యాదికోవిదః** **292**

వరీయాన్ యోగములో జన్మించినవాడు అతి శ్రేష్ఠుడు, శిల్ప కార్యకళలను తెలిసినవాడు గీతనృత్యాదికుశలుడగును.

**పరిఘే చ నరోజాతః స్వకులోన్నతికారకః**
**శాస్త్రాభిజ్ఞః కవి దాతా భోక్తా ప్రియంవదః** **293**

పరిఘుర్వాగ్మీ యోగములో జన్మించినవాడు కులమును వృద్ధి చేయువాడు శాస్త్రములను తెలిసినవాడు కవి, విలక్షణమైన బుద్ధి కలవాడు, దాని, భోగి, ప్రియవచనములు పలుకువాడగును.

**శివయోగే నరో జాతః సర్వకల్యాణభాజనః**
**మహాదేవసమో లోకే మహాబుద్ధిర్వరప్రదః** 294

శివయోగములో జన్మించినవాడు అన్ని శుభములు కలుగువాడు మహాబుద్ధిమంతుడు, వరములనిచ్చువాడు లోకములో మహాదేవునితో సమానుడగును.

**సిద్ధియోగే సిద్ధిదాతా మన్త్రసిద్ధిప్రవర్తకః**
**దివ్యనారీ సమేతశ్చ జాయతే సర్వసమ్పద్యుతో భవేత్** 295

సిద్ధి యోగ జాతకుడు మనుష్యులకు సిద్ధిని కలిగించువాడు, మంత్ర సిద్ధి కలవాడు, సుందరమైన స్త్రీ, సంపదలతో కూడినవాడగును.

**సాధ్యే మానసికా సిద్ధిర్యశో శేషః సుఖాగమః**
**దీర్ఘ సూత్రః ప్రసిద్ధశ్చ జాయతే సర్వసమ్మతః** 296

సాధ్య యోగములో జన్మించినవాడు సిద్ధితో కూడినవాడు యశస్వి సుఖి, దీర్ఘసూత్రి (ఆలస్యముగా పనిచేయువాడు) ప్రసిద్ధుడు అందరికి మిత్రుడగును.

**శుభే శుభ శతైర్యుక్తో ధనవానపి జాయతే**
**విజ్ఞాన శాస్త్రసమ్పన్నో దాతా బ్రాహ్మణపూజకః** 297

శుభ యోగములో జన్మించినవాడు అనేక శుభకార్యములు చేయువాడు ధని, విజ్ఞాన శాస్త్రము తెలిసినవాడు, దాని, బ్రహ్మణులచే పూజింపబడువాడుగును.

**శుక్లే సర్వకాలయుక్తః సర్వార్థజ్ఞానవాన్భవేత్**
**క్వచిత్ప్రతాపీ శూరశ్చ ధనీ సర్వజనప్రియః** 298

శుక్ల యోగములో జన్మించినవాడు సర్వకళలు తెలిసివాడు అన్ని విషయములు తెలిసినవాడు అప్పుడప్పుడు ప్రతాపమును ప్రదర్శించువాడు, ధని, మనుష్యులందరికి ప్రియమైనవాడగును.

**బ్రహ్మయోగే మహావిద్వాన్ వేదశాస్త్ర పరాయణః**
**బ్రహ్మజ్ఞానరతో నిత్యం సర్వకార్యేషు కోవిదః** 299

బ్రహ్మయోగములో జన్మించినవాడు గొప్ప విద్వాంసుడు వేదశాస్త్రపరాయణుడు. ఎప్పుడు బ్రహ్మజ్ఞానమునందాసక్తితోనుండువాడు అన్ని కార్యములలో నిపుణుడగును.

**ఐన్ద్రే భూపకులే జాతో రాజాభవతి విశ్రుతః**
**అల్పాయుశ్చ సుఖీభోగీ గుణవానపి జాయతే** 300

ఇంద్ర యోగములో జన్మించినవాడు రాజకులములో జన్మించును గౌరవనీయుడగును. అల్పాయువు కలవాడు, సుఖి, భోగి, గుణవంతుడగును.

**వైధృతౌ జాయమానస్తు నిరుత్సాహో బుభుక్షితః**
**కుర్వాణోఽపి జనైః ప్రీతిం ప్రయాత్యప్రియతాం నరః** 301

వైధృతి యోగములో జన్మించినవాడు ఉత్సాహహీనుడు, ఆకలితో నుండువాడు. మనుష్యుల ప్రీతిని పొందినప్పటికి అప్రియుడగును.

**జన్మయోగ ఫలము సమాప్తము**

**--- oOo ---**

**జన్మకరణ ఫలము**

**బవాఖ్యే కరణే జాతో మానీ ధర్మరతః సదా**
**శుభ మఙ్గలకర్మా చ స్థిరకర్మాచ జాయతే 302**

బవ కరణములో జన్మించినవాడు అభిమాని, ఎల్లప్పుడు ధర్మమునాచరించువాడు, శుభ మంగళ కర్మలను స్థిరకర్మలను చేయువాడగును.

**బాలవాఖ్యే నరో జాతస్తీర్థదేవాదిసేవకః**
**విద్యార్థశౌర్యసమ్పన్నో రాజమాన్యశ్చ జాయతే 303**

బాలవ కరణములో జన్మించినవాడు దేవతలకు సేవచేయువాడు, విద్య ద్రవ్యము, శూరత్వములు కలవాడు రాజులచే పూజింపబడువాడగును.

**కౌలవేం చ నరో జాతః ప్రీతిః సర్వజనైః సహ**
**సఙ్గతిర్మిత్ర వర్గైశ్చ మానవైశ్చ ప్రజాయతే 304**

కౌలవ కరణములో జన్మించిన వ్యక్తి అందరికి ప్రీతి పాత్రుడగును. మిత్రజనులతో అన్యజనులతో కలిసియుండును.

**తైతిలే కరణే జాతః సౌభాగ్యగుణసంయుతః**
**స్నేహః సర్వజనైః సార్ధం విచిత్రాణి గృహాణి చ 305**

తైతిల కరణములో జన్మించినవాడు సౌభాగ్యవంతుడు, మంచి గుణములతో కూడినవాడు మనుష్యులందరితో స్నేహము చేయువాడు సుందరమైన గృహము కలవాడగును.

**గరాఖ్యే కృషికర్మా చ గృహకార్యపరాయణః**
**యద్వస్తు వాఞ్ఛితం తచ్చ లభ్యతేఽత్ర మహోద్యమైః 306**

గర కరణములో జన్మించినవాడు వ్యవసాయము చేయువాడు గృహకార్యములలో నిపుణుడగును. కాని కోరిన వస్తువు మాత్రము అధిక ప్రయాసతో లభించును.

**వణిజేకరణే జాతో వాణిజ్యేనైవ జీవతి**
**వాఞ్ఛితం లభతేలోకే దేశాన్తరగమాగమైః 307**

వణిజ కరణములో జన్మించినవాడు వాణిజ్యముతో జీవించును. ఇతర దేశములకు వెళ్ళుట వచ్చుట జరుగునపుడు కోరిన పదార్థములను పొందును.

**విష్ట్యాఖ్యే కరణేజ్ఞాతో హ్యశుభారమ్భశీలవాన్**
**కుశలో విషకార్యేషు పరఘాతరతః సదా** **308**

విష్టికరణములో జన్మించినవాడు అశుభ కార్యములను చేయువాడు విషకార్యములలో నిపుణుడు. ఎల్లప్పుడు ఇతరులకు కష్టమును కలిగించువాడగును.

**శకునౌ కరణే జాతః పౌష్టికాదిక్రియాకృతీ**
**ఔషధాదిషు దక్షశ్చ భిషగ్వృత్తిశ్చ జాయతే** **309**

శకుని కరణములో జన్మించినవాడు పుష్టికారకమైన కార్యములలో నిపుణుడు ఔషధముల నిర్మాణములో నిపుణుడు వైద్య వృత్తితో జీవనము సాగించువాడగును.

**కరణే చ చతుష్పాదే దేవద్విజరతః సదా**
**గోకర్మా గోప్రభుర్లోకే చతుష్పాదచికిత్సకః** **310**

చతుష్పాద కరణములో జన్మించినవాడు దేవద్విజనులందు భక్తి కలవాడు, గోవుల కార్యములను చేయువాడు గోవులకుస్వామి జంతువులను ఔషధములను నిర్మించువాడగును.

**నాగాఖ్యే కరణే జాతః స్థావరప్రీతికారకః**
**కురుతే దారుణం కర్మ దుర్భగో లోలలోచనః** **311**

నాగ కరణములో జన్మించినవాడు వృక్షాదులన్న ప్రీతికలవాడు దారుణమైన కార్యములు చేయువాడు భాగ్యహీనుడు చంచలనేత్రములు కలవాడగును.

**కింస్తుఘ్నే కరణే జాతః శుభకర్మరతో నరః**
**తుష్టిం పుష్టిం చ మాఙ్గల్యం సిద్ధి చ లభతే సదా** **312**

కింస్తుఘ్న కరణములో జన్మించినవాడు శుభకర్మలను చేయువాడు తుష్టి, పుష్టి, మాంగళ్యము, సిద్ధులను పొందువాడగును.

**జన్మకరణ ఫలము సమాప్తము**

--- oOo ---

**జన్మరాశి నవాంశ ఫలము**

**పిశునశ్చపలో దుష్టః పాపకర్మా నిరాకృతిః**
**పరేషాం వ్యసనే సక్తశ్చౌరశ్చ ప్రథమాంశకే** **313**

ప్రథమనవాంశములో జన్మించిన వాడు చాడీలు చెప్పువాడు, చంచలబుద్ధి కలవాడు దుష్టుడు, పాపి, కురూపుడు శత్రువుల వ్యసనములందాసక్తి కలవాడు దొంగయగును.

**ఉత్పన్నవిభవో భోక్తా సంగ్రామే విగతస్పృహః**
**గన్ధర్వప్రమదాసక్తో ద్వితీయాంశే చ జాయతే** **314**

ద్వితీయనవాంశములో జన్మించినవాడు ఐశ్వర్యవంతుడు, భోగి, జగడము నందాసక్తి లేనివాడు గాయకుడు స్త్రీయందాసక్తి కలవాడగును.

**ధర్మిష్ఠః సతతం వ్యాధిః సర్వసారజ్ఞ ఏవ చ**
**సర్వజ్ఞో దేవతాభక్త స్తృతీయాంశే చ జాయతే** 315

తృతీయ నవాంశములో జన్మించినవాడు ధర్మవంతుడు, సదావ్యాధి కలవాడు అన్నింటిని తెలిసినవాడు దేవతలకు భక్తుడగును.

**చతుర్థాంశేఽభిజాతస్య దీక్షితో గురుభక్తిమాన్**
**యత్కిఞ్చిద్ భూమి గోవస్తు తత్సర్వం లభతే చ సః** 316

చతుర్ధ నవాంశములో జన్మించినవాడు దీక్షితుడు, గురుభక్తి కలవాడగును భూమిపైనున్న అన్ని వస్తువులను పొందును.

**సర్వలక్షణ సమ్పన్నో రాజా భవతి విశ్రుతః**
**దీర్ఘాయుర్బహు పుత్రశ్చ జాయతే పఞ్చమాంశకే** 317

పంచమాంశములో జన్మించినవాడు అధిక ఆయువు కలవాడు అధిక పుత్రులు కలవాడు సర్వలక్షణ సంపన్నుడు ప్రసిద్ధుడైన రాజగును.

**స్త్రీనిర్జితః శుభైర్హీనో బహుభాషీ నపుంసకః**
**అర్థధ్వంసః ప్రమాదీ చ షష్ఠాంశే జాయతే నరః** 318

షష్ఠమనాంశములో జన్మించినవాడు స్త్రీ వశములో నుండువాడు, శుభకార్యములు చేయువాడు అధికముగా మాట్లాడువాడు, నపుంసకుడు ద్రవ్యహీనుడు ప్రమాదము కలిగించువాడగును.

**విక్రాన్తో మతిమాఞ్ఛూరః సంగ్రామేష్వపరాజితః**
**మహోత్సాహీ చ సన్తోషీ జాయతే సప్తమాంశకే** 319

సప్తమాంశములో జన్మించిన వాడు పరాక్రమి, బుద్ధిమంతుడు శూరుడు యుద్ధములో పరాజితుడు కానివాడు, అధిక ఉత్సాహవంతుడు సంతోషముతోనుండు వాడగును.

**కృతఘ్నో మత్సరీక్రూరః క్లేశ భోక్తా బహుప్రజః**
**ఫలకాలపరిత్యాగీ జాయతే చాష్టమాంశకే** 320

అష్టమాంశములో జన్మించినవాడు కృతఘ్నుడు ఈర్షను పొందువాడు, క్రూరుడు కష్టములననుభవించువాడు అధిక సంతానవంతుడు ఫలితసమములో దానిని వదిలిపెట్టు వాడగును.

**క్రియాసు కుశలో దక్షః సుప్రతాపీ జితేన్ద్రియః**
**భృత్యైశ్చావేష్టితో నిత్యం జాయతే నవమేఽంశకే** 321

నవాంశములో జన్మించినవాడు కార్యనిపుణుడు, ప్రవీణుడు, అధిక ప్రతాపము కలవాడు జితేంద్రియుడు ఎల్లపుడు సేవకులతో కూడియుండువాడగును.

**నవాంశఫలము సమాప్తము**

--- oOo ---

**జన్మ గణఫలము**

**సున్దరో దానశీలశ్చ మతిమాన్సబలః సదా**
**అల్పభోగీ మహాప్రాజ్ఞో నరోదేవ గణోద్భవః 322**

దేవగణములో జన్మించిన వ్యక్తి సుందరుడు, దానశీలుడు బుద్ధిమంతుడు బలవంతుడు స్వల్పభోగములననుభవించువాడు అధిక తెలివితేటలు కలవాడగును.

**మానీ ధనీ విశాలాక్షో లక్ష్యవేధీ ధనుర్ధరః**
**గౌరః పౌరజనాహ్లాదీ నరో మర్త్యగణోద్భవః 323**

మనుష్య గణములో జన్మించినవాడు అభిమాని, ధని, పెద్ద నేత్రములు కలవాడు లక్ష్యమును ఛేదించువాడు ధనుర్ధారి ఎరుపురంగు వాడు పురజనులకు ఆనందమును కలిగించువాడగును.

**ఉన్మాదీ భీషణాకారః సర్వదా కవివల్లభః**
**పురుషం దుస్సహంబ్రూతే ప్రమేహీ రాక్షసే గణే 324**

రాక్షస గణములో జన్మించినవాడు, భయంకరమైన ఆకారముకలవాడు ఎల్లప్పుడు జగడములాడువాడు ఇతరులతో చెడుగా మాట్లాడువాడు ప్రమేహ (మూత్ర మార్గము నుండి వీర్యము అన్యధాతు వులుపడు రోగము) రోగము కలవాడగును.

**గణఫలము సమాప్తము**

--- oOo ---

**జన్మ ఋతుఫలము**

**మహోద్యమీ మనస్వీచ తేజస్వీ బహుకార్యకృత్**
**నానా దేశరతోஉభిజ్ఞో వసన్తే జాయతే నరః 325**

వసంత ఋతువులో జన్మించినవాడు ఉత్సాహవంతుడు తేజస్వి మనస్వి అనేక కార్యములు చేయువాడు దేశాటనమునందాసక్తి కలవాడు అనుభవజ్ఞుడగును.

**బహ్వారమ్భో జితక్రోధః క్షుధాలుః కాముకో నరః**
**దీర్ఘః శూరో బుద్ధిమాంశ్చ గ్రీష్మేజాతః సదాశుచిః 326**

గ్రీష్మ ఋతువులో జన్మించినవాడు అనేకార్యములను ప్రారంభించువాడు క్రోధమును జయించినవాడు, అన్నార్థుడు, కాముకుడు, పొడవైన శరీరము కలవాడు వీరుడు బుద్ధిమంతుడు ఎల్లప్పుడు శుచిగానుండు వాడగును.

**గుణవాన్భోగయుక్తశ్చ రాజపూజ్యో జితేన్ద్రియః**
**కుశలః సత్యవాదీ చ వర్షాకాలే భవేన్నరః** **327**

వర్ష ఋతువులో జన్మించినవాడు గుణవంతుడు భోగయుక్తుడు, రాజపూజితుడు జితేంద్రియుడు ప్రావీణ్యము కలవాడు సత్యవాదియగును.

**వాణిజ్య కృషి వృత్తిశ్చ ధనధాన్యసమృద్ధివాన్**
**తేజస్వీ బహుమాన్యశ్చ శరజ్జాతో భవేన్నరః** **328**

శరదృతువులో జన్మించినవాడు వ్యాపారము వ్యవసాయము చేయువాడు, ధన ధాన్య సమృద్ధికలవాడు తేజస్వి పూజ్యుడగును.

**బహువీర్యో నీతివిజ్ఞో గ్రామయుక్తః సదోద్యమీ**
**హ్రస్వపాదగలో భీరుర్హేమన్తే జాయతే నరః** **329**

హేమంత ఋతువులో జన్మించినవాడు అధిక పరాక్రమవంతుడు, నీతిజ్ఞుడు గ్రామయుక్తుడు సదా ఉద్యమవంతుడు చిన్నకాళ్లు చిన్నకంఠము కలవాడు భయస్థుడగును.

**రూపయౌవనసమ్పన్నో దీర్ఘసూత్రీ మదోత్కటః**
**క్షుధాయుక్తః కాముకశ్చ శిశిరే జాయతే నరః** **330**

శిశిర ఋతువులో జన్మించినవాడు రూపయౌవవసంపన్నుడు దీర్ఘ సూత్రి (ఆలస్యముగా పనిచేయువాడు) మదాంధుడు, క్షుధార్తుడు, కాముకుడుగును.

**ఋతు ఫలము సమాప్తము**

**జన్మ పక్షఫలము :**

**పూర్ణచన్ద్రనిభః శ్రీమాన్ సోద్యమీ బహుశాస్త్రవిత్**
**కుశలో జ్ఞానసమ్పన్నః శుక్లపక్షే భవేన్నరః** **331**

శుక్ల పక్షములో జన్మించినవాడు పూర్ణచంద్రుని వలె కాంతిమంతుడు, లక్ష్మీవంతుడు, ఉద్యమకారుడు అనేక శాస్త్రములు తెలిసినవాడు చతురుడు జ్ఞానయుక్తడగును.

**నిష్ఠురో దుర్ముఖో మూర్ఖః స్త్రీద్వేషీ చ జనోజ్ఝితః**
**జాయతే చ పరప్రేష్యః కృష్ణపక్ష భవేన్నరః** **332**

కృష్ణ పక్షములో జన్మించినవాడు నిష్ఠురుడు, దుర్ముఖుడు మూర్ఖుడు స్త్రీవైరి, మనుష్యులచే వదిలిపెట్టబడినవాడు సేవకుడగును.

**పక్షఫలము సమాప్తము**

--- oOo ---

**అయన ఫలము**

**రూపవాన్ గుణశీలశ్చ సప్రతాపీ జనేశ్వరః**
**సర్వసౌఖ్యం సమాప్నోతి జాయతే చోత్తరాయణే** **333**

ఉత్తరాయణములో జన్మించినవాడు రూపవంతుడు, గుణవంతుడు ప్రతాపవంతుడు మనుష్యులకు అధిపతి, అన్ని సుఖములను పొందువాడగును.

**కృషికర్మరతో నిత్యం గోమహిష్యాది సంయుతః**
**కామీ సర్వజనో వాదీ జాయతే దక్షిణాయనే** **334**

దక్షిణాయనములో జన్మించినవాడు వ్యవసాయము నిత్యము చేయువాడు గోమహిషాదులను పాలించువాడు కాముకుడు అనేక జనులతో కూడినవాడు వాదము చేయువాడగును.

**అయనఫలము సమాప్తము**

**--- oOo ---**

**తుంగ ఫలము**

**మహాధనీ మహోగ్రశ్చ తుఙ్గస్థో భాస్కరే నరః**
**సుభూషణో మహాభోగీ ధనీ చన్ద్రే చ జాయతే** **335**

ఉచ్చలో సూర్యుడున్నపుడు జన్మించినవాడు మహాధనవంతుడు ఉగ్రస్వభావుడగును. చంద్రుడుచ్చలోనున్న సుందరమైన భూషణములు కలవాడు మహాభోగి ధనియగును.

**ఉచ్చభౌమే సుపుత్రశ్చ తేజస్వీ గర్వితోనరః**
**మేధావీ దృఢవాక్యశ్చ బలాఢ్యశ్చ బుధే భవేత్** **336**

కుజుడుచ్చలోనున్న జాతకుడు మంచి పుత్రులు కలవాడగును. తేజస్వి అభిమానవంతుడగును, బుధుడుచ్చలోనున్న బుద్ధిమంతుడు దృఢవచనములు పలుకువాడు బలవంతుడగును.

**రాజపూజ్యశ్చ విఖ్యాతో విద్వానార్యో గురౌ నరః**
**ఉచ్చే శుక్రే విలాసీ చ హాస్యగీతాదిసంయుతః** **337**

ఉచ్చలో గురుడున్నపుడు జన్మించిన రాజులచే పూజింపబడును విఖ్యాతుడు విద్వాంసుడు శ్రేష్ఠుడగును శుక్రుడుచ్చలోనున్న విలాసవంతుడు హాస్యగీతాదులతో ఆనందించువాడగును.

**తుఙ్గస్థే భానుపుత్రే చ చక్రవర్తీ ధనీభవేత్**
**రాజలబ్ధానియోగశ్చ రాహుః శనిసమో మతః** **338**

శని ఉచ్చలోనున్నపుడు జన్మించిన చక్రవర్తియగును ధని, రాజుల ద్వారా

గౌరవింపబడును. రాహువు ఉచ్చలోనున్న శనిఫలితములనిచ్చును.

**తుంగఫలము సమాప్తము**

--- oOo ---

**మూల త్రికోణ గత గ్రహఫలము**

**ధనీ సుఖీ కార్యవిజ్ఞో రవౌ మూలత్రికోణగే**
**చన్ద్రే ధనీ సుభోక్తా చ భౌమే శూరోదయః ఖలః 339**

సూర్యుడు మూల త్రికోణములోనున్నపుడు జన్మించిన మనుష్యుడు ధనవంతుడు సుఖి కార్యకుశలుడగును, చంద్రుడు మూలత్రికోణములోనున్న ధనవంతుడు మంచి భోగములననుభవించువాడగును. కుజుడున్న శూరుడు దుష్టుడగును.

**బుధే త్రికోణే విజ్ఞశ్చ వినోదీ విజయీనరః**
**గురౌ గ్రామపురాదీనాం మఠస్య చ పతిర్భవేత్ 340**

బుధుడు మూల త్రికోణములోనున్న మనుష్యుడు పండితుడు ఆనందముతో నుండువాడగును గురుడున్న గ్రామపురములకు మఠములకు స్వామియగును.

**శుక్రే త్రికోణే సుజ్ఞశ్చ సుఖయుక్తో మహత్తమః**
**మన్దో నరో ధనైః పూర్ణో మహాశరః కులన్ధరః 341**

శుక్రుడు మూలత్రికోణములోనున్న మనుష్యుడు పండితుడు, సుఖి, చాలపెద్దవాడగును. శనియున్న ధని, మహాశూరుడు కులమునువృద్ధి చేయువాడగును.

**మూల త్రికోణ ఫలము సమాప్తము**

--- oOo ---

**స్వగృహస్థ గ్రహఫలము**

**స్వగృహస్థే రవౌలోకే మహోగ్రశ్చసహోద్యమీ**
**చన్ద్రే ధర్మరతః సాధుర్మనస్వీ రూపవానపి 342**

సూర్యుడు స్వగృహములోనున్న మనుష్యుడు ఉగ్రస్వభావుడు ఎల్లప్పుడు ఉద్యోగ ప్రయత్నము చేయువాడగును. చంద్రుడున్న ధర్మరతుడు సాధుశీలుడు మనస్వి రూపవంతుడగును.

**స్వగృహస్థే కుజే వాపి చపలో ధనవానపి**
**బుధే నానాకలాభిజ్ఞః పణ్డితో ధనపూరితః 343**

కుజుడు స్వగృహములోనున్న మనుష్యుడు చంచలస్వభావము కలవాడు ధనవంతుడగును, బుధుడున్న కళలు తెలిసినవాడు పండితుడు ధనియగును.

**ధనీ కావ్యశృతిజ్ఞశ్చ సుచేష్టః స్వగృహే గురౌ**
**స్ఫీతః కృషీబలః శుక్రే శనౌ మాన్యః ఖలోజనః 344**

గురువు తన గృహములోనున్న మనుష్యుడు ధనవంతుడు కావ్యములు వేదములను తెలిసినవాడగును. శుక్రుడున్న ఉజ్జ్వలస్వరూపము కలవాడు వ్యవసాయము చేయువాడగును. శనియున్న మనుష్యుడు దుష్టుడగును కాని పూజనీయుడగును.

**స్వగృహస్థ ఫలము సమాప్తము**

--- oOo ---

**మిత్ర గృహస్థ గ్రహఫలము**

**సూర్యే మిత్రగృహేఖ్యాతః శాస్త్రజ్ఞః స్థిరసౌహృదః**
**చన్ద్రే నరో భాగ్యయుక్తశ్చతురో ధనవానపి 345**

సూర్యుడు మిత్ర గృహములోనున్న మనుష్యుడు ప్రసిద్ధుడు శాస్త్రములను తెలిసినవాడు స్థిరమైన మిత్రత్వము కలవాడగును. చంద్రుడున్న భాగ్యశాలి చతురుడు ధనియగును.

**భౌమే శాస్త్రోపజీవీ చ బుధే రూపధనాన్వితాః**
**గురౌ మిత్రగృహే పూజ్యః సతాం సత్కర్మసంయుతః 346**

కుజుడు మిత్రగృహములోనున్న మనుష్యుడు శాస్త్రములతో జీవనము చేయువాడగును. బుధుడున్న రూపవంతుడు ధనవంతుడగును. గురుడున్న సజ్జనులచే పూజింపబడువాడు పూజ్యుడు సత్కర్మయుతుడగును.

**శుక్రే మిత్రగృహే లోకే ధనీ బన్ధుజనప్రియః**
**శనౌ పరాన్నభోగీ చ కుకర్మనిరతో భవేత్ 347**

శుక్రుడు మిత్ర గృహములోనున్న మనుష్యుడు ధనవంతుడు బంధుజనులచే ప్రేమింపబడువాడగును. శనియున్న ఇతరుల అన్నమును తినువాడును కర్మలుచేయువాడగును.

**మిత్రగృహస్థ ఫలము సమాప్తము**

--- oOo ---

**నీచగృహస్థ గ్రహ ఫలము**

**నీచే సూర్యే భవేత్ప్రేష్యో బాన్ధవైర్వర్జితో నరః**
**చన్ద్రే రోగీ స్వల్ప పుణ్యో దుర్భగో నీచ రాశిగే 348**

సూర్యుడు నీచ రాశిలోనున్న మనుష్యుడు సోదరులచే వదిలిపెట్టబడినవాడు దాసుడగును, చంద్రుడున్న రోగి, స్వల్ప పుణ్యము కలవాడు భాగ్యహీనుడగును.

**నీచే భౌమే భవేన్నీచః కుత్సితో వ్యసనాతురః**
**బుధే క్షుద్రో బన్ధువైరీ గురౌ దీనో మలాన్వితః 349**

కుజుడు నీచలోనున్న మనుష్యుడు నీచుడు, కుత్సితుడు వ్యసనములు కలవాడగును బుధుడున్న క్షుద్రుడు సోదరులతో వైరము కలవాడగును గురుడున్న దుఃఖి, పాపియగును.

**శుక్రే నీచే నష్టదారః స్వతన్త్రః శీలవర్జితః**
**శనే కాణో దరిద్రశ్చ గతాచారోఽతి గర్హితః 350**

శుక్రుడు నీచలోనున్న స్త్రీ నష్టమును పొందును. స్వతంత్రురాలు శీలములేనిదగును. శని నీచలోనున్న అంధురాలు, దరిద్రురాలు ఆచారహీనురాలు, నిందితురాలగును.

**నీచ గృహస్థ గ్రహఫలము సమాప్తము**

--- oOo ---

**రిపు గృహస్థ గ్రహఫలము**

**సూర్యే రిపుగృహే నిఃస్వో విషయైః పీడితో నరః**
**చన్ద్రే హృదయ రోగీ చ భౌమే జాయాజడోఽ ధనః 351**

సూర్యుడు శత్రు గృహములోనున్న మనుష్యుడు దరిద్రుడు విషయపీడితుడగును. చంద్రుడున్న హృదయ రోగియగును. కుజుడున్న మూర్ఖ స్త్రీ కలవాడు దరిద్రుడగును.

**బుధే రిపుగృహే మూర్ఖో వాగ్ధనీ దుఃఖ పీడితః**
**జీవేఽ రిభేనరః క్లీబో నాప్తవృత్తిర్బుభుక్షితః 352**

బుధుడు శత్రుగృహములోనున్న వ్యక్తి మూర్ఖుడగును కాని మాటమాట్లాడుటలో చతురుడగును దుఃఖ పీడితుడగును గురుడు శత్రు గృహములోనున్నన పుంసకుడు విశ్వాసరహితుడు క్షుధాపీడితుడగును.

**శుక్రే శత్రుగృహే భృత్యః కుబుద్ధిర్దుఃఖితో నరః**
**శనౌవ్యాధ్యర్థ శోకేన సన్తప్తో మలినో భవేత్ 353**

శుక్రుడు శత్రు గృహములోనున్న వ్యక్తి దాసుడు, చెడుబుద్ధి కలవాడు దుఃఖితుడగును శనియున్న వ్యాధి ధన, శోకములతో పీడితుడు మలినుడగును.

**రిపుగృహస్థ ఫలము సమాప్తము**

--- oOo ---

**జన్మ నక్షత్ర ఫలము**

**సురూపః సుభగో దక్షః స్థూలకాయో మహాధనీ**
**అశ్వినీ సమ్భవో లోకే జాయతే జనవల్లభః 354**

అశ్వినీ నక్షత్రములో జన్మించినవాడు రూపవంతుడు, భాగ్యవంతుడు నిపుణుడు, స్థూల శరీరము కలవాడు చాల ధనవంతుడు, ప్రజలకు హితుడగును.

**అరోగీ సత్యవాదీ చ సప్రాణశ్చ దృఢవ్రతః**
**భరణ్యాం జాయతే లోకే సుఖీ చ మతిమానపి** **355**

భరణి నక్షత్రములో జన్మించినవాడు రోగరహితుడు, సత్యము పలుకువాడు, ప్రాణమున్నంత వరకు ధృఢమైన వ్రతదీక్షలోనుండు వాడు, సుఖి, బుద్ధిమంతుడగును.

**కృపణః పాపకర్మా న చ క్షుధాలుర్నిత్యపీడితః**
**అకర్మ కురుతే నిత్యం కృత్తికాయాం భవేన్నరః** **356**

కృత్తికా నక్షత్రములో జన్మించినవాడు లోభి, పాపకార్యములు చేయువాడు, క్షుదాపీడితుడు. ఎల్లప్పుడు బాధపడువాడు చెడుకర్మలు చేయువాడగును.

**ధనీ కృతజ్ఞో మేధావీ నృపమాన్యః ప్రియంవదః**
**సత్యవాదీ సురూపశ్చ రోహిణ్యాం జాయతే నరః** **357**

రోహిణి నక్షత్రములో జన్మించినవాడు ధని, కృతజ్ఞుడు, బుద్ధిమంతుడు రాజుచే పూజింపబడువాడు ప్రియమైనవాడు, సత్యవాది సుందరుడగును.

**చపలశ్చతురోధీరః క్రూరకర్మాప్యకర్మకృత్**
**అహఙ్కారీ పరద్వేషీ మృగే భవతిమానవః** **358**

మృగశిరలో జన్మించినవాడు చంచలుడు, చతురుడు, ధీరుడు, క్రూర కర్మాలు చేయువాడు ధర్మభ్రష్టుడు అహంకారి ఇతరులను ద్వేషించువాడగును.

**కృతఘ్నో గర్వితో హీనో నరః పాపరతః శఠః**
**ఆర్ద్రానక్షత్రసమ్భూతో ధనధాన్యవివర్జితః** **359**

ఆర్ద్రా నక్షత్రములో జన్మించినవాడు కృతఘ్నుడు, అభిమాని, హీనస్వభావుడు పాపములు చేయువాడు, మూర్ఖుడు, ధనధాన్య హీనుడగును.

**శాన్తః సుఖీ చ భోగీ చ సుభగో జనవల్లభః**
**పుత్రి మిత్రాదిభిర్యుక్తో జాయతే చ పునర్వసౌ** **360**

పునర్వసులో జన్మించినవాడు శాంతస్వభావుడు, సుఖి, భోగి, సౌభాగ్యవంతుడు, లోకులకు ప్రియుడు పుత్రమిత్రాదులతో కూడినవాడగును.

**దేవధర్మధనైర్యుక్తో బుద్ధియుక్తో విచక్షణః**
**పుష్యేచ జాయతే లోకే శాన్తాత్మా సుభగః సుఖీ** **361**

పుష్యమి నక్షత్రములో జన్మించినవాడు దేవ ధర్మధనములు కలవాడు బుద్ధిమంతుడు నిపుణుడు, శాంతచిత్తుడు భాగ్యశాలి దుఃఖి యగును.

**సర్వభక్షః కృతాన్తశ్చ కృతఘ్నో వఞ్చకః ఖలః**
**కృతఘ్నశ్చ కుకర్మా చ శ్లేషాయాం జాయతే నరః** **362**

ఆశ్లేషతో పుట్టినవాడు సర్వభక్షకుడు, దుష్టస్వభావము కలవాడు, కృతఘ్నుడు, వంచకుడు, మూర్ఖుడు, దుష్టకార్యములుచేయువాడగును.

**సార్పాయాః ప్రథమే భద్రం ద్వితీయే చ ధనక్షయః**
**మాతుఃపీడా తృతీయే చ చతుర్థే చరణే పితుః 363**

ఆశ్లేష మొదటి పాదములో జన్మించిన శుభము కలగును, ద్వితీయ చరణమైన ధననాశనమగును తృతీయ చరణమైన తల్లికి పీడ కలుగును. చతుర్థ చరణమైన తండ్రికి పీడకలుగును.

**బహుభృత్యో ధనీ రోగీ పితృభక్తో మహోద్యమే**
**చమూనాథో రాజసేవీ మఘాయాం జాయతే నరః 364**

మఘా నక్షత్రములో జన్మించినవాడు అనేక సేవకులు కలవాడు, ధనవంతుడు, భోగి, తండ్రి యందు భక్తి కలవాడు గొప్ప ప్రయత్నములు చేయువాడు, సేనాపతి రాజసేవకుడగును.

**విద్యా గోధన సంయుక్తో గమ్భీరః ప్రమదాప్రియః**
**పూర్వాఫాల్గునికాజాతః సుఖీ పణ్డిత పూజితః 365**

పుబ్బలో జన్మించినవాడు విద్య గోవులతో కూడినవాడు, గంభీర వ్యక్తిత్వము కలవాడు స్త్రీ ప్రియుడు, సుఖి, పండితులచే పుజింపబడువాడగును.

**దాతా శూరో మృదుర్వక్తా ధనుర్వేదార్థ పణ్డితః**
**ఉత్తరాఫాల్గునీజాతో మహాయోధా జనప్రియః 366**

ఉత్తర నక్షత్రములో జన్మించినవాడు దాని, వీరుడు, మధర వచనములు పలుకువాడు ధనుర్వేదములో పండితుడు, మహా యోధుడు జనులకు ప్రియుడగును.

**అసత్యవచనో ధృష్టః సురాపో బన్ధునర్జితః**
**హస్తేజాతో నరశ్చౌరో జాయతే పరదారకః 367**

హాస్త నక్షత్రములో జన్మించినవాడు అసత్యమును పలుకువాడు దుష్టుడు, మదిరాపానము చేయువాడు, సోదరులచే విడిచిపెట్టబడినవాడు, పరస్త్రీరతుడగును.

**పుత్రదారయుతస్తుష్టో ధనధాన్య సమన్వితః**
**దేవబ్రాహ్మణభక్తశ్చ చిత్రాయాం జాయతే నరః 368**

చిత్తా నక్షత్ర జాతకుడు భార్యపుత్రులతో కూడినవాడు సంతుష్టితోనున్నవాడు, ధన ధాన్యయుక్తుడు దేవబ్రాహ్మణ భక్తుడగును.

**విదగ్ధో ధార్మికోஉల్పార్థః కృపణః ప్రియవల్లభః**
**సుఖీ స్వదేవభక్తశ్చ స్వాతీజాతో భవేన్నరః 369**

స్వాతీ నక్షత్రములో జన్మించినవాడు విదగ్ధుడు (నిపుణుడు) ధర్మాత్ముడు, స్వల్పద్రవ్యము కలవాడు, కృపణుడు (లోభి) ప్రియమైన స్త్రీ కలవాడు సుఖి దేవతాభక్తుడగును.

**అతిలుబ్ధోఽతిమానీ చ నిష్ఠురః కలహప్రియః**
**విశాఖాయం నరో జాతో వేశ్యాజనరతో భవేత్** 370

విశాఖలో జన్మించినవాడు అతి లోభి, అతి అభిమాని, నిష్ఠురుడు కలహము కలిగించువాడు వేశ్యాసక్తికలవాడగును.

**పురుషార్థీ ప్రవాసీ చ బన్ధుకార్యే సహోద్యమీ**
**అనురాధాభవో లోకః సదా హృష్టశ్చ జాయతే** 371

అనురాధ నక్షత్రములో జన్మించినవాడు పురుషార్థము కలవాడు ప్రవాస జీవితము గడుపువాడు, సోదరుల పనులలో ఆసక్తి చూపువాడు ఎల్లప్పుడు ప్రసన్నమైన మనసుతో నుండువాడుగును.

**బహుమిత్రః ప్రధానశ్చ కవిర్దానీ విచక్షణః**
**జ్యేష్ఠాజాతో ధర్మరతో జాయతే శూద్ర పూజితః** 372

జ్యేష్ఠ నక్షత్రములో జన్మించినవాడు అనేక మిత్రులు కలవాడు ప్రధాన వ్యక్తి, కవి, దాని, నిపుణుడు ధర్మముగా నడుచువాడు శూద్రులచే పూజింపబడువాడగును.

**స్థిరభోగీ చ మానీ చ ధనవాంశ్చ సుఖీభవేత్**
**తృతీయ పాదే తుర్యే చ మూలాద్యేఽర్ధే పరిత్యజేత్** 373

మూల నక్షత్రములో మూడునాలుగు చరణములలో జన్మించిన బాలకుడు స్థిరమైన భోగములననుభవించువాడు. అభిమాని, ధని, సుఖియగును. మొదటి చరణము సగములో జన్మించిన బాలకుని వదిలిపెట్టవలెను.

**ఆద్యపాదే పితుః పీడామూలే మాతుర్ద్వితీయకే**
**తృతీయే ధనహానిశ్చ చతుర్థే సుఖసమ్పదః** 374

మూలనక్షత్రము మొదటి పాదములో జన్మించిన తండ్రికి పీడ కలుగును, రెండవ పాదములో జన్మించిన తల్లికి పీడ కలుగును. మూడవ పాదములో జన్మించిన ధనహాని నాల్గవ పాదములో జన్మించిన సుఖసంపత్తులు కలుగును.

**దృష్ట మాత్రోప కారీచ భాగ్యవాంశ్చ జనప్రియః**
**పూర్వాషాఢే నరోజాతః సకలార్థ విచక్షణః** 375

పూర్వాషాఢ నక్షత్రములో జన్మించిన వాడు ఉపకారము చేయువాడు. భాగ్యవంతుడు, లోకులకు ప్రియుడు, సర్వకార్యములలో నిపుణుడగును.

**బహుమిత్రో మహాకాయో ధార్మికో వినయీ సుఖీ**
**ఉత్తరాషాఢ సమ్భూతః శూరశ్చ విజయీ రణే** 376

ఉత్తారాషాఢ నక్షత్రములో జన్మించినవాడు అధిక మిత్రులు కలవాడు పెద్ద శరీరము కలవాడు ధర్మాత్ముడు, వినయశాలుడు, సుఖి, శూరుడు, సంగ్రామములో విజయమును పొందువాడగును.

**కృతజ్ఞః వినయీ దాతా సర్వదాఽరోగ్యసంయుతః**
**లక్ష్మీవాన్బలసంయుక్తః శ్రవణే జాయతే నరః** **377**

శ్రవణ నక్షత్రములో జన్మించినవాడు వినయము కలవాడు, దాని, సదా ఆరోగ్యవంతుడు, ధనవంతుడు బలవంతుడగును

**గీతప్రియో బన్ధు మాన్యో హేమరత్నైరలంకృతః**
**జాతనరో ధనిష్ఠాయామేకః శతపతిర్భవేత్** **378**

ధనిష్ఠలో జన్మించినవాడు గానప్రియుడు, సోదరులకు పూజ్యుడు స్వర్ణరత్నములతో అలంకరింపబడువాడు ఒక్కడే అనేక మందికి ప్రభువగును.

**కృపణో ధనపూర్ణశ్చ పరదారోపసేవకః**
**నరః శతభిషాయాం చ విదేశగమనే రతః** **379**

శతభిషములో జన్మించినవాడు కృపణుడు, ధనవంతుడు, పరస్త్రీరతుడు పరదేశ యాత్రచేయువాడగును.

**వక్తా సుఖీ ప్రజాయుక్తో బహునిద్రో నిరర్థకః**
**పూర్వాభాద్ర పదాజాతో నరోభవతి దుఃఖితః** **380**

పూర్వాభాద్రలో జన్మించినవాడు మంచి వక్త, సుఖి, సంతానయుక్తుడు, అధిక నిద్ర కలవాడు, నిరర్ధకుడు దుఃఖితుడగును.

**గౌరః సమస్త ధర్మజ్ఞః శత్రుఘాతీ చ పామరః**
**ఉత్తరాభాద్ర నక్షత్ర జాతః సాహసికో భవేత్** **381**

ఉత్తరా భాద్రలో జన్మించినవాడు ఎరుపు రంగు కలవాడు. అన్ని ధర్మములు తెలిసినవాడు, శత్రువులను సంహరించువాడు పామరుడు, సాహసవంతుడగును.

**సమ్పూర్ణాఙ్గః సుచిర్దక్షః సాధుః శూరో విచక్షణః**
**రేవతీ సమ్భవో లోకే ధనధాన్యైరలంకృతః** **382**

రేవతీ నక్షత్రములో జన్మించినవాడు సంపూర్ణాంగములు కలవాడు, పవిత్రుడు, నిపుణుడు, సాధువు శూరుడు, విచక్షణుడు లోకములో ధనధాన్యములతో అలంకరింపబడినవాడగును.

**జన్మ నక్షత్ర ఫలము సమాప్తము**

--- oOo ---

## నందాది తిథి జన్మ ఫలము

**నన్దాతిథౌ నరో జాతో మహామానీ చ కోవిదః**
**దేవతాభక్తినిష్ఠశ్చ జ్ఞానీ చ ప్రియవత్సలః** **383**

నందా తిథిలో (1, 6, 11) జన్మించిన వ్యక్తి అత్యంత అభిమానవంతుడు విద్వాంసుడు, దైవభక్తుడు, జ్ఞాని ప్రియజనులకు హితము చేయువాడగును.

**భద్రాతిథౌ బన్ధుమాన్యో రాజసేవీ ధనాన్వితః**
**సంసారభయభీతశ్చ పరమార్థమతిర్నరః** **384**

భద్రా తిథిలో (2, 7, 12) జన్మించినవాడు సోదరులతో పూజింపబడువాడు. రాజుకు సేవచేయువాడు, ధనవంతుడు, సంసారమన్న భయముకలవాడు, పరమార్థమునందాసక్తిని చూపువాడగును.

**జయాతిథౌ రాజపూజ్యః పుత్రపౌత్రాదిసంయుతః**
**శూరః శాన్తశ్చ దీర్ఘాయుర్మహావిజ్ఞశ్చ జాయతే** **385**

జయా తిథిలో (3, 8, 13) జన్మించివాడు రాజ పూజ్యుడు, పుత్ర పౌత్రులతో కూడినవాడు శూరుడు, శాంతస్వభావుడు, దీర్ఘాయువు కలవాడు మహావిద్వాంసుడగును.

**రిక్తాతిథౌ విత్తహీనః ప్రమాదీ గురునిన్దకః**
**శాస్త్రజ్ఞమతిహన్తా చ కాముకశ్చ నరో భవేత్** **386**

రిక్తాతిథిలో (4, 9, 14) జన్మించినవాడు ద్రవ్యములేనివాడు. ప్రమాది గురువును నిందించువాడు. శాస్త్ర వేత్తల బుద్ధి నష్టము కలిగించువాడు కాముకుడగును.

**పూర్ణాతిథౌ ధనైః పూర్ణో వేదశాస్త్రార్థతత్వవిత్**
**సత్యవాదీ శుద్ధచేతా జాతో భవంతి మానవః** **387**

పూర్ణా తిథిలో (5, 10, 15) జన్మించినవాడు ధనవంతుడు, వేద శాస్త్రముల అర్థమును తెలిసివాడు, సత్యము పలుకువాడు నిర్మలమైన మనసు కలవాడగును.

**నందాది తిథిజన్మఫలము సమాప్తము**

**ఇతి శ్రీసర్వశాస్త్ర విశారద శ్రీ కాశీనాథకృతలగ్న**
**చన్ద్రికాయాం ప్రథమః పరిచ్ఛేదః**

**ఇది శ్రీ సర్వశాస్త్ర విశారదుడైన శ్రీకాశీనాథ కృత**
**లగ్న చంద్రికలో ప్రథమ పరిచ్ఛేదము.**

--- oOo ---

# ద్వితీయ పరిచ్ఛేదము - 2

## ద్వాదశ భావగత సూర్యఫలము

**లగ్నే సూర్యేஉ తి తీవ్రశ్చ చఞ్చలాత్మా స్మరాతురః**
**నేత్రరోగీ పీడితాఙ్గో జాయతే చారుణాకృతిః** 1

జన్మలగ్నములో సూర్యుడున్న జాతకుడు అతి తీవ్రమైన మనస్తత్వము, చంచలత్వము కామాతురతత్త్వము, పీడింపబడిన అంగములు రక్తవర్ణాకృతి కలవాడగును.

**సూర్యే ధనే వివాదీ చ బహుశత్రుశ్చ నిర్ధనః**
**పరాపవాదీ సేర్ష్యశ్చ కృతఘ్నశ్చ భవేన్నరః** 2

ద్వితీయ భావములో సూర్యుడున్న వివాది, అధిక శత్రువులు కలవాడు నిర్ధనుడు, ఇతరులకపకారము చేయువాడు, ఈర్ష్యాయుక్తుడు కృతఘ్నుడగును.

**తృతీయస్థే దివానాథే ప్రసిద్ధో రోగవర్జితః**
**భూపతిశ్చ సుశీచలశ్చ దయాలుశ్చ భవేన్నరః** 3

తృతీయ భావములో సూర్యుడున్న ప్రసిద్ధుడు రోగరహితుడు, రాజు, సుశీలుడు, ధయకలవాడగును.

**సూర్యే చతుర్థే దుర్బుద్ధిః కృశాఙ్గః సుఖవర్జితః**
**అప్రభావో నిష్ఠురశ్చ దుష్ట సఙ్గీ భవేన్నరః** 4

చతుర్థ భావములో సూర్యుడున్న దుర్బుద్ధి, బలహీన శరీరము కలవాడు సుఖరహితుడు, ప్రభావరహితుడు, నిష్ఠురుడు, దుష్టులతో సహావాసము చేయువాడగును.

**పఞ్చమేஉ ర్కే కోపయుక్తః కురూపః శీలవర్జితః**
**కుసఙ్గ లబ్ధవృత్తిశ్చ గతమానశ్చ జాయతే** 5

పంచమ భావములో సూర్యుడున్న క్రోధి, కురూపుడు, శీలరహితుడు చెడు సహవాసముతో కూడిన వృత్తి కలవాడు గౌరవహీనుడగును.

**షష్ఠేసూర్యే గతారిశ్చ ఖ్యాతమానః సుఖీశుచిః**
**శూరోஉ నురాగీ భూపాల సమ్మతశ్చ భవేన్నరః** 6

షష్ఠమ భావములో సూర్యుడున్న శత్రురహితుడు, ప్రసిద్ధుడు, సుఖి, పవిత్రుడు, వీరుడు, అనురాగి, రాజవిశ్వాసమును పొందువాడగును.

**సప్తమేఽర్కే కుదారశ్చ దుష్టప్రీతోఽల్పపుత్రకః**
**గుహ్యరోగీ సపాపశ్చ జాతకో హి ప్రజాయతే** 7

సప్తమ భావములో సూర్యుడున్న దుష్ట స్త్రీ కలవాడు, దుష్టులను ప్రేమించువాడు, అల్పసంతానము కలవాడు, గుప్త రోగములతో పీడితుడు పాపాత్ముడగును.

**అష్టమస్థే దివానాథే కృతఘ్నో హీనమానసః**
**శత్రుదగ్ధో వృథాగామీ బన్ధుహీనశ్చ జాయతే** 8

అష్టమ భావములో సూర్యుడున్న కృతఘ్నుడు, హీనమైన మనసుకలవాడు శత్రువుల వలన దగ్ధమైనవాడు వ్యర్థముగా చరించువాడు బంధుహీనుడగును.

**నవమస్థే రవౌ జాతః కుకర్మా భాగ్యవర్జితః**
**విద్యావివేకహీనశ్చ కుశీలశ్చ ప్రజాయతే** 9

నవమ భావములో సూర్యుడున్న కుకర్మి, భాగ్యహీనుడు, విద్యావివేక రహితుడు చెడు నడత కలవాడగును.

**దశమేఽర్కే బన్ధుహీనః కుకర్మాశీలవర్జితః**
**స్త్రీ చఞ్చలో హీనతేజో హీనకోశశ్చజాయతే** 10

దశమ భావములో సూర్యుడున్న బంధుహీనుడు, కుకర్మి, శీలరహితుడు, చంచల స్త్రీ కలవాడు, తేజోహీనుడు, ధనహీనుడగును.

**లాభే సూర్య సముత్పన్నో నానాలాభసమన్వితః**
**సాత్వికో ధార్మికో జ్ఞానీ రూపవా నపి జాయతే** 11

లాభ భావములో సూర్యుడున్న అనేక లాభములు కలవాడు, సాత్త్వికుడు ధర్మవంతుడు, జ్ఞాని రూపవంతుడగును.

**వ్యయే సూర్యే నరోరోగీ సత్వహీనో వృథాటనః**
**అసద్వ్యయీ పుత్రదార భక్తిహీనశ్చ జాయతే** 12

వ్యయ భావములో సూర్యుడున్న మనుష్యుడు రోగి, సారహీనుడు, వ్యర్థముగా తిరుగువాడు, అనవసర పనులలో ఖర్చు చేయువాడు. పుత్ర స్త్రీ భక్తి హీనుడగును.

**ద్వాదశ భావగత సూర్య ఫలము సమాప్తము**

--- oOo ---

**ద్వాదశ భావగత చంద్రఫలము :**

**లగ్నే చన్ద్రే జడః శుద్ధః ప్రసన్నో ధనపూరితః**
**స్త్రీ వల్లభో ధార్మికశ్చ కృతఘ్నశ్చ నరోభవేత్** 13

లగ్నములో చంద్రుడున్న జాతకుడు జఢుడు, శుద్ధుడు, ప్రసన్నుడు, ధని, స్త్రీకిహితుడు, ధార్మికుడు కృతఘ్నుడగును.

**ధనేచన్ద్రే ధనైఃపూర్ణో నృపపూజ్యో గుణాన్వితః**
**శాస్త్రానురాగీ సుభగో జనప్రీతశ్చన్ద్రే జాయతే** 14

ద్వితీయ భావములో చంద్రుడున్న ధని, రాజుచే పూజింపబడువాడు, గుణవంతుడు శాస్త్రములందాసక్తి కలవాడు, సౌభాగ్యవంతుడు, మనుష్యులకు ప్రీతిని కలిగించువాడగును.

**తృతీయే చ నిశానాథే ధనవిద్యాదిభిర్యుతః**
**కఫాధికః కాముకశ్చ వంశముఖ్యోఽపి జాయతే** 15

తృతీయ భావములో చంద్రుడున్న ధనవంతుడు విద్యావంతుడు, కఫ ప్రకృతి కలవాడు కాముకుడు వంశములో ప్రధానుడగును.

**చతుర్థే చ నిశానాథే పుత్రీ దారసమన్వితః**
**ధనీసుఖీ యశస్వీ చ విద్యావానపి జాయతే** 16

చతుర్థములో చంద్రుడున్న పుత్రీ స్త్రీ యుక్తుడు, ధనవంతుడు, సుఖి, యశస్వి విద్వాంసుడగును.

**సుతే చన్ద్రే సుతాఢ్యశ్చ రోగీ కామీ భయానకః**
**కృషీమయై రసైర్యుక్తో వినయీ చ భవేన్నరః** 17

పంచమ భావములో చంద్రుడున్న పుత్రులతో కూడినవాడు, రోగి, కాముకుడు భయానకుడు కృషీవలుడు రసయుక్తుడు వినయవంతుడగును.

**షష్ఠే చన్ద్రే విత్తహీనో మృదుకాయోఽతిలాలసః**
**మన్దాగ్ని స్తీక్ష్ణ దృష్టిశ్చ శూరోఽపి మనుజో భవేత్** 18

షష్ఠమములో చంద్రుడున్న మనుష్యుడు ద్రవ్యహీనుడు, కోమలదేహమువాడు, అతిగా ఆశపడువాడు, మందాగ్నికలవాడు, తీక్ష్ణ దృష్టి కలవాడు, వీరుడగును.

**చన్ద్రే తు సప్తమే జాతో దుఃఖీ కుష్ఠీ చ వఞ్చకః**
**కృపణో బహువైరీ చ జాయతే పరదారకః** 19

సప్తమములో చంద్రుడున్న దుఃఖి, కుష్ఠరోగి, వంచకుడు, కృపణుడు (లోభి), అధిక శత్రువులు కలవాడు, పరస్త్రీగామియగును.

**అష్టమే తారకానాథే దీనోఽల్పాయుః సకష్టకః**
**ప్రగల్భశ్చ కృశాఙ్గశ్చ పాపబుద్ధిర్భవేన్నరః** 20

అష్టమములో చంద్రుడున్న జాతకుడు దుఃఖి అల్పాయువు కలవాడు కష్టపడువాడు, ప్రగల్భములు పలుకువాడు, బలహీన శరీరుడు పాపబుద్ధి కలవాడగును.

**ధర్మే చన్ద్రే చారుకాన్తిః స్వధర్మనిరతఃసదా**
**వీతరోగః సతాం శ్లాఘ్యః పాపహీనశ్చ జాయతే** **21**

నవమ భావములో చంద్రుడున్న అతి సుందరుడు స్వధర్మములు ఆచరించువాడు రోగరహితుడు, సజ్జనులచే గౌరవింపబడువాడు పాపరహితుడగును.

**కర్మస్థానే సుధారశ్మౌ బహుభాగ్యో మహాధనీ**
**మనస్వీ చ మనోజ్ఞశ్చ రాజమాన్యశ్చ జాయతే** **22**

దశమభావములో చంద్రుడున్న అత్యంత భాగ్యశాలి అతి ధనవంతుడు మంచి మనసుకలవాడు సుందరుడు రాజ పూజ్యుడగును.

**లాభే చన్ద్రే లాభయుక్తః ప్రగల్భః సుభగో నరః**
**సుమార్గగామీ లజ్జాలుః ప్రతాపీ భాగ్యవాన్ భవేత్** **23**

ఏకాదశ భావములో చంద్రుడున్న లాభము కలుగువాడు ప్రగల్భములు పలుకువాడు ఐశ్వర్యవంతుడు సుమార్గమున నడుచువాడు లజ్జాయుక్తుడు ప్రతాపవంతుడు భాగ్యవంతుడగును.

**వ్యయే చన్ద్రే పాపబుద్ధిర్బహు భక్షీ పరాజితః**
**కులాధమో మద్యపీ చ వికారీ జాతకో భవేత్** **24**

ద్వాదశ భావములో చంద్రుడున్న జాతకుడు పాపబుద్ధి కలవాడు. అధికముగా తినువాడు, ఓడిపోవువాడు, కులములో అధముడు మద్యమును త్రాగువాడు, వికృతాకారముతో నుండువాడగును.

**చంద్ర ద్వాదశ భావ గత చంద్ర ఫలము సమాప్తము**

**--- oOo ---**

**మంగళ ద్వాదశ భావఫలము**

**భౌమే లగ్నే కురూపశ్చ రోగీ బన్ధువివర్జితః**
**అసత్యవాదీ నిర్ద్రవ్యో జాయతే పరదారకః** **25**

లగ్నములో కుజుడున్న జాతకుడు కురూపి, రోగి, బంధురహితుడు, అబద్ధములాడువాడు, ధనహీనుడు పరస్త్రీగామియగును.

**ధనే కుజే ధనైర్హీనః క్రియాహీనశ్చ జాయతే**
**దీర్ఘసూత్రీ సత్యవాదీ పుత్రవానపి మానవః** **26**

ధనస్థానములో కుజుడున్న ధనహీనుడు, క్రియాహీనుడు, దీర్ఘ సూత్రి (ఆలస్యముగా పనిచేయువాడు) సత్యవాది, పుత్రవంతుడగును.

**తృతీయ భూసుతే జాతః ప్రతాపీ శీలసంయుతః**
**రణే శూరోరాజమాన్యో భువి ఖ్యాతశ్చ జాయతే** **27**

తృతీయములో కుజుడున్న ప్రతాపవంతుడు, శీలయుక్తుడు, యుద్ధములో బలవంతుడు రాజు ద్వారా పూజింపబడువాడు భూమిపై ప్రసిద్ధినిపొందువాడగును.

**చతుర్థే భూసుతే కృష్ణః పిత్తాధిక్యోఽరినిర్జితః**
**వృథాటనా హీనపుత్రో మహాకామీ చ జాయతే** 28

చతుర్థ భావములో కుజుడున్న శ్యామవర్ణుడు అధికపిత్తముకలవాడు శత్రువులచే ఓడింపబడువాడు. వ్యర్థముగా తిరుగువాడు. పుత్రహీనుడు మహాకాముకుడగును.

**పఞ్చమే చ ధరాపుత్రే కుసన్తానః సదారుజః**
**బన్ధువర్గే విరక్తశ్చ నరో బుద్ధివివర్జితః** 29

పంచమ భావములో కుజుడున్న చెడుపుత్రులు కలవాడు, ఎల్లప్పుడు రోగముతో నుండువాడు, బంధువర్గమునకు విరక్తిని కలిగించువాడు బుద్ధిహీనుడుగును.

**షష్ఠేభౌమే శత్రుహీనో నానార్థైః పరిపూరితః**
**స్త్రీలాలసః పుష్టదేహః శుద్ధిచిత్తశ్చ జాయతే** 30

షష్ఠమ భావములో కుజుడున్న శత్రువులు లేనివాడు అనేక ద్రవ్యములు కలవాడు స్త్రీలందాసక్తి కలవాడు దేహపుష్టికలవాడు శుద్ధచిత్తుడగును.

**సప్తమే భూమిపుత్రే చ రుధిరాక్తోఽపి కోపవాన్**
**నీచసేవీ వఞ్చకశ్చ నిష్ఠురోఽపి భవేన్నరః** 31

సప్తమ స్థానములో కుజుడున్న, రక్తము వలె ఎరువు వర్ణము కలవాడు, క్రోధము కలవాడు, నీచులకు సేవచేయువాడు వంచకుడు నిష్ఠురమైన మనసుకలవాడగును.

**అష్టమే మఙ్గలే కుష్ఠీ స్వల్పాయుః శత్రుపీడితః**
**అల్పద్రవ్యః సరోగశ్చ నిర్గుణోఽపి భవేన్నరః** 32

అష్టమ స్థానములో కుజుడున్న కుష్ఠిరోగి, అల్పాయువు కలవాడు, శత్రువుల వలన పీడింపబడువాడు, స్వల్పద్రవ్యము కలవాడు రోగయుక్తుడు, గుణరహితుడగును.

**ధర్మాస్థే ధరణీపుత్రే కుకర్మా గతపౌరుషః**
**నీచానురాగీ క్రూరశ్చ సంకష్టశ్చ ప్రజాయతే** 33

నవమ భావములో కుజుడున్న చెడు కర్మలు చేయువాడు, పౌరుషములేనివాడు నీచులను ప్రేమించువాడు క్రూరుడు కష్టయుక్తుడగును.

**కర్మస్థానే మహీపుత్రే శుభకర్మా శుభాన్వితః**
**సుపుత్రీ స్యాత్సుఖీ శూరో గర్విష్ఠోఽపి భవేన్నరః** 34

దశమ భావములో కుజుడున్న శుభకర్మలు చేయువాడు, ఆనందముతోనుండువాడు, మంచి పుత్రులు కలవాడు సుఖి శూరుడు

అభిమానవంతుడగును.

**లాభే భౌమే భూరిలాభో నానాపక్వాన్న భక్షకః**
**నీరోగో నృపమాన్యశ్చ దేవద్విజరతో భవేత్ 35**

లాభభావములో కుజుడున్న అధిక లాభము కలవాడు అనేక విధములైన మంచి పదార్థములను తినువాడు, రోగరహితుడు, రాజులచే పూజింపబడువాడు, దేవబ్రహ్మణులను పూజించువాడగును.

**అసద్వ్యయీ వ్యయే భౌమే నాస్తికో నిష్ఠురః శఠః**
**బహువాదీ విదేశే చ సదా గచ్ఛతి మానవః 36**

వ్యయభావములో కుజుడున్న జాతకుడు చెడుపనులకు ఖర్చుచేయువాడు నాస్తికుడు, కఠోర మనస్తత్వము కలవాడు అధికముగా మాట్లాడువాడు, పరదేశములో నివసించువాడగును.

**కుజ ద్వాదశ భావఫలము సమాప్తము**

**--- oOo ---**

**బుధ ద్వాదశ భావఫలము**

**లగ్నే బుధే చ గీతజ్ఞో నిష్పాపో భూపపూజితః**
**రూపజ్ఞాన యశోయుక్తః ప్రగల్భో మానవో భవేత్ 37**

లగ్నములో బుధుడున్న జాతకుడు గానవిద్యను తెలిసినవాడు పాపరహితుడు రాజు ద్వారా పూజింపబడేవాడు రూప, జ్ఞాన, యశోవంతుడు, ప్రతిభావంతుడగును.

**చన్ద్రపుత్రే ధనస్థానే ధనధాన్యాదిపూజితః**
**శుభకర్మా సుఖీ నిత్యం రాజపూజ్యశ్చ జాయతే 38**

ద్వితీయ భావములో బుధుడున్న ధనధాన్యములు కలవాడు శుభకర్మలు చేయువాడు, ఎల్లప్పుడు సుఖముగా నుండువాడు, రాజపూజితుడగును.

**తృతీయే చ బుధే జాతః ప్రశస్తో బన్ధుమానితః**
**ధర్మధ్వజీ యశస్వీచ గురుదేవార్చకో భవేత్ 39**

తృతీయ భావములో బుధుడున్న మనుష్యుడు శ్రేష్ఠుడు బంధువులచే పూజింపబడేవాడు ధర్మపరాయణుడు, యశోవంతుడు గురుదేవులను, దేవతలను పూజించువాడగును.

**చతుర్థే చన్ద్రపుత్రే చ బహుభృత్యయశోఽన్వితః**
**బహువాక్యో భాగ్యయుక్తః సత్యవాదీ చ జాయతే 40**

చతుర్థ భావములో బుధుడున్న అనేక మంది సేవకులు కలవాడు,

యశోవంతుడు, మంచివక్త, భాగ్యవంతుడు, సత్యవాదియగును.

**పఞ్చమే రోహిణీపుత్రే పుత్రపౌత్ర సమన్వితః**
**సుబుద్ధిః సత్వసమ్పన్నః సుఖీ భవతి మానవః** **41**

పంచమ భావములో బుధుడున్న పుత్ర పౌత్రులతో కూడినవాడు. సుందరమైన బుద్ధికలవాడు సుఖవంతుడగును.

**షష్ఠే బుధే నృశంసశ్చ విరోధీ సర్వబన్ధుషు**
**ఈర్ష్యాధికః కామరూపో విద్వానపి భవేన్నరః** **42**

షష్ఠమ భావములో బుధుడున్న క్రూరుడు, సోదరులకు విరోధి, అధికమైన ఈర్ష్యకలవాడు కామాతురుడు విద్వాంసుడగును.

**సప్తమే సోమపుత్రే చ రూపవిద్యాధికో నరః**
**సుశీలః కామశాస్త్రజ్ఞో నారీమాన్యశ్చ జాయతే** **43**

సప్తమభావములో బుధుడున్న అధిక రూపవంతుడు, అధిక విద్యావంతుడు సుశీలుడు, కామశాస్త్రమును తెలిసినవాడు స్త్రీలకు పూజ్యుడగును.

**బుధేஉష్టమే కృతఘ్నశ్చ కుబుద్ధిః పరదారికః**
**కామాతారో సత్యవాదీ రోగయుక్తో భవేన్నరః** **44**

అష్టమ భావములో బుధుడున్న కృతఘ్నుడు, చెడు బుద్ధికలవాడు, పరస్త్రీలందాసక్తి కలవాడు సత్యమును పలుకువాడు, జితేంద్రియుడు తండ్రికి ప్రియుడగును.

**ధర్మేబుధే ధార్మికశ్చ కూపారామాదికారకః**
**సత్యవాదీ చ దాన్తశ్చ జాయతే పితృవత్సలః** **45**

నవమ భావములో బుధుడున్న ధర్మవంతుడు, బావులు, తోటలను నిర్మించువాడు సత్యమును పలుకువాడు జితేంద్రియుడు తండ్రికి ప్రియమైనవాడగును.

**దశమే చ బుధే జాతో ధనధాన్యసమన్వితః**
**బహుభాగ్యశ్చ విజయీ కాన్తియుక్తశ్చ మానవః** **46**

దశమ భావములో బుధుడున్న ధనధాన్యయుక్తుడు అధిక భాగ్యవంతుడు విజయమును పొందువాడు, కాంతిమంతుడగును.

**లాభే సౌమ్యే నిత్యలాభీ నీరోగశ్చ సదాసుఖీ**
**జనానురాగీవృత్తిశ్చ కీర్తిమానపి జాయతే** **47**

లాభస్థానములో బుధుడున్న ఎల్లప్పుడు లాభమును పొందువాడు, రోగహీనుడు ఎల్లప్పుడు సుఖమును పొందువాడు మనుష్యులతో ప్రేమగా నుండువాడు కీర్తిమంతుడగును.

**బుధే వ్యయే వ్యయీలోకే రోగీ బన్ధుసమన్వితః**
**పాపాసక్తః పరాధీనః పరపక్షీ చ జాయతే** **48**

ద్వాదశ భావములో బుధుడున్న జాతకుడు లోకములో అధికముగా ధనమును ఖర్చు చేయువాడు, రోగి, సోదరులతో కుడినవాడు, పాపము చేయువాడు పరులకాధీనమైనవాడు శత్రుపక్షములోనుండువాడగును.

**బుధ ద్వాదశ భావఫలము సమాప్తము**

**--- oOo ---**

**గురు ద్వాదశ భావఫలము**

**లగ్నే గురౌ సుశీలశ్చ ప్రగల్భో రూపవానపి**
**నృపాభీష్టశ్చ నీరోగీ జ్ఞానీ సౌమ్యశ్చ జాయతే 49**

లగ్నములో గురుడున్న జాతకుడు ప్రతిభావంతుడు, రూపవంతుడు రాజుకు ప్రియుడు, రోగహీనుడు, జ్ఞాని సౌమ్యుడగును.

**ధనే జీవే ధనీలోకే కృతజ్ఞో బన్ధుసంయుక్తః**
**గజాశ్వ మహిషీయుక్తః కాన్తిమానపి జాయతే 50**

ద్వితీయ భావములో గురుడున్న జాతకుడు లోకములో ధనవంతుడు అభిమానవంతుడు, కృతజ్ఞుడు, సోదరులతో కూడినవాడు, ఏనుగులు, గుఱ్ఱములు గేదెలతో కూడినవాడు కాంతిమంతుడగును.

**జీవే తృతీయే తేజస్వి కర్మదక్ష జితేన్ద్రియః**
**మిత్రాప్తసుఖసమ్పన్న స్త్రీర్థవార్తాప్రియో భవేత్ 51**

తృతీయ భావములో గురుడున్న తేజోవంతుడు, కార్యనిపుణుడు, జితేంద్రియుడు, మిత్రులవలన సుఖమును పొందువాడు తీర్థ యాత్రల ప్రసంగము వలన సంతోషమును పొందువాడగును.

**సుఖే జీవే సుఖీ లోకే సుభగో రాజపూజితః**
**విజితారిః కులాధ్యక్ష గురుభక్తశ్చ జాయతే 52**

చతుర్థ గృహములో గురుడున్న లోకములో సుఖమును పొందువాడు సౌభాగ్యవంతుడు, రాజులచే పూజింపబడువాడు శత్రువులను జయించువాడు కులములో ప్రధానమైనవాడు గురుభక్తుడగును.

**సుతే జీవే సుతైర్యుక్తో ధార్మికః పణ్డితః సుఖీ**
**శుద్ధచేతా దయాయుక్తో వినయీ చ భవేన్నరః 53**

పంచమ గృహములో గురుడున్న పుత్రవంతుడు, ధర్మపరాయణుడు, పండితుడు, సుఖి, నిర్మలమైన మనస్సు కలవాడు, ధయాళువు, నమ్ర స్వభావము కలవాడగును.

**షష్ఠే గురౌ విఘ్నయుక్తో బహుశత్రుశ్చ నిష్ఠురః**
**ఉద్వేగీ మతిహీనశ్చ కాముకో జాయతే నరః 54**

షష్ఠ భావములలో గురుడున్న విఘ్నములు కలిగించువాడు, అధికమైన శత్రువులు కలవాడు, పరుషమైన వచనములు పలుకువాడు, ఉద్రేక స్వభావము కలవాడు, బుద్ధిహీనుడు కాముకుడగును.

**సప్తమస్థే సురాచార్యే కామిచిత్తో మహాబలః**
**ధనీ దాతా ప్రగల్భశ్చ చిత్రకర్మా చ జాయతే** **55**

సప్తమ భావములో గురుడున్న పనియందాసక్తి కలవాడు మహా బలవంతుడు, ధని, దాత, ప్రగల్భములు పలుకువాడు చిత్రనిర్మాణము చేయువాడగును.

**జీవేఽ ష్టమే సదారోగీ కృపణః శోకసంయుతః**
**బహువైరీ కుకర్మా చ కురూపశ్చ భవేన్నరః** **56**

అష్టమ భావములో గురుడున్న ఎల్లప్పుడు రోగము కలవాడు, లోభి, శోకముతో నుండువాడు, అధిక శత్రువులు కలవాడు చెడుపనులు చేయువాడు, రూపహీనుడగును.

**ధర్మే జీవే ధర్మకర్మా సాధుసఙ్గీ చ శాస్త్రవిత్**
**నిరీహస్తీర్థ సేవీ చ బ్రహ్మజ్ఞశ్చ ప్రజాయతే** **57**

నవమ భావములో గురుడన్న ధర్మకార్యములు చేయువాడు, సాధువులతో సాంగత్యము కలవాడు, శాస్త్రములు తెలసినవాడు, ఆసక్తి లేనివాడు, తీర్థయాత్రలు చేయువాడు బ్రహ్మ జ్ఞానము కలవాడగును.

**కర్మస్థితే సురాచార్యే పుణ్యకీర్తి సుఖాన్వితః**
**రాజతుల్యం, సురూపశ్చ దయాలుర్జాయతే నరః** **58**

దశమ భావములో గురుడున్న మనుష్యుడు పుణ్యవంతుడు యశస్సు, సుఖము కలవాడు రాజులచే గౌరవింపబడువాడు రూపవంతుడు దయాగుణము కలవాడగును.

**లాభేగురౌ వివేకీ స్యాద్గస్త్యశ్వాదిధనైర్యుతః**
**చఞ్చలోఽ పి సురూపశ్చ గుణవానపి జాయతే** **59**

ఏకాదశ భావములో గురుడున్న వివేకవంతుడు, ఏనుగులు గుర్రములు ధనముకలవాడు చంచల మనస్తత్వము కలవాడు రూపవంతుడు గుణవంతుడగును.

**వ్యయే బృహస్పతే రోగీవ్యసనీ పరకర్మకృత్**
**బన్ధువైరీ నీచసేవీ గురుద్వేషీ చ జాయతే** **60**

ద్వాదశ భావములో గురుడున్న జాతకుడు రోగి, వ్యసనపరుడు, ఇతరుల పనులు చేయువాడు, బంధువులకు విరోధి, నీచులకు సేవ చేయువాడు గురువుతో వైరమును పొందువాడగును.

**గురు ఫలము సమాప్తము**

**--- oOo ---**

**శుక్ర ద్వాదశ భావఫలము**

**లగ్నే శుక్రే సుశీలశ్చ విత్తవానపిసున్దరః**
**శుచిర్విద్వాన్ మనోజ్ఞశ్చ కృతజ్ఞశ్చ భవేన్నరః 61**

లగ్నములో శుక్రుడున్న జాతకుడు సుశీలుడు, ధనవంతుడు సుందరుడు, శుభ్రముగా నుండువాడు విద్వాంసుడు, మనోహరమైనవాడు కృతజ్ఞుడగును.

**ధనే శుక్రే ధనీ విద్వాన్ బన్ధుమాన్యో నృపార్చితః**
**యశస్వీ గురుభక్తశ్చ కృతజ్ఞశ్చ భవేన్నరః 62**

ద్వితీయ భావములో శుక్రుడున్న ధనవంతుడు, విద్వాంసుడు, సోదరులలో పూజనీయుడు, రాజపూజితుడు, యశోవంతుడు, గురువులందు భక్తి కలవాడు కృతజ్ఞుడగును.

**భార్గవే సహజే జాతో ధనధాన్యసుతాన్వితః**
**నీరోగీ రాజమాన్యశ్చ ప్రతాపీ చాపి జాయతే 63**

తృతీయ భావములో శుక్రుడున్న ధనవంతుడు, ధాన్యములు పుత్రులుకలవాడు, రోగరహితుడు రాజపూజితుడు ప్రతాపవంతుడగును.

**సుఖే శుక్రే సుఖీ విజ్ఞో బహుభార్యో ధనాన్వితః**
**గ్రమాధిపో యశస్వి స్యాద్వివేకీ చ భవేన్నరః 64**

చతుర్ధ భావములో శుక్రుడున్న సుఖి, విద్వాంసుడు, అనేక మంది స్త్రీలు కలవాడు అధిక ధనవంతుడు గ్రామాధికారి, యశస్వి, వివేకవంతుడగును.

**సుతే శక్రే సమృద్ధశ్చ సురూపశ్చ పదోన్నతః**
**పుత్ర కన్యాపౌత్రియుతః శుభగోఽపి భవేన్నరః 65**

పంచమ భావములో శుక్రుడున్న సకలసంపదలు కలవాడు, రూపవంతుడు ఉన్నతుడు, పుత్రులు కన్యలు పౌత్రులతో కూడిన వాడు సౌభాగ్యవంతుడగును.

**షష్ఠే శుక్రే భవేద్దమ్భీ జాడ్యహానిభయాన్వితః**
**దుఃసఙ్గీ కలహీ తాతద్వేషి చైవ సదా నరః 66**

షష్ఠ భావములో శుక్రుడున్న ఆడంబరములు పలుకువాడు, జాడ్యము హానిని భయము కలవాడు, దుష్టులతో సహవాసము చేయువాడు, జగడములాడువాడు తండ్రికి విరోధియగును.

**సప్తమే భృగుపుత్రే చ ధనీ దివ్యాఙ్గనాయుతః**
**నీరోగః సుఖసమ్పన్నో బహుభాగ్యః ప్రజాయతే 67**

సప్తమ భావములో శక్రుడున్న ధని, సుందర స్త్రీతో కూడినవాడు, రోగిరహితుడు, సుఖి, అధిక భాగ్యము కలవాడగును.

**అష్టమస్థే దైత్యపూజ్యే సరోగః కలహప్రియః**
**వృధాటనే కార్యహీనో జనానాం చ ప్రియోభవేత్** 68

అష్టమ భావములో శుక్రుడున్న రోగి, జగడములందాసక్తి కలవాడు వ్యర్థముగా చలించువాడు, కార్యహీనుడు జనులకు ప్రియుడగును.

**ధర్మేశుక్ర ధర్మపూర్ణో జ్ఞానవృద్ధః సుఖీ ధనీ**
**నరేన్ద్రమాన్యో వినయీ నరాణాం చ ప్రియః సదా** 69

నవమ గృహములో శుక్రుడున్న ధర్మపరాయణుడు, మహాజ్ఞాని సుఖవంతుడు, ధనవంతుడు, రాజపూజితుడు ఎల్లప్పుడు మనుష్యులకు ప్రేమపాత్రుడగును.

**కర్మస్థితే భృగోః పుత్రే కర్మవాన్నిధి రత్నవాన్**
**రాజసేవీ ధార్మికశ్చ జాయతే దయితాప్రియః** 70

దశమ భావములో శుక్రుడున్న కర్మనిరతుడు, నిధులు రత్నములతో కూడినవాడు, రాజసేవను చేయువాడు, ధర్మవంతుడు స్త్రీలకు ప్రియమైనవాడగును.

**లాభే శుక్రే సదాలాభో యశస్వీ చ గుణాన్వితః**
**ధనీ భోగీ క్రియాశుద్ధో జాయతే మానవోత్తమః** 71

ఏకాదశ భావములో శుక్రుడున్న ఎల్లపుడు లాభమును పొందువాడు యశస్వి, గుణి, ధని, భోగి, క్రియాశీలుడు మనుష్యులలో ఉత్తముడగును.

**వ్యయే శుక్రే వ్యయాఢ్యశ్చ గురుమిత్ర విరోధవాన్**
**మిధ్యావాదీ బన్ధువర్గే గుణహీనోఽ పి జాయతే** 72

ద్వాదశ భావములో శుక్రుడున్న జాతకుడు అధికముగా ఖర్చుచేయువాడు గురువులకు మిత్రులకు విరోధి సోదరులలో అబద్ధములాడువాడు.

**శుక్రఫలము సమాప్తము**

--- oOo ---

**శనిద్వాదశ భావ ఫలము :**

**లగ్నే శనౌ సదా రోగీ కురూపః కృపణో నరః**
**కుశీలః పాపబుద్ధిశ్చ శఠశ్చభవతి ధ్రువమ్** 73

లగ్నములో శనియున్న జాతకుడు ఎల్లప్పుడు రోగముతోనుండువాడు కురూపుడు కృపణుడు (లోభి) చెడునడవడి కలవాడు, పాపబుద్ధి కలవాడు నిశ్చయముగా మూర్ఖుడగును.

**ధనేమన్దే ధనైర్హీనో వాతపిత్తకఫాతురః**
**దేహాస్థిపిత్త రోగశ్చ గుణైః స్వల్పోఽ పి జాయతే** 74

ద్వితీయ భావములో శనియున్న ధనహీనుడు, వాతపిత్తకపములతో పీడింపబడువాడు దేహములో పిత్తరోగముకలవాడు గుణములు తక్కువగానుండు వాడగును.

**ఛాయత్మజే తృతీయస్థే ప్రసన్నోగుణవత్సలః**
**శత్రుమర్దీ నృణాం మాన్యో ధనీ శూరశ్చజాయతే** **75**

తృతీయ భావములో శనియున్న, ప్రసన్నమైన మనసుకలవాడు, గుణవంతుడు, శత్రువులను జయించువాడు, మనుష్యులలో పూజ్యుడు, ధని, వీరుడగును.

**సుఖే మన్దే సుఖైర్హీనో హృతార్థో బాన్ధవైర్నరః**
**గుణస్వభావో దుఃసఙ్గీ కుజనైశ్చావృతః శఠః** **76**

చతుర్ధ భావములో శనియున్న సుఖహీనుడు సోదరుల ధనమును గ్రహించువాడు, మంచిగుణములు కలవాడు చెడ్డ వారితో స్నేహము చేయువాడు దుష్టజనుల మధ్యలో నుండువాడగును.

**పుత్రే మన్దే పుత్రహీనః క్రియాకీర్తి వివర్జితః**
**హీనకేశో విరూపశ్చ మానవో భవతి ధ్రువమ్** **77**

పంచమ భావములో శనియున్న పుత్రహీనుడు, మంచి పనులు చేయనివాడు, గౌరవమును పొందనివాడు, ధనహీనుడు, కురూపుడగును.

**శత్రుభావస్థితే మన్దే శత్రుహీనో మహాధనీ**
**పశుపుత్ర యశోయుక్తో నీరోగి జాయతే నరః** **78**

షష్ఠమ భావములో శనియున్న శత్రువులు లేనివాడు, మహాధనవంతుడు పశుపుత్ర గౌరవములు కలవాడు, రోగరహితుడగును.

**కలత్రస్థే మిత్రపుత్రే సకలత్రో రుజాన్వితః**
**బహుశత్రుర్వివర్ణశ్చ కృశశ్చ మలినో భవేత్** **79**

సప్తమ స్థానములో కుజుడున్న స్త్రీ సహితముగా రోగవంతుడు అధిక శత్రువులు కలవాడు కురూపుడు, బలహీనుడు మలినుడగును.

**క్రోధాతురోఽష్టమే మన్దే దరిద్రో బహురోగవాన్**
**మిథ్యావివాదకర్తా స్యాద్వాతరోగీ భవేన్నరః** **80**

అష్టమ భావములో శనియున్న కోపము కలవాడు, దరిద్రుడు, అధిక రోగములు కలవాడు, అనవసరముగా జగడములాడువాడు వాత రోగముకలవాడగును.

**ధర్మేమన్దే ధర్మహీనో వివేకీ చ రిపోర్వశః**
**నృశంసో జాయతే లోకః పరదారరతః సదా** **81**

నవమ భావములో శనియున్న ధర్మహీనుడు, వివేకము కలవాడు శత్రువులకు వశమగువాడు క్రూరుడు, పరస్త్రీలందాసక్తి కలవాడగును.

**కర్మస్థానే సూర్యపుత్రే కుకర్మా ధనవర్జితః**
**దయాసత్యగుణైర్హీనశ్చఞ్చలోఽపి భవేన్నరః 82**

దశమ భావములో శనియున్న చెడుకర్మలు చేయువాడు, ధనము లేనివాడు, సత్యగుణములు లేనివాడు, చంచలుడగును.

**ఛాయాత్మజే చ లాభస్తే సర్వవిద్యావిశారదః**
**ఉష్ట్ర గోమహిషైః పూర్ణో రాజమాన్యః శుచిర్భవేత్ 83**

ఏకాదశ భావములో శనియున్న అన్ని విద్యలందు నిపుణుడు ఒంటెగోవు దున్నలు కలిగినవాడు, రాజులచే పూజింపబడువాడు పవిత్రుడగును.

**అసద్వ్యయీ వ్యయే మన్దే కృతఘ్నో విత్తవర్జితః**
**బన్ధువైరః కువేషః స్యాచ్చఞ్చలోఽపి నరః సదా 84**

ద్వాదశ భావములో శనియున్న జాతకుడు వృధా ఖర్చుచేయువాడు, కృతఘ్నుడు, ద్రవ్యహీనుడు, సోదరులతో వైరముకలవాడు, చెడువేషమును ధరించువాడు చంచలుడగును.

**శనిద్వాదశభావ ఫలము సమాప్తము**

**--- oOo ---**

**స్త్రీ జన్మ లగ్న ఫలము**

**లగ్నే చ సప్తమే పాపీ సప్తమే వత్సరేపతిః**
**మ్రియతే చాష్టమే వర్షే చన్ద్రే షష్ఠేఽష్టమే యదా 85**

స్త్రీ లగ్నములో లేక సప్తమ స్థానములో పాపగ్రములున్న పతి ఏడు వర్షములలో మరణించును. చంద్రుడు షష్ఠమ లేక అష్టమ భావములో నున్న ఎనిమిది వర్షములలో పతి మరణించును.

**గురౌ శుక్రే మృతాపత్యా మృతగర్భా చ మఙ్గలే**
**అష్టమస్థో గ్రహోనూనం న స్త్రియాః శోభనోమతః 86**

అష్టమ గృహములో గురుడు లేక శుక్రుడున్న పుత్రులు జీవించరు కుజుడున్న గర్భమునకు నష్టము కలుగును. అష్టమములో ఏ గ్రహమైన స్త్రీ జాతకములోనున్న మంచిందికాదు.

**ఏకః పుత్రో భవేద్రాజా పఞ్చమస్థో యదారవిః**
**మఙ్గలే చ త్రయః పుత్రా గురౌపఞ్చ ప్రకీర్తితాః 87**

పంచమ భావములో రవియున్న ఒక పుత్రుడు కలుగును. అతను రాజగును. కుజుడున్న ముగ్గరు పుత్రులు, గురుడున్న ఐదుగురు పుత్రులు కలుగును.

**పఞ్చమస్థే నిశానాథే స్త్రీయాః కన్యాద్వయంభవేత్**
**బుధే కన్యాశ్చతస్రశ్చ శుక్రే సప్త చ కన్యకాః 88**

స్త్రీకి పంచమస్థానములో చంద్రుడున్న ఇద్దరు పుత్రికలు కలుగుదురు, బుధుడున్న నలుగురు, శుక్రుడున్న ఏడుగురు కన్యలు కలుగుదురు.

**షడేవ కన్యా జాయన్తే ధర్మస్థానే యదాసితః**
**సప్తమే చ యదా రాహుః స్త్రియాః పుత్రస్తదా భవేత్** **89**

నవమ గృహములో శుక్రుడున్న ఆరుగురు కన్యలు కలుగుదురు సప్తమ గృహములో రాహువున్న ఒక పుత్రుడు  కలగును.

**సురూపా భార్గవే లగ్నే సాహఙ్కారా ధరాసుతే**
**బుధే వక్రా గురౌ శుద్ధా శనౌ దారిద్ర్యదుర్భగా** **90**

శుక్రుడు లగ్నములోనున్న సుందరమైన రూపము, కుజుడు లగ్నములోనున్న అభిమానము, బుధుడు లగ్నములోనున్న వక్రస్థితి, గురుడు లగ్నములోనున్న శుద్ధ మనస్తత్వము శనిలగ్నములోనున్న దరిద్రముతో భాగ్యహీనురాలగును.

**పాపయోరన్తరే లగ్నే చన్ద్రే వా యది కన్యకా**
**జాయతే చ తదా హన్తి పితృశ్వసురయోః కులమ్** **91**

స్త్రీకి లగ్నము గాని లేక చంద్రుడు గాని పాపగ్రహముల మధ్యలోనున్న తండ్రి మరియు మావల కులములు నాశనమగును.

**ద్వాదశే చాష్టమే భౌమే క్రూరే తత్రైవ సంస్థితే**
**లగ్నే చ సింహికాపుత్రే రణ్డా భవతి కన్యకా** **92**

ద్వాదశ లేక అష్టమ భావములో క్రూర గ్రహములతో కూడి కుజుడున్న మరియు లగ్నములో రాహువున్న కన్య విధవరాలగును.

**సప్తమే భార్గవే జాతా కులదోషకరీ భవేత్**
**కర్కరాశిస్థితే భౌమే స్వైరం భ్రమతి వేశ్మషు** **93**

సప్తమ గృహములో శుక్రుడున్న కులమునకు దోషము కలిగించును. కర్కాటక రాశిలో కుజుడున్న ఇచ్ఛా పూర్వకముగా గృహాములలో తిరుగును చెడు తిరుగుళ్లుకలదగును.

**లగ్నాత్సప్తమగః పాపశ్చన్ద్రాత్సప్తమగోఽపి వా**
**సద్యో నిహన్తి దమ్పత్యోః కన్యాతత్ర న సంశయః** **94**

లగ్నము నుండి గాని చంద్రుని నుండి గాని సప్తమ గృహములో పాపగ్రహములున్న ఈ యోగ మొక్కటే స్త్రీ పురుషులిరువురికి నష్టముకలిగించును.

**లగ్నే వా మేషకః సూర్యశ్చన్ద్రాత్సప్తమగోఽపివా**
**సద్యోనిహన్తి దమ్పత్యోః కన్యా తత్ర న సంశయః** **95**

లగ్న, ద్వాదశ చతుర్థ, పంచమ, సప్తమ గృహములలో గ్రహములున్న స్త్రీ పతిని సంహరించును పతిస్త్రీని సంహరించును.

**లగ్నే వ్యయే చతుర్థే చ పఞ్చమే సప్తమే గ్రహాః**
**పతిబన్ధ్యా భవేన్నారీ నారీబన్ధ్యో భవేత్పతిః** **96**

లగ్న, వ్యయ, చతుర్థ పంచమ సప్తమ గృహములలో గ్రహములున్న స్త్రీ పతిబంధ్యయగును (బంధితురాలగును) పతి నారిబంధ్యయగును.

## స్త్రీ జన్మలగ్న ఫలము సమాప్తము

--- oOo ---

**ఇతి శ్రీ సర్వశాస్త్ర విశారద శ్రీకాశీనాథకృతౌ**
**జాతకలగ్నచన్ద్రికాయాం గ్రహయోగో నామ ద్వితీయః పరిచ్ఛేదః**

**ఇది శ్రీ సర్వశాస్త్ర విశారదులైన శ్రీ కాశీనాథ కృత**
**జాతకలగ్న చంద్రికలో గ్రహయోగనామక ద్వితీయ పరిచ్ఛేదము**

--- oOo ---

# తృతీయ పరిచ్ఛేదము - 3
## సూర్యపురుషాకృతి చక్ర వర్ణనము

**లిఖిత్వా నరచక్రం సూర్యోయత్ర వ్యవస్థితః**
**తన్నక్షత్రాదికం కృత్వా త్రయం దద్యాచ్ఛమస్తకే** 1
**వదనే చ త్రయం దద్యాదేకైకం స్కన్ధయోర్ద్వయోః**
**బాహుద్వయే తథైకైకం పాణ్యోరేకైకమేవచ** 2
**ఋక్షాణి హృదమే పఞ్చ నాభౌ స్యాదేకమేవ హి**
**ఋక్షం గుహ్యే భవేదేక మేకైకం జానుయోర్ద్వయోః** 3
**నక్షత్రాని షడన్యాని దద్యాదఙ్ఘ్రి ద్వయే బుధః**
**సూర్య నక్షత్రతో జన్మనక్షత్రావధి గణ్యతే** 4
**పాదస్థితే చ నక్షత్రే నిర్ధనోఽల్పాయురేవచ**
**విదేశగమనం జానౌ గుహ్యే స్యాత్పరదారకః** 5
**అల్పతోషీ భవేన్నాభౌ హృదయే చేశ్వరస్తథా**
**తస్కరః పాణియుగ్మే చ బాహుస్థానే చ్యుతో భవేత్** 6
**స్కన్ధే గజస్కన్ధగామీ ముఖే మిష్టాన్నభోజనః**
**మస్తకస్థే చ నక్షత్రే పట్టబన్ధీ భవేన్నరః** 7

మనుష్యుని ఆకారములో చక్రమును నిర్మించి సూర్యుడున్న నక్షత్రమునుండి మస్తకములో మూడు నక్షత్రములు వ్రాయవలెను ముఖములో మూడు రెండు స్కంధములలో ఒక్కొక్కటి, రెండు భూజములలో ఒక్కొక్కటి, రెండు చేతులలో ఒక్కొక్కటి, హృదయములో ఐదు, నాభిలో ఒకటి, గుహ్యములో ఒకటి, రెండు మోకాళ్లలో ఒక్కొక్కటి, రెండు చరణములలో ఆరు నక్షత్రములు వ్రాయవలెను.

సూర్య నక్షత్రము నుండి జన్మనక్షత్రము వరకు లెక్కించవలెను చరణములలో జన్మనక్షత్రము వచ్చిన దరిద్రము అల్పాయువు వాడగుననిభావించవలెను మోకాళ్లలో జన్మనక్షత్రము వచ్చిన విదేశగమనము. గహ్యములో జన్మనక్షత్రము వచ్చిన పరస్త్రీ గమనము కలుగును నాభిలో వచ్చిన అల్పసంతోషి. హృదయములో వచ్చిన సమర్థుడుగును. రెండు హస్తములలో వచ్చిన దొంగయగును. భుజములలో వచ్చిన విడిపించుకొనువాడగును. స్కంధములలో వచ్చిన ఏనుగునెక్కువాడగును. ముఖములో వచ్చిన మధురమైన భోజనము చేయువాడు తలపై నక్షత్రము వచ్చిన ఉన్నత స్థితిని పొందునని భావించవలెను.

## సూర్య నరాకార చక్రము

| మస్తకము | ముఖము | స్కంధము | బాహువు | హస్తము | హృదయము | నాభి | గుహ్యము | మోకాలు | చరణము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 3 | 3 | 2 | 2 | 2 | 5 | 1 | 1 | 2 | 6 |
| ఉన్నత స్థితి | మధుర భోజనము | గజా రోహణము | చ్యుతు డగును | దొంగ యగును | సమర్థుడు | అల్ప సంతోషి | పరస్త్రీ గమనము | విదేశ గమనము | నిర్ధనుడు అల్పాయువు |

**చంద్ర పురుషాకృతి చక్రవర్ణనము :**
**జన్మరాశేశ్చ నక్షత్రాన్నక్షత్రం వర్తమానకమ్**
**గణయేద్గణకః ప్రాజ్ఞశ్చన్ద్రస్యైవ శుభాశుభమ్** **8**
**షడాస్యే పుష్టకే షడ్కం కరే షడ్కం త్రయంగుదే**
**త్రయం పాదే త్రయం కణ్ఠే దాతవ్యం గణకోత్తమైః** **9**
**ముఖే హానిశ్చ విజ్ఞేయా ధనలాభో హి పృష్ఠకే**
**హస్తే రాజభయం జ్ఞేయం రాజమానం చ గుహ్యభే** **10**
**స్థానభ్రష్టో భవేత్పాదే కన్థే సర్వసుఖం భవేత్**
**జన్మ నక్షత్ర తశ్చన్ద్ర నక్షత్రస్య ఫలం క్రమాత్** **11**

జన్మరాశి నక్షత్రము నుండి ప్రారంభించి వర్తమాన చంద్ర నక్షత్రము వరకు లెక్కించి బుద్ధిమంతుడైన జ్యోతిషుడు శుభాశుభ ఫలమును తెలుపవలెను. ఆరు నక్షత్రములు ముఖమునందు వ్రాయవలెను. ఆరు వీపుపై ఆరు హస్తముపై వ్రాయవలెను గుదము, చరణము, కంఠములందు మూడేసి నక్షత్రములు వ్రాయవలెను. ముఖమునందు వర్తమాన నక్షత్రమువచ్చిన హాని కలుగును, వీపు భాగమునందు వర్తమాన నక్షత్రము వచ్చిన లాభమును. ముఖమునందు వర్త మాన నక్షత్రము వచ్చిన హానికలుగును, వీపు భాగమునందు వచ్చిన ధనలాభము. హస్తములో వచ్చిన రాజభయము గుదముపై వచ్చిన రాజసమ్మానము చరణముపై వర్తమాన నక్షత్రము వచ్చిన స్థాన భ్రష్టము కలుగును. కంఠముపై నక్షత్రము వచ్చిన అన్ని సుఖములు కలుగును. ఈ విధముగా క్రమముగా జన్మనక్షత్రము నుండి వర్తమాన చంద్ర నక్షత్ర ఫలమును తెలిసికొనవలెను.

## చంద్ర నరాకార చక్రము

| ముఖము | పృష్ఠము | హస్తము | గుదము | చరణము | కంఠము |
|---|---|---|---|---|---|
| 6 | 6 | 6 | 3 | 3 | 3 |
| హాని | ధనలాభము | రాజభయము | రాజ సమ్మానము | స్థాన భ్రష్టము | సర్వ సుఖము |

**భౌమ పురుషాకృతిచక్రము**

**యస్మిన్నృక్షే భవేద్ భౌమస్తదాది త్రీణి మస్తకే**
**త్రయం నేత్రే త్రియం మౌలౌ చతుష్కం బాహుయుగ్మకే** 12
**కణ్ఠే ద్వే హృదయే పఞ్చ త్రయం గుహ్యే శ్రుతిః పదోః**
**ముఖేరోగో ధనం నేత్రే యశోమౌలౌ ధనంహృది** 13
**కణ్ఠేహిక్కా గతిర్గుహ్యే పాదే దేశాన్తరం వ్రజేత్**
**వామబాహౌ భవేద్రోగో దక్షిణే గణకో భవేత్** 14

కుజుదున్న నక్షత్రము నుండి మూడు నక్షత్రములు ముఖములోనుంచవలెను, నేత్రములందు మూడు, తలపై మూడు, రెండు భుజములలో నాలుగు, కంఠములో రెండు, హృదయములో ఐదు, గుహ్యములో మూడు, చరణములలో నాలుగు ఉంచవలెను ముఖములో జన్మనక్షత్రమువచ్చిన రోగము, నేత్రములలో వచ్చిన ధనము తలపై వచ్చిన కీర్తి, హృదయములో వచ్చిన ధనము కంఠములో వచ్చిన ఎక్కిళ్లువచ్చును, గుహ్యములో వచ్చిన రతిచేయుట జరుగును. చరణములపై వచ్చిన పరదేశ యాత్ర చేయును. ఎడమ భుజములపై వచ్చిన రోగము కలుగును దక్షిణభుజముపై వచ్చిన జ్యోతిషుడగును.

**భౌమ నరాకార చక్రము**

| ముఖము | నేరము | తల | వామహస్తము | దక్షిణహస్తము | కంఠము | హృదయము | గుహ్యము | చరణము |
|---|---|---|---|---|---|---|---|---|
| 3 | 3 | 3 | 2 | 2 | 2 | 5 | 3 | 4 |
| రోగము | ధన లాభము | కీర్తి | రోగి | జ్యోతిషి | ఎక్కిళ్లు | ధన లాభము | కాము కత్వము | పరదేశ గమనము |

**బుధ పురుషాకృతిచక్రము**

**బుధో యత్ర భవేదృక్షే తదాదౌ విలిఖేత్క్రమాత్**
**ముఖే జ్ఞానాయ పఞ్చ స్యుర్నేత్రే రాజ్యాయ పఞ్చ చ** 15
**పఞ్చ కణ్ఠేసుఖాయ స్యుర్ హృదిజ్ఞానాయ పఞ్చ చ**
**క్షయాయ పాదయోః పఞ్చ కరేచ జ్ఞానదం ద్వయమ్** 16
**ఏకం గుహ్యే చ నక్షత్రం క్షయం చ పరికీర్తితమ్**
**జన్మ నక్షత్ర పర్యన్తం బుధచక్రే విచారయేత్** 17

బుధుడున్న నక్షత్రము నుండి ఐదు నక్షత్రములు ముఖములో నున్న జ్ఞానమునిచ్చును. నేత్రములందు కంఠమునందు ఐదేసి నక్షత్రములున్న రాజ్యమును, సుఖమును క్రమముగానిచ్చును, హృదయములో ఐదు నక్షత్రములు జ్ఞానమునిచ్చును. చరణములందు ఐదు నక్షత్రములు నాశనమును కలిగించును హస్తములో రెండు

నక్షత్రములు జ్ఞానము నిచ్చును గుహ్యములో ఒక నక్షత్రము నాశనము కలిగించును. ఈ విధముగా బుధ నక్షత్రము నుండి జన్మనక్షత్రము వరకు బుధ చక్రవిచారము చేయవలెను.

**బుధ నరాకార చక్రము**

| ముఖము | నేత్రము | కంఠము | హృదయము | చరణము | హస్తము | గుహ్యము |
|---|---|---|---|---|---|---|
| 5 | 5 | 5 | 5 | 5 | 2 | 1 |
| జ్ఞానము | రాజ్య లాభము | సుఖము | జ్ఞానదము | నాశము | జ్ఞానదము | నాశము |

**గురుపురుషాకృతి చక్ర వర్ణనము**
**మౌలౌ చత్వారి రాజ్యం యుగపరిగణితం స్కన్ధయుగ్మే చ లక్ష్మీ**
**రేకం కణ్ఠే విభూతిర్మదన పరిమితం వక్షసిప్రీతిలాభః**
**షడ్భిః పీడాఙ్ఘ్రి యుగ్మే జలధిపరిమితం వామహస్తే చమృత్యు**
**ర్దృగ్యుగ్మే త్రాణి దద్యుర్నృపతి సమసుఖంవాక్పతేశ్చ క్రమేతత్** **18**

గురువున్న నక్షత్రము నుండి మొదలుకొని మస్తకముపై నాలుగు నక్షత్రములు రాజ్యమునిచ్చును. తర్వాత నాలుగు నక్షత్రములు రెండు స్కంధములలో లక్ష్మీప్రాప్తిని కలిగించును. కంఠములో ఒక నక్షత్రము ఐశ్వర్యము నిచ్చును హృదయములో ఐదు నక్షత్రములు ప్రీతిని కలిగించును రెండు చరణములలో ఆరు నక్షత్రములు పీడను కలిగించును. నాలుగు నక్షత్రములు ఎడమ హస్తములో మృత్యువును కలిగించును రెండు నేత్రములలో మూడు నక్షత్రములు రాజసమానముగా సుఖమును కలిగించును.

**గురు నరాకార చక్రము**

| మస్తకము | స్కంధము | కంఠము | హృదయము | చరణము | మామహస్తము | నేత్రము |
|---|---|---|---|---|---|---|
| 4 | 4 | 1 | 5 | 6 | 4 | 3 |
| రాజ్యము | లక్ష్మీ లాభము | ఐశ్వర్యము | ప్రీతి | పీడ | మృత్యువు | రాజ్య సుఖము |

**గురు పురుషాకృతి చక్ర వర్ణనము**
**మౌలౌ పఞ్చద్వయం వక్త్రే చతుష్కం హృదయే స్వభాత్**
**సప్త బాహ్వోస్త్రయం గుహ్యే జాన్వోర్ద్వే జలధిః పదే** **19**
**సుఖం హృదితథా మౌలౌ గుహ్యే చ మరణం ధ్రువమ్**
**ముఖే సుభోజనం బాహ్వోర్మృత్యుర్జాన్వోః పదేతథా** **20**

శక్ర నక్షత్రము నుండి ఐదు నక్షత్రములు మస్తకములో, రెండు ముఖములో నాలుగు హృదయములో, ఏడు భుజములలో, మూడు గుహ్యములో రెండు మోకాళ్లలో నాలుగు చరణములలో నుంచవలెను హృదయము, మస్తకములలో జన్మ నక్షత్రము వచ్చిన సుఖము, గుహ్యములో వచ్చిన నిశ్చయముగా మరణము, ముఖములో వచ్చిన సుందర భోజనము కలుగును భుజములు మోకాళ్లు చరణములలో జన్మనక్షత్రము వచ్చిన మరణము కలగును.

**శుక్ర నరాకార చక్రము**

| మస్తకము | స్కంధము | హృదయము | బాహువు | గుహ్యము | మోకాలు | చరణము |
|---|---|---|---|---|---|---|
| 5 | 2 | 4 | 7 | 3 | 2 | 4 |
| సుఖము | సుందర భోజనము | సుఖము | మరణము | మరణము | మరణము | మరణము |

**శనిపురుషాకృతి చక్రవర్ణనము**

**యస్మిఞ్ఛనైశ్చరపి వక్రగతం తదృక్షం**
**చత్వారి దక్షిణకరేఽ ఙ్ఘ్రియుగే చ షడ్కమ్**
**చత్వారి వామకరణే హృదయే చ పఞ్చ**
**మూర్ధ్ని త్రియం నయనయోర్ద్విత్రయం చ గుదే చ** **21**
**ముఖస్థితే భానుసుతేఽ తిపీడా**
**లక్ష్మీర్యశో దక్షిణహస్తసంస్థే**
**పాదద్వయే నిష్ఫలతా చ వామే**
**కరేచ యుద్ధే తనుసంశయశ్చ** **22**
**హృద్యర్థో మస్తకే రాజ్యం నేత్రయోః పరమంసుఖమ్**
**గుదే చ ప్రాణసన్దేహః శనిచక్రే వినిర్దిశేత్** **23**
**ముఖాచ్చరతి గుహ్యే చ గుహ్యాదాయాతిమస్తకే**
**మస్తకాల్లోచనే యాతి లోచనాద్ధృదయంవ్రజేత్** **24**
**హృదయాద్వామహస్తం చ వామహస్తా తత్పదద్వయమ్**
**పాదాచ్చ దక్షిణం హస్తం శనిచారోఽ యముచ్యతే** **25**

శనియున్న నక్షత్రము ముఖములో, నాలుగు దక్షిణ హస్తములో, ఆరు రెండు చరణములలో, నాలుగు వామహస్తములో, ఐదు హృదయములో, మూడు మస్తకములో, రెండు నేత్రములలో, మూడు నక్షత్రములు గుదములో క్రమముగానుంచవలెను ముఖములో శనీశ్వరుడున్న పీడ, దక్షిణ హస్తములోనున్న లక్ష్మీయశము కలుగును చరణములలోనున్న నిష్ఫలము, వామహాస్తములోనున్న

యుద్ధభయము, హృదయములోనున్న ధనాగమము, మస్తకములోనున్న రాజ్యప్రాప్తి, నేత్రములలోనున్న పరమసుఖము, గుదములో శనీశ్వరుడున్న ప్రాణసందేహము కలుగును ముఖము నుండి గుహ్యములోనికి వెళ్ళును గుహ్యము నుండి మస్తకమునకు వచ్చును మస్తకము నుండి నేత్రములోనికి నేత్రముల నుండి హృదయములోనికి, హృదయము నుండి వామహస్తమునకు, వామహస్తము నుండి రెండు పాదములకు, పాదముల నుండి దక్షిణ హస్తమునకు వెళ్ళును ఇది శనిచారమని తెలుపబడెను.

**శని నరాకార చక్రము**

| ముఖము | దక్షిణ హస్తము | రెండు చరణములు | వామ హస్తము | హృదయము | మస్తకము | నేత్రము | నుదము |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 4 | 6 | 4 | 5 | 3 | 2 | 3 |
| అతిపీడ | లక్ష్మీయశము | నిష్ఫలము | యుద్ధ భయము | ధనాగమము | రాజ్యప్రాప్తి | పరమ సుఖము | ప్రాణ సందేహము |

**రాహు పురుషాకృతి చక్రవర్గము**

**యస్మిన్నృక్షే భవేద్రాహుస్తదాదౌ సప్తపాదయోః**
**దక్షిణే చ భుజే పఞ్చ శిరసి త్రీణిదాపయేత్ 26**
**నక్షత్రే ద్వేహృది న్యస్య ముఖే చైకం నియోజయేత్**
**పఞ్చవామకరే దద్యాన్నాభౌ చైకం నియోజయేత్ 27**
**గుహ్యస్థానే త్రయం దద్యద్రాహు చక్రమిదం స్మృతమ్**
**పాదయోధనహానిః స్యాత్సన్తాపో దక్షిణే కరే 28**
**మస్తకే చ భయం శత్రోర్హృదయే దుర్జనప్రియః**
**ముఖే దుర్జన సంహారో మృత్యుర్వామకరే భవేత్ 29**
**నాభిస్థం సర్వనాశాయ గుహ్యే ప్రాణవినాశనమ్ 30**

రాహువున్న నక్షత్రము మొదలుకొని ఏడు నక్షత్రములు చరణములో, ఐదు నక్షత్రములు దక్షిణ భుజములో మూడు శిరస్సులో, రెండు హృదయములో ఒకటి ముఖములో, ఐదు ఎడమ హస్తములో, నాభిలో ఒకటి, గుహ్యస్థానములో మూడు నక్షత్రములుంచి రాహు చక్రము నిర్మించవలెను. చరణములలోనున్న ధన హాని, దక్షిణ హస్తమైన సంతాపము మస్తకమైన శత్రుభయము హృదయమైన దుర్జన ప్రియత్వము, ముఖమైన దుర్జననాశము, ఎడమ హస్తములో నైనమృత్యువు నాభిలోనున్న సర్వనాశము, గుహ్యములోనున్న ప్రాణనాశము కలగును.

**రాహు నరాకార చక్రము**

| చరణములు | దహస్తము | శిరస్సు | హృదయము | ముఖము | వాహస్తము | నాభి | గుహ్యము |
|---|---|---|---|---|---|---|---|
| 7 | 5 | 3 | 2 | 1 | 5 | 1 | 3 |
| ధనహాని | సంతాపము | శత్రు భయము | దుర్జన ప్రియము | దుర్జన సంహారము | మృత్యువు | సర్వనాశము | ప్రాణనాశము |

**కేతు పురుషాకృతి చక్రవర్గణము**

**యస్మిన్నృక్షే భవేత్కేతుస్తదాదౌ తు ఫలం వదేత్**
**నేత్రేద్వే రోగశోకాయ ముఖేలాభాయపఞ్చచ** **31**
**రాజ్యప్రదం త్రయం మౌలౌ నక్షత్రం పరికీర్తితమ్**
**వామహస్తే చతుష్కం చ భయరోగకరం సదా**
**ఏకంనాభౌ చ నాశాయ గుహ్యేద్వే మృత్యుకారకే** **33**
**ఋక్షాణిపాదయోః షడ్కం బన్ధునాశకరాణి చ**
**కేతు చక్రస్య మాహాత్మ్యం దేహస్థం జ్ఞాయతే బుధైః** **34**

కేతువున్న నక్షత్రము మొదలుకొని మొదటి రెండు నక్షత్రములు నేత్రములలో నుండును శోకమును కలిగించును. ముఖములో ఐదు లాభమును కలిగించును మస్తకములో మూడు రాజ్యము నిచ్చును. దక్షిణ హస్తములో నాలుగు యశస్సును కలిగించును వామహస్తములో నాలుగు సదాభయము రోగమును కలిగించును నాభిలో ఒకటి గుహ్యములో రెండు నక్షత్రములు నాశనమును కలిగించును చరణములలో ఆరు నక్షత్రములు బంధునాశనమును కలిగించును ఈ విధముగా కేతుచక్రములోని మహాత్మ్యమును పండితుల ద్వారా తెలిసికొనవలెను.

**కేతు నరాకార చక్రము**

| నేత్రము | ముఖము | మస్తకము | దహస్తము | వా. హస్తము | నాభి | గుహ్యము | చరణము |
|---|---|---|---|---|---|---|---|
| 2 | 5 | 3 | 4 | 4 | 1 | 2 | 6 |
| రోగము శోకము | లాభము | రాజ్యము | యశము | భయము రోగము | నాశము | మృత్యువు నాశము | బంధు నాశము |

**స్త్రీల కొరకు సూర్య డిండాఖ్య చక్ర వర్ణనము**

**మౌలౌత్రయం ముఖే సప్త స్తనయోరష్టభానిచ**
**హృది త్రయం త్రయం నాభౌత్రయం గుహ్యే చ విన్యసేత్** **35**
**మౌలౌ సన్తాప కృత్సూర్యో ముఖే మిష్టాన్నదో భవేత్**
**స్తనయోః కామదః ప్రోక్తో హృదయే సుఖదఃస్త్రియః** **36**

**నాభౌ పతిసుఖం దత్తే గుహ్యేకామప్రదః సదా**
**సూర్యడిమ్భాఖ్యచక్రం తు స్త్రీణాం ప్రోక్తం విశేషతః** 37

సూర్య నక్షత్రము మొదలుకొని మస్తకములో మూడు, ముఖములో ఏడు స్తనములలో ఎనిమిది, హృదయములో మూడు, నాభి గుహ్యాములలో మూడేసి చొప్పున ఉంచవలెను. మస్తకములో జన్మనక్షత్రము వచ్చిన సంతాపము, ముఖము వచ్చిన మిష్టాన్నము స్తనములలో వచ్చిన కామప్రదము, హృదయములో వచ్చిన సుఖము, నాభిలో వచ్చిన పతిసుఖము, గుహ్యాములో వచ్చిన సర్వదా కామప్రదమగును. విధముగా సూర్యడింబాఖ్య చక్రము విశేషించి స్త్రీల కొరకు తెలుపబడినది.

**స్త్రీలకొరకు సూర్యబింభాఖ్య చక్రము**

| మస్తకము | ముఖము | స్తనము | హృదయము | నాభి | గుహ్యాము |
|---|---|---|---|---|---|
| 3 | 7 | 8 | 3 | 3 | 2 |
| సంతాపము | మిష్ఠాన్నము | కామదము | సుఖప్రదము | పతిసుఖము | కామప్రదము |

**సూర్య కాలానల చక్రవర్ణనము**

**ఊర్ధ్వాస్త్రిస్ర స్త్రిశూలాశ్రే రేఖాస్త్రిస్రస్తిరః స్తితాః**
**ద్వేద్వే రేఖే కోణయోశ్చ శృజ్గయుగ్మం తథైకథా** 38
**మధ్య త్రిశూల దణ్డాధో భాను నక్షత్రమాలిఖేత్**
**అన్యాన్యభిజితా సార్థం లిఖేదజ్కః సమస్తకే** 39
**అధాస్థితైస్త్రి నక్షత్రైరుద్వేగ భయబన్ధనమ్**
**రేఖాష్టకే భవేల్లాభో ఋక్షషట్కే తథా పునః** 40
**శృజ్గద్వయే రోగభజ్గో మృత్యుం శూలత్రయే స్ఫుటమ్**
**వివాదే విగ్రహే యుద్ధే రోగార్తే దమనే తథా** 41
**సూర్య కాలానలం చక్రం కథితం గణకోత్తమైః** 42

సూర్యకాలానల చక్రములో మూడు నిలువు, అడ్డ రేఖలు గీయువలెను పైన ఉన్న నిలువు శిరస్సుపై త్రిశూలములను గీయవలెను కోణములలో రెండు రేఖలు శృంగములలో ఒక్కొక్క రేఖ గీయవలెను త్రిశూల మధ్య దండమునకు క్రింది భాగములో సూర్య నక్షత్రమును లభించవలెను. అభిజిత్ సహితముగా అన్ని నక్షత్రములు క్రమముగా రేఖలపై భాగములో లిఖించవలెను క్రింద నున్న మూడు నక్షత్రముల వలన ఉద్వేగము భయము బంధనము కలుగును తర్వాతి నాలుగు కోణములలోనున్న ఎనిమిది రేఖల వలన లాభము, ఆరు పెద్ద రేఖల వలన లాభము, రెండు శృంగములలోనున్న రేఖలవలన రోగభంగము, మూలనున్న మూడు రేఖల వలన మృత్యువు కలుగును. ఉత్తమ జ్యోతిష పండితుల ద్వారా సూర్య కాలనలచక్రము

ద్వారా వివాదము విగ్రహము, యుద్ధము, రోగమువలన కష్టము యాత్ర విషయములను తెలిసికొనవలెను.




క్రిందనున్న మూడు నక్షత్రములు - 1, 2, 28

నాలుగు కోణములలో ఎనిమిది రేఖలు - 3, 4, 8, 10, 20, 22, 26, 27

ఆరు పెద్ద రేఖలు - 5, 6, 7, 23, 24, 25

శృంగములలో రెండు రేఖలు - 9, 21

త్రిశూలాగ్ర రేఖలు - 11, 12, 13, 14, 15, 16, 17, 18, 19

అశ్విని నుండి రేవతి వరకు అభిజిత్తును కలుపుకొని 28 నక్షత్రములు భావించి ఫలితమును గ్రహించవలెను.

**జన్మరాశి వేధఫలము**

**రవేర్వేధే మనస్తాపో ద్రవ్యహానిర్ధరాసుతే**
**రోగపీడాకరో మన్దో రాహుకేతూ చ మృత్యుదౌ** **43**
**గురోర్వేధే భవేల్లాభో రతిలాభశ్చ భార్గవే**
**స్త్రీలాభశ్చన్ద్రవేధే చ సుఖం చ బుధవేధతః**
**జన్మరాశేశ్చ వేధేన ఫలమే తత్ప్రకీర్తితమ్** **44**



పైనున్న త్రిశూల మధ్యములో చంద్రనక్షత్రమును లిఖించవలెను తర్వాత క్రమముగా అభిజిత్తు సహితముగా నక్షత్రములను లిఖించవలెను త్రిశూలములో పడిన నక్షత్రములు వేధ నక్షత్రములుగా గుర్తించవలెను జన్మనక్షత్రమునకు వేధ కలిగిన జన్మదిన వేధగా భావించవలెను.

సూర్య నక్షత్రమును వేధ కలిగిన సంతాపము కుజ నక్షత్రమునకు వేధ కలిగిన ద్రవ్యహాని. శని నక్షత్రమునకు వేధ కలిగిన పీడ, రాహు, కేతు నక్షత్రములకు వేధ కలిగిన మృత్యువు గురు నక్షత్రమునకు వేధ కలిగిన లాభము. శుక్ర నక్షత్రమునకు వేధ కలిగిన రతి లాభము, చంద్ర నక్షత్రమునకు వేధ కలిన స్త్రీ లాభము బుధ నక్షత్రమునకు వేధ కలిగిన సుఖము కలుగును. జన్మనక్షత్రమునసరించి ఈ వేధ ఫలము తెలుపబడెను.

**దుర్గచక్రవర్ణనము**

**దుర్గాకారం లిఖేచ్చక్రమష్టకోణసమన్వితమ్**
**ఈశానే గ్రామనక్షత్రం దత్వాచాభిజితా సహ** **45**
**చతుష్కం చ చతుష్కం చ కోణేషు సకలేషుచ**
**మధ్యే మధ్యే సగ్రహం చ దద్యాద్విజ్ఞస్త్రయం త్రయమ్** **46**
**దుర్గమధ్యే స్థితే సూర్యే జలశోషః ప్రజాయతే**
**చన్ద్రే భఙ్గః కుజే దాహో బుధే బుద్ధియుతోనృపః** **47**
**బృహస్పతౌ దుర్గమధ్యే సుభిక్షం ప్రచురం భవేత్**
**చలచిత్తో నృపః శుక్రే భేదభఙ్గః శనైశ్చరే** **48**
**రాహుకేతూ దుర్గమధ్యే విషదగ్ధో భవేన్నృపః**
**సూర్యశ్చ సూర్యపుత్రశ్చ రాహుకేతూ చ మఙ్గలః** **49**
**ఏతే చేద్ దుర్గమధ్యే స్యుర్దుర్గభఙ్గోఽపి జాయతే**
**గురుః శుక్రో బుధశ్చన్ద్రో దుర్గమధ్యే యదా స్థితాః** **50**
**తదా దుర్గో న భజ్యేత మహేన్ద్రేణాపి తాడితః**

ఎనిమిది కోణముల దుర్గాకార చక్రమును లిఖించవలెను. ఈశాన్యకోణములో గ్రామనక్షత్రమును వ్రాయవలెను. తర్వాత క్రమముగా అభిజిత్తు నక్షత్రముతో కూడిన అన్ని నక్షత్రములను వ్రాయవలెను మధ్యలో గ్రహములను వ్రాయవలెను. నాలుగేసి నక్షత్రములు కోణములో వాటి మధ్యలో మూడేసి నక్షత్రములు వ్రాయవలెను మిగిలినవి దుర్గ మధ్యములో వ్రాయవలెను.

దుర్గ మధ్యములో సూర్యుడు వచ్చిన జలశోషము (ఇంకిపోవుట) చంద్రుడున్న భంగము, కుజుడున్న దాహము, బుధుడున్న రాజు బుద్ధియుతము, గురుడున్న

సుభిక్షితము, శుక్రుడున్న రాజుకు చిత్త చాంచల్యము, శనియున్న భేదభంగమగును, రాహు, కేతువులు దుర్గములోనున్న రాజు విషముతో మరణించును. రవి, శని, రాహు కేతువులు కుజుడు దుర్గ మధ్యములోనున్న దుర్గభంగమగును. గురు, శుక్ర, బుధ, చంద్రులు దుర్గ మధ్యములోనున్న ఇంద్రుని వలన కూడ దుర్గమునకు నష్టము కలుగదు.

**గ్రహముల మధ్యచారము**

**మాసం శుక్రబుధాదిత్యాః సపాద ద్విదినం శశీ**
**భౌమస్త్రిపక్షం జీవోఽబ్దం సార్ధవర్షద్వయం శనిః**
**రాహు కేతుః సదా భుఙ్క్తే సార్ధమేకం చ వత్సరమ్ 51**

శుక్రుడు, బుధుడు, సూర్యుడు ఈ మూడు గ్రహములు ఒక రాశిలో ఒక నెల రోజులుండును, చంద్రుడు ఒకరాశిలో రెండుంబావురోజులుండును. కుజుడు మూడు పక్షములు, గురుడు ఒక సంవత్సరము శని రెండున్నర సంవత్సరములు ఒక రాశిలోనుండును. రాహు కేతువులు ఒకటిన్నర సంవత్సరములుండును.

**జన్మకాల జ్ఞానము**

**న పశ్యతి శశీలగ్నం లగ్నస్వామీ న పశ్యతి**
**న పశ్యతి యదా సూర్యః సోఽన్య జాతస్తదోచ్యతే 52**

చంద్రుడు లగ్నమును చూడకున్న, లగ్నస్వామి సూర్యుడు లగ్నమును చూడకున్న బాలకుడు అన్యవ్యక్తి వలన పుట్టిన వాడుగా భావించవలెను.

**సుతపతిరస్తగతో వా పాపయుతః పాపమధ్యగో వా స్యాత్**
**సన్తతిబాధాం కురుతే కేన్ద్రేవా పాపసంయుతే చన్ద్రే 53**

పంచమ రాశి స్వామి అస్తమయుడైన లేక పాపగ్రహములతో కూడిన, లేక పాపగ్రహముల మధ్యనున్న కేంద్రములో పాపగ్రహములతో కూడి చంద్రుడున్న సంతతికి బాధకలగును.

**ఉదయాద్యా గతా నాడ్యస్తాసామర్ధేన సఙ్ఖ్యయా**
**సూర్యర్క్షాద్యద్ భవేదృక్షం తేన లగ్నస్య నిర్ణయః 54**

సూర్యోదయము నుండి గతించిన నాడులను సగము సంఖ్యతో లేక సూర్య నక్షత్రముతో గణించిన వచ్చు వర్తమాన నక్షత్రముతో లగ్ననిర్ణయము చేయువలెను అనగా సూర్యోదయమైన తర్వాత గతించిన నాడులలో సగమును సూర్య నక్షత్రముతో జోడించి లగ్న నిర్ణయము చేయవలెను.

**శయ్యాశిరో లగ్నరాశేర్ద్రవ్యం గేహం బలాధికాత్**
**చన్ద్రలగ్నాన్తరాలస్థై గ్రహైస్తుల్యాశ్చ సూతికాః 55**

జన్మసమయమున శయ్యాశిరమును లగ్నరాశితో, ద్రవ్యము మరియు గృహ బలముతో తెలిసికొనవలెను. చంద్రుడు లగ్నముల మధ్యలోనున్న గ్రహముల సంఖ్యతో సమానముగా సూతికా గృహములో స్త్రీలుందురని తెలిసికొనవలెను.

**భాగే సింహే వృషేలగ్నే జాయతే నాలవేష్టితః**
**వామ భాగే చ నారీణాం పురుషాణాం చ దక్షిణే** **56**

మేష, సింహ, వృషభ లగ్నములలో బాలకుడుత్పన్నమైన బాలుడు నాలముతో చుట్టుకొనబడి పుట్టును. ఆ నాలము స్త్రీలకైన ఎడమ భాగములో పురుషులకైన కూడిభాగముగా తెలిసికొనవలెను.

**లగ్నే తదీశపార్శ్వే వా యావన్తశ్చ ఖయాయినః**
**ధనగా వ్యయగాశ్చైవ తావత్యః సూతికాః స్మృతాః** **57**

లగ్నములో లేక లగ్నస్వామి సమీపములో ఎన్ని గ్రహములున్నవో లేక రెండవ పన్నెండవ గృహములలో ఎన్ని గ్రహములున్నవో, అంత మంది స్త్రీలు సూతికా గృహమునకు దగ్గరగానుందురని తెలుపబడెను.

**చరకేన్ద్రస్థితైః ఖేటైరభావే జన్మలగ్నతః**
**కేన్ద్రస్థానేష్వనేకేషు బలాధిక్యాద్వదేద్బుధః** **58**

చరరాశి కేంద్ర స్థానములలో నున్న గ్రహములతో, జన్మలగ్నముతో బుద్ధిమంతుడు ఫలితమును తెలుపవలెను. కేంద్రములో ఎక్కువ గ్రహములున్న వాటిలో బలమైన గ్రహముననుసరించి పండితులు ఫలితమును తెలుపవలెను.

**లగ్న త్రిభాగైర్వైర్త్రిశ్చ క్రమాదిత్యాస్థిరాగతా**
**చన్ద్రరాశి త్రిభాగైశ్చ స్నేహపూర్ణాస్థిరోగతః** **59**

లగ్నము నుండి త్రిభాగక్రమములో వత్తిని తెలుపవలెను. చంద్రరాశి త్రిభాగముతో తైలమును తెలుపవలెను.

**చరాద్యర్కం వదేద్దీపో రవ్యాద్యైర్బలిభిర్గ్రహైః**
**అదృఢం నూతనం దగ్ధం చిత్రం బద్ధం శుభరజేత్** **60**

చరాదిరాశులను సూర్యుని నుండి, గ్రహముల బలమున్న దీపమును తెలుపవలెను. పాతది, బలహీనమైనది, కొత్తది, కాలినది చిత్ర విచిత్రమైనది బద్ధమైనదైనవస్త్రమును తెలుపవలెను.

**దిశలస్వాములు**

**సూర్యశుక్రౌ భౌమరాహుం శనిచన్ద్రౌ బుధేగురుః**
**పూర్వాదీనాం క్రమాదేతే దిశాం నాథాః ప్రకీర్తితాః** **61**

సూర్యుడు, శుక్రుడు, కుజుడు, రాహువు, శని, చంద్రుడు, బుధుడు, గురుడు వీరు క్రమముగా ఎనిమిది దిశలకు నాథులని తెలిసికొనవలెను.

| దిశ | స్వామి | దిశ | స్వామి |
|---|---|---|---|
| పూర్వము | సూర్యుడు | పశ్చిమము | శని |
| ఆగ్నేయము | శుక్రుడు | వాయువుము | చంద్రుడు |
| దక్షిణము | కుజుడు | ఉత్తరము | బుధుడు |
| నైరృతి | రాహువు | ఈశాన్యము | గురుడు |

**అష్టోత్తరీ దశావిచారము**

**దశలకు వర్షములు**

**షడాదిత్యే చ వర్షాణి చన్ద్రే పఞ్చదశైవ తు**
**మఙ్గలే చాష్టవర్షాణి బుధే సప్తదశైవ తు** **62**
**శనౌ చ దశవర్షాణి జీవే చైకోనవింశతిః**
**రాహౌ ద్వాదశ వర్షాణి భార్గవే చైకవింశతి** **63**

అష్టోత్తరీయ దశలో సూర్యునికి ఆరు సంవత్సరములు, చంద్రునికి పదిహేను సంవత్సరములు, కుజునికి ఎనిమిది సంవత్సరములు, బుధునికి పదిహేడు సంవత్సరములు, శనికి పది సంవత్సరములు, గురువుకు పందొమ్మిది సంవత్సరములు రాహువుకి పన్నెండు సంవత్సరములు శుక్రునికి ఇరువది ఒక్క సంవత్సరములుండును.

**ఆయుజ్ఞానము**

**జన్మర్క్ష గతనాడిఘ్నం పరాయుః ఖగజైర్భజేత్**
**లబ్ధం పరాయుషు శోధ్యం శేషమాయుః స్ఫుటం భవేత్** **64**

జన్మనక్షత్రములో గడిచిన నాడులతో పరమాయువును (108 సం॥లు) గుణించి 80 చే భాగించిన వచ్చు లబ్ధము పరమాయువులో నుండి తీసివేసిన వచ్చుశేషము స్పష్టాయువగును.

**పరమాయుః ప్రమాణేన గుణయేద్గతనాడికాః**
**నక్షత్రస్య హరేద్భాగం నవత్యాప్తం విశోధయేత్** **65**

పరమాయువును (108) గడిచిన గడియలతో గుణించి, 27 (నక్షత్రములు)తో భాగించి వచ్చిన దానిని 90లో నుండి తగ్గించవలెను.

**గ్రహదశల నక్షత్రములు**

**చత్వారి భాని పాపేషు శుభేషు త్రీణి యోజయేత్**
**ఆర్ద్రాది మృగపర్యన్తం లిఖేదభిజితా సహ** **66**

ఆర్ద్ర నుండి ప్రారంభించి మృగశిర వరకు అభిజిత్తుతో కూడి అన్ని నక్షత్రములు లిఖించవలెను. పాపగ్రహములతో నాలుగు నక్షత్రములు శుభగ్రహములతో మూడు నక్షత్రములను కలుపవలెను.

**ఆర్ద్రా చతుష్క మాదిత్యే చన్ద్రే జ్ఞేయం మఘాత్రయమ్**
**భౌమే హస్త చతుష్కం స్యాదనురాధాత్రికం బుధే** **67**
**పూషా చతుష్కం మన్దే చ ధనిష్ఠాత్రితయం గురౌ**
**రాహౌ చోత్తరచత్వారి కృత్తికాత్రితయం భృగౌ** **68**

ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి ఆశ్లేష నక్షత్రములలో జన్మించిన సూర్యదశలో జన్మించినట్లుగా భావించవలెను. మఘ, పుబ్బ, ఉత్తర ఈ మూడు నక్షత్రములలో జన్మించిన చంద్రదశలో, హస్త, చిత్త, స్వాతి, విశాఖ ఈ నాలుగు నక్షత్రములలో జన్మించిన కుజ దశలో, అనురాధ జ్యేష్ఠ, మూల – ఈ మూడు నక్షత్రములలో జన్మించిన బుధ దశలో, పుర్వాషాఢ ఉత్తారాషాఢ, అభిజిత్తు, శ్రవణములలో జన్మించిన శనిదశలో, ధనిష్ఠ శతభిష పూర్వాభాద్రలలో జన్మించిన గురుదశలో, ఉత్తరా భాద్ర, రేవతి, అశ్విని, భరణి నక్షత్రములలో జన్మించిన రాహు దశలో, కృత్తిక, రోహిణి, మృగశిరలలో జన్మించిన శుక్రదశలో జన్మించినట్లు భావించవలెను.

## అష్టోత్తరీదశా చక్రము

| దశలు | రవి | చంద్రుడు | కుజుడు | బుధుడు | శని | గురుడు | రాహువు | శుక్రుడు |
|---|---|---|---|---|---|---|---|---|
| వర్షములు | 6 | 15 | 8 | 17 | 10 | 19 | 12 | 21 |
| నక్షత్రము | ఆర్ద్ర<br>పునర్వసు<br>పుష్యమి<br>ఆశేష | మాఘ<br>పుబ్బ<br>ఉత్తర | హస్త<br>చిత్త<br>స్వాతి<br>విశాఖ | అనురాధ<br>జ్యేష్ఠ<br>మూల | పూషాడ<br>ఉషాఢ<br>అభిజిత్<br>శ్రమాం | ధనిష్ఠ<br>శతభిష<br>పూ.భా | ఉ భా<br>రేవతి<br>అశ్విని<br>భరణి | కృత్తిక<br>రోహిణి<br>మృగశిర |

**అంతర్దశా విచారము**

**దశాదశాహతా కార్యాభాగో నన్దైర్విధీయతే**
**అన్తర్దశేయం తస్యైవ ప్రథమం జ్ఞాయతే దశా** **69**

దశావర్షములను దశావర్షములతో గుణించవలెను వచ్చిన గుణనఫలమును 9 తో భాగించవలెను వచ్చిన లబ్ధమును మాసములుగా భావించవలెను.

ఉదాహరము – సూర్యమహాదశలో శని అంతర్దశానెల గురించి తెలిసికొనవలెనున్న

రవిదశ - 6 వర్షములు, శనిదశ-10 వర్షములు రెండింటిని గుణించిన 60 వచ్చును దానిని 9చే భాగించిన 6 నెలల 20 దినములు వచ్చును ఇవి సూర్యమహాదశలో శని అంతర్దశా దినములుగా భావించవలెను.

**సూర్యస్య దశా సూర్యన్తే దశాయాః పరిగణ్యతే**
**నవభిర్భాగే చ యల్లబ్ధం తత్తు మాసచతుష్టయమ్ 70**

సూర్య మహాదశలో సూర్య అంతర్దశను గణించిన 6×6=36.9 చే భాగించిన నాలుగు నెలలు వచ్చును.

**సూర్యమహాదశ (6 వర్షములు)**

**ఉద్విఘ్నచిత్తః స్వజనస్యపీడా**
**శరీరరోగీ స్వజనైర్వియోగీ**
**నిపీడితో రాజజనైః ప్రవాసీ**
**నరోఽశ్వఘాతీ చ రవేర్దశాయామ్ 71**

సూర్యమహా దశలో మనసు వ్యాకులతతోనుండుట, స్వజనులచే పీడ శరీరములో రోగము భార్యావియోగము. రాజ సేవకుల వలన పీడ పరదేశ గమనము గుర్రములను హత్యచేయు పనిచేయుట జరుగును.

**సూర్యుని అంతర్దశ (4 నెలలు)**

**సూర్యస్యాన్తర్గతే సూర్యే లాభో రాజకులోద్భవః**
**చిత్తపీడా వ్యయోఽర్థానాం విప్రయోగశ్చ బన్ధుభిః 72**

సూర్యమహాదశలో సూర్య అంతర్దశ జరిగినపుడు రాజకులము వలన లాభము మానసికపీడ, ద్రవ్యము అధికముగా వ్యయమగుట. సోదరులవలన వియోగము కలుగును.

**చంద్రాంతర్దశ (10 నెలలు)**

**శత్రునాశోఽర్థలాభశ్చ చిన్తానాశః సుఖాగమః**
**సూర్యస్యాన్తర్గతే చన్ద్రే వ్యాధినాశశ్చజాయతే 73**

సూర్యుని మహాదశలో చంద్రుని అంతర్దశ జరుగునపుడు శత్రునాశము ద్రవ్యలాభము, చింతానాశము, సుఖాగమము, వ్యాధి నాశము కలుగును.

**కుజాంతర్దశ (5 నెలల 10 రోజులు)**

**మణిర్ముక్తాకాఞ్చనాని జయో యుద్ధ సుఖం తథా**
**ప్రాప్యతే భూపతేర్మానః సూర్యస్యాన్తర్గతే కుజే 74**

సూర్య మహాదశలో కుజ అంతర్దశ జరుగునపుడు మణులు, ముత్యములు, బంగారము లభించుట యుద్ధములో విజయము సుఖము రాజసమ్మానము కలుగును.

**బుధాంతర్దశ (11 నెలల 10 దినములు)**

**విలాసం సుఖదారిద్ర్యే జాయతే రోగసమ్భవః**
**పామా విచర్చికాదీని సూర్యస్యాన్తర్గతే బుధే** **75**

రవి మహాదశలో బుధుని అంతర్దశ జరుగునపుడు విలాసము, సుఖము, దరిద్రము, రోగోత్పత్తి, దురద గజ్జి మున్నగు రోగములు కలుగును.

**శనిఅంతర్దశ (6 నెలల 20 దినములు)**

**రాజభీతిః శత్రుభీతిః కలహో దుఃఖమేవ చ**
**జాయతే ధననాశశ్చ సూర్యస్యాన్తర్గతే శనౌ** **76**

సూర్య మహాదశలో శని అంతర్దశ జరుగునపుడు రాజుకు శత్రు భయము యుద్ధము, దుఃఖము ధన నాశము కలుగును.

**గురు అంతర్దశ (12 నెలల 20 దినములు)**

**నిష్పాపో వ్యసనైర్హీనో నీరోగీ ధనవానపి**
**ప్రాప్నోతి పదవీ గుర్వీం సూర్యస్యాన్తర్గతే గురౌ** **77**

సూర్య మహాదశలో గురు అంతర్దశ జరుగునపుడు పాపహీనుడు, వ్యసనరహితుడు ధనవంతుడై ఉన్న పదవిని పొందును.

**రాహు అంతర్దశ (8 నెలలు)**

**వ్యసనం విత్తనాశశ్చ శఙ్కాచాథ పరాజయః**
**సూర్యస్యాన్తర్గతే రాహౌ ద్యూతం బన్ధుజనైః కలిః** **78**

రవి మహాదశలో రాహు అంతర్దశ జరుగునపుడు వ్యసనము, ద్రవ్యనాశము శంక, పరాజయము జ్యూదము, సోదరులతో కలహము కలుగును.

**శుక్ర అంతర్దశ (14 నెలలు)**

**జ్వరరోగః శిరోరోగో నా నాపీడా కలేవరే**
**క్యాపి బన్ధుజనైః క్లేశం సూర్యస్యాన్తర్గతే సితే** **79**

సూర్య మహాదశలో శుక్రాంతర్దశ జరుగునపుడు జ్వరము, శిరోరోగము, అనేక విధములైన శారీరిక పీడలు కలుగును అప్పుడప్పుడు బంధుజనుల వలన కష్టము కలుగును.

**చంద్ర మహాదశ (15 వర్షములు)**

**రాజాశ్వరత్నాని మహాప్రతాపో**
**మిష్టాన్నపానం వివిధం సుఖం చ**
**అరోగితా సర్వజనానురాగో**
**భవేద్దశాయాం శశినో నరస్య** **80**

చంద్ర మహాదశలో ఏనుగులు, గుఱ్ఱములు రత్నములు, మహాప్రతాపము, మిష్టాన్నభోజనము, అనేక విధములైన సుఖము, ఆరోగ్యము, అందరి వలన ప్రేమ కలుగును.

**చంద్రాంతర్దశ (25 నెలలు)**

**శోభన స్త్రీ సమాయోగో వస్త్రాభరణసమ్పదః**
**శుభ కన్యాసముత్పత్తిశ్చన్ద్రే చన్ద్రాన్తరే గతే** **81**

చంద్రమహాదశలో చంద్రాంతర్దశ జరుగునపుడు సుందరమైన స్త్రీతో సంయోగము, వస్త్రములు, ఆ భూషణములు సంపదప్రాప్తించును. సుందరమైన కన్యలు జన్మింతురు.

**కుజాంతర్దశ (13 నెలలు)**

**అసృక్పిత్తరుజాపీడా వహ్నిచౌరాద్యుపద్రవాః**
**కలహః స్త్రీజనైః సార్ధం చన్ద్రస్యాన్తర్గతే కుజే** **82**

చంద్రమహాదశలో కుజాంతర్దశ జరుగునపుడు రక్తపిత్తరోగము, అగ్ని, చౌర్యముల వలన ఉపద్రవము స్త్రీలతో జగడము కలుగును.

**బుధాంతర్దశ (28 నెలలు)**

**సుఖం సర్వత్రలాభశ్చ గజవాజిధనాదికమ్**
**గోమహిష్యాదికం యచ్చ చన్ద్రస్యాన్తర్గతే బుధే** **83**

చంద్ర మహాదశలో బుధాంతర్దశ జరుగునపుడు సుఖము, అన్ని విధముల లాభము, ఏనుగులు గుఱ్ఱములు ధనము గోమహిషాదులప్రాప్తి కలుగును.

**శనిఅంతర్దశ (16 నెలల 20 దినములు)**

**ఉద్వేగో విత్తనాశశ్చ శోకః శత్రూదయాద్భయమ్**
**కలహో బన్ధువర్గేణ చన్ద్రస్యాన్తర్గతే శనౌ** **84**

బుధ మహాదశలో శని అంతర్దశ జరుగునపుడు ఉద్వేగము, ద్రవ్యనాశము, శోకము శత్రువుల వలన భయము సోదరులతో విరోధము కలగును.

**గురుఅంతర్దశ (39 నెలల 20 రోజులు)**

**ధనధర్మాది సమ్పత్తిర్వస్త్రాలఙ్కారభూషణమ్**
**సర్వత్ర లభతే లాభం చన్ద్రస్యాన్తర్గతే గురౌ** **85**

చంద్ర మహాదశలో గురు అంతర్దశ జరుగునపుడు ధన ధర్మసంపత్తి వస్త్రాలంకారములు భూషణములు సర్వత్ర ప్రాప్తించును.

**రాహు అంతర్దశ (20 నెలలు)**

**రిపురోగాగ్ని భీతిశ్చ బన్ధునాశో ధనక్షయః**
**చన్ద్రస్యాన్తర్గతే రాహౌ భవేదుద్వేగచిత్తతా** **86**

చంద్ర మహాదశలో రాహు అంతర్దశ జరుగునపుడు శత్రు, రోగ, అగ్నిభయము సోదరులనాశము ధననాశము, మనసునందుద్వేగము కలుగును.

**శుక్ర అంతర్దశ (35 నెలల)**

**ఉత్తమ స్త్రీ జనైర్యోగో దివ్యకన్యాసముద్భవః**
**ధర్మయుక్తా ధనప్రాప్తి శ్చన్ద్రస్యాన్తర్గతే సితే** **87**

చంద్ర మహాదశలో శుక్రాంతర్దశ జరుగునపుడు ఉత్తమ స్త్రీలతో సంయోగము సుందరమైన పుత్రికల జననము, ధర్మయుక్తముగా ధనప్రాప్తి కలగును.

**సూర్యఅంతర్దశ (10 నెలలు)**

**లాభో రాజకులేభ్యశ్చ వ్యాధినాశోరిపుక్షయః**
**జాయతే సుఖమైశ్వర్యం చన్ద్రస్యాన్తర్గతే రవౌ** **88**

చంద్ర మహాదశలో రవి అంతర్దశ జరుగునపుడు రాజకులము వలన లాభము వ్యాధి నాశము, శత్రుక్షయము, సుఖము, ఐశ్వర్యముల ప్రాప్తి కలుగును.

**కుజ మహాదశ (8 వర్షములు)**

**శస్త్రాభిఘాతో నృపతేశ్చ పీడా**
**చౌరాగ్ని రోగాశ్చ ధనస్యహానిః**
**కార్యాభిఘాతశ్చ జనేషు ధన్యం**
**భవేద్దశాయాం ధరణీసుతస్య** **89**

కుజ మహాదశలో శస్త్రముల వలన దెబ్బ తగులుట రాజు వలన పీడ, చోరాగ్ని రోగములపీడ, ధనహాని, కార్యముల నెరవేరకుండుట దీనత్వము కలుగును.

**కుజాంతర్దశ (6 నెలల 3 దినముల 20 ఘడియలు)**

**శత్రుభిః సహసమ్మర్దో బన్ధుభిః సహవిగ్రహః**
**స్త్రీ సఙ్గతో రక్తపిత్తాద్ భీర్భౌమస్యాన్తర్గతే కుజే** **90**

కుజ మహాదశలో కుజాంతర్దశ జరుగునపుడు శత్రువులతో యుద్ధము, బంధువులతో విరోధము, స్త్రీ ప్రసంగము వలన రక్తపిత్తభయము కలుగును.

**బుధాంతర్దశ (15 నెలల 3 దినముల 20 ఘడియలు)**

**శత్రుచౌరనృపాదిభ్యో మహాభీతిః ప్రజాయతే**
**మహాజ్వరకృతా పీడా భౌమస్యాన్తర్గతే బుధే** **91**

కుజ మహాదశలో బుధ అంతర్దశ జరుగునపుడు శత్రువులు, చోరులు, రాజుల వలన భయము, మహాజ్వరము క్రిముల వలన పీడకలుగును.

**శనిఅంతర్దశ (8 నెలల 26 దినముల 40 ఘడియలు)**

**ధనక్షయో మహాదుఃఖం జాయతేఽత్ర నిరన్తరమ్**
**భౌమస్యాన్తర్గతే మన్దే నరస్యవిపదః సదా** **92**

కుజ మహాదశలో శని అంతర్దశ జరుగునపుడు ధననాశము, నిరంతరము దుఃఖము కలుగుట జరుగును ఎల్లప్పుడు మనుష్యులు కష్టములతో జీవనము సాగింతురు.

**గురుఅంతర్దశ (16 నెలల 26 దినము 40 ఘడియలు)**

**ధనలాభస్తీర్థలాభో దేవబ్రాహ్మణ పూజనమ్**
**భౌమస్యాన్తర్గతే జీవే నృపాత్కిఞ్చిద్ భయం భవేత్ 93**

కుజ మహాదశలో గురు అంతర్దశ జరుగునపుడు ధనలాభము, తీర్థలాభము దేవతలు బ్రాహ్మణులందు భక్తిభావము రాజుల వలన కొంత భయము కలుగును.

**రాహు అంతర్దశ (10 నెలల 20 దినములు)**

**శత్రు చౌరాగ్ని భీతశ్చ కృషి స్త్రీ ధనపీడనమ్**
**భౌమస్యాన్తర్గతే రాహౌ యత్ర తత్రభయం వదేత్ 94**

కుజ మహాదశలో రాహు అంతర్దశ జరుగునపుడు శత్రు చోరాగ్ని భయములు. వ్యవసాయము స్త్రీ ధనముల వలన కష్టము అన్ని విధముల పీడకలుగును.

**శుక్రాంతర్దశ (18 నెలల 20 దినములు)**

**వ్యాధయః శత్రుభీతశ్చ ధనక్షయ ఉపద్రవః**
**విదేశగమనం నృణాం భౌమస్యాన్తర్గతే పితే 95**

కుజ మహాదశలో శుక్ర అంతర్దశ జరుగునపుడు వ్యాధి వలన భయము ధననాశము, ఉపద్రవము, పరదేశగమనము జరుగును.

**రవి అంతర్దశ (5 నెలల 10 దినములు)**

**ఆరోగ్యం సర్వతో భద్రం రాజపక్షో జయోత్సవః**
**జాయతేఽత్ర ధనప్రాప్తి ర్భౌమస్యాన్తర్గతే రవౌ 96**

కుజ మహాదశలో రవి అంతర్దశ జరుగునపుడు ఆరోగ్యము అన్ని విధముల కుశలము, రాజపక్షములో జయము ఉత్సవము ధనప్రాప్తి జరుగును.

**చంద్ర అంతర్దశ (13 నెలల 10 దినములు)**

**నానావృత్తి సముత్పన్నో మణిముక్తా సుఖాన్వితః**
**జాయతే మనుజో నిత్యం చన్ద్రే భౌమాన్తరేగతే 97**

కుజ మహాదశలో చంద్ర అంతర్దశ జరుగునపుడు వివిధ వృత్తుల వలన మణులుముత్యములు సుఖము ప్రాప్తించును.

**బుధమహాదశ (17 వర్షములు)**

**నానావిధైరర్థశతైః సమేతో**
**దివ్యాఙ్గనా కేలియుతో విలాసీ**

**సర్వార్థ సిద్ధిర్బహుమానితోఽత్ర**
**భవేద్దశాయాం మనుజో బుధస్య** **98**

బుధ మహాదశలో మనుష్యుడు అనేక విధములైన ద్రవ్యములు కలిగియుండును సుందరమైన స్త్రీలతో విలాస జీవితము గుడుపును. అన్ని విధములైన ధన సంబంధ ప్రయోజనములు కలిగి జనులకు అధిక పుజనీయుడగును.

**బుధ అంతర్దశ (32 నెలలు 3 దినములు 20 ఘడియలు)**

**బుద్ధిర్ధర్మానురాగశ్చ మిత్రబన్ధుసమాగతః**
**శత్రూద్గమో దేహపీడా బుధస్యాన్తర్గతే బుధే** **99**

బుధ మహా దశలో బుధ అంతర్దశ జరుగునపుడు బుద్ధిమంతుడు ధనమునందాసక్తి కలవాడు, మిత్రులు బంధువులతో కూడియుండు వాడగును. శత్రువులవృద్ధి శారీరికపీడ కలుగును.

**శనిఅంతర్దశ (18 నెలలు 26 దినములు 40 ఘడియలు)**

**అకస్మాచ్ఛత్రుసంయోగో హ్యకస్మాదర్థ సంగ్రహః**
**సమ్పర్కోఽగ్నిగరాదీనాం బుధస్యాన్తర్గతే శనౌ** **100**

బుధ మహాదశలో శని అంతర్దశ జరుగునపుడు అకస్మాత్తుగా శత్రువులతో సంయోగము, ద్రవ్య సంగ్రహము అగ్ని విషాదులతో సంపర్కము జరుగును.

**గురు అంతర్దశ (35 నెలలు 26 దినములు 40 ఘడియలు)**

**స్వర్ణాదిధాతులాభశ్చ శరీరారోగ్యమేవ చ**
**సమృత్తిర్ధర్మలాభశ్చ బుధస్యాన్తర్గతే గురౌ** **101**

బుధ మహాదశలో గురు అంతర్దశ జరుగునపుడు సువర్ణాది ధాతువుల లాభము, శారీరిక ఆరోగ్యము సంపత్తి, ధర్మ లాభము కలుగును.

**రాహు అంతర్దశ (21 నెలలు 20 దినములు)**

**ప్రచణ్డ సాహసత్వం చ నానాకార్యరణోద్యమః**
**బుధస్యాన్తర్గతే రాహౌ ధనధర్మాది భోగయుక్** **102**

బుధ మహాదశలో రాహు అంతర్దశ జరుగునపుడు ప్రచండమైన సాహసము వివిధ కార్యములు యుద్ధములలో ఉత్సాహము ధనధర్మాది భోగము కలుగును.

**శుక్రాంతర్దశ (36 నెలలు 20 దినములు)**

**గురుదేవార్చనే ప్రీతిర్జ్ఞానధర్మరతిస్తథా**
**వస్త్రాలఙ్కరణైర్యుక్తో బుధస్యాన్తర్గతేసితే** **103**

బుధ మహాదశలో శుక్ర అంతర్దశ జరుగునపుడు గురువులను దేవతలను పూజించుట జ్ఞాన ధర్మములందభిలాష వస్త్రములు ఆభూషణములందాసక్తి కలుగును.

**రవిఅంతర్దశ (11 నెలలు 10 దినములు)**

**వ్యాధి శత్రుభయైర్ముక్తః పుత్రధర్మ ధనాగమః**
**జాయతే రాజమాన్యశ్చ బుధస్యాన్తర్గతే రవౌ** **104**

బుధ మహాదశలో రవి అంతర్దశ జరుగునపుడు వ్యాధి, శత్రుభయముల నుండి ముక్తి పుత్ర ధర్మ, ధనాగమము రాజుల వలన గౌరవము కలుగును.

**చంద్రాంతర్దశ (28 నెలలు 10 దినములు)**

**క్షయరోగోऽత్ర కుష్ఠం చ నానాపీడా కలేవరే**
**బుధస్యాన్తర్గతే సోమే గలరోగశ్చ జాయతే** **105**

బుధ మహాదశలో చంద్ర అంతర్దశ జరుగునపుడు క్షయరోగము, కుష్ఠి రోగము, వివిధ విధములైన శారీరిక పీడ కంఠ రోగము కలుగును.

**కుజాంతర్దశ (15 నెలలు 3 దినము 20 ఘడియలు)**

**శిరోరోగీ గణ్డరోగీ నానాక్లేశైర్నిపీడితః**
**యమభీతిశ్చౌర భీతిర్బుధస్యాన్తర్గతే కుజే** **106**

బుధ మహాదశలో కుజాంతర్దశ జరుగునపుడు శిరోరోగము, గండరోగము నానా విధములైన క్లేశములతో బాధింపబడుట, యముడు దొంగల వలన భయము కలుగును.

**శనిమహాదశ 10 వర్షములు**

**మిథ్యోపవాదో విముఖోऽత్రబన్ధో**
**ర్వధశ్చ బన్ధోశ్చ నిరాశతా చ**
**కార్యాణి సూన్యాని ధనస్య హానిః**
**క్లేశా భవన్త్యేవ శనేర్దశాయామ్** **107**

శని మహాదశలో చేయని నిందలననుభవించును. బంధువులతో విరోధము, బంధువుల నాశము, బంధువుల వలన నిరాశ, కార్యమున ఫలము కాకుండుట, ధన హాని క్లేశము కలుగును.

**శని అందర్దశ (11 నెలలు 3 దినములు 20 ఘడియలు)**

**శరీరే జాయతే పీడా పుత్రదారైశ్చ విగ్రహః**
**విదేశగమనం హానిః శనేరన్తర్గతే శనౌ** **108**

శని మహాదశలో శని అంతర్దశ జరుగునపుడు శారీరికపీడ, స్త్రీ పుత్రాదులతో జగడము పరదేశగమనము హాని కలుగును.

**గురు అంతర్దశ (21 నెలలు 3 దినములు 20 ఘడియలు)**

**దేవగో్బ్రాహ్మణార్చాత్ర పుత్రమిత్ర ధనాగమః**
**ప్రాప్నోతి చ గురుస్థానం శనైరన్తర్గతేగురౌ 109**

శని మహాదశలో గురు అంతర్దశ జరుగునపుడు గో బ్రాహ్మణ, దేవతలకు పూజలు చేయుట జరుగును. పుత్ర మిత్ర ధనాగమము, ఉన్నతస్థితి కలుగును.

**రాహు అందర్దశ (13 నెలలు 10 దినములు)**

**జ్వరాతి సారపీడా చ శత్రుభీతిర్ధనక్షయః**
**శనేరన్తర్గతే రాహౌ శస్త్రఘాతశ్చ జాయతే 110**

శని మహాదశలో రాహు అంతర్దశ జరుగునపుడు జ్వరము, అతి సారముల వలన బాధ, శత్రు భయము, ధననాశము, శస్త్రఘాతము కలుగును.

**శుక్రాంతర్దశ (23 నెలలు 10 దినములు)**

**జాయాధనసుతైర్యుక్తో జాయతేఽత్ర జయాన్వితః**
**ఆయురారోగ్యమైశ్వర్యం శనేరన్తర్గతేసితే 111**

శని మహాదశలో శుక్రాంతర్దశ జరుగునపుడు స్త్రీ, ధన, పుత్ర, జయములు కలుగును. ఐశ్వర్యముతో కూడిన ఆరోగ్యముండును.

**రవిఅంతర్దశ (6 నెలలు 20 దినములు)**

**పుత్రమిత్ర కలత్రాణాం హానిశ్చార్థస్య జాయతే**
**శనేరన్తర్గతే భానౌ జీవితస్యాపి సంశయః 112**

శని మహాదశలో రవి అంతర్దశ జరుగునపుడు పుత్ర, మిత్ర, స్త్రీ, ద్రవ్యములకు హాని కలుగును, జీవితము కూడ సంశయముగా నుండును.

**చంద్రాంతర్దశ (16 నెలలు 20 దినములు)**

**గోమహిష్యాదిలాభాః స్యుః స్త్రీలాభో విజయః సుఖమ్**
**జాయతే కన్యకాపత్యం శనేరన్తర్గతే విధౌ 113**

శని మహాదశలో చంద్ర అంతర్దశ జరుగునపుడు గోవులు, మహిషముల లాభము కలుగును. స్త్రీ లాభము, విజయము, సుఖము, కన్యాప్రాప్తి కలుగును.

**కుజాంతర్దశ (8 నెలలు 26 దినములు 50 ఘడియలు)**

**దేశత్యాగో ధనత్యాగః శత్రువ్యాధిసమాగమః**
**శనేరన్తర్గతే భౌమే జాయతేఽత్ర మహాభయమ్ 114**

శని మహాదశలో కుజ అంతర్దశ జరుగునపుడు దేశ త్యాగము, ధనత్యాగము, శత్రువులు, వ్యాధి కలుగుట మహాభయము కలుగుట జరుగును.

**బుధాంతర్దశ (18 నెలలు 26 దినములు 40 ఘడియలు)**

**ధనప్రాప్తిశ్చ బన్ధుభ్యః సౌభాగ్యం విజయం సుఖమ్**
**సభాయాం మాన్యతాం విన్ద్యాచ్ఛనేరన్తర్గతే బుధే** **115**

శని మహాదశలో బుధఅంతర్దశ జరుగునపుడు సోదరుల వలన ధనప్రాప్తి సౌభాగ్యము, విజయము, సుఖము, సభలో గౌరవము కలుగును.

**గురుమహాదశ 19వత్సరములు**

**ధర్మార్థకామైః పరిపూరితోఽత్ర**
**రాజప్రతాపైర్వినయైః సమేతః**
**ధనీ జయీ దారసుతాదియుక్తో**
**గురోర్దశాయాం చ నరో నిరోగీ** **116**

గురుమహా దశలో మనుష్యుడు ధర్మార్థ కామములతో పరిపూర్ణుడగును. రాజ్యము, ప్రతాపము నమ్రతతో కూడియుండుట, ధనము కలుగుట జయము, స్త్రీ పుత్రాదులతో రోగరహితుడై జీవనముసాగించుట జరుగును.

**గురుఅంతర్దశ (40 నెలలు 3 దినములు 20 ఘడియలు)**

**పుత్రోత్పత్తిర్ధనోత్పత్తిః సర్వరత్నపరిగ్రహః**
**జాయతే రత్నలాభశ్చ గురోరన్తర్గతే గురౌ** **117**

గురు మహాదశలో గురు అంతర్దశ జరుగునపుడు పుత్ర ధములప్రాప్తి సంపూర్ణ రత్నముల సంగ్రహము లాభము కలుగును.

**రాహు అంతర్దశ (25 నెలలు 10 దినములు)**

**విస్ఫోటకాదిమోహశ్చ శోకో రోగో ధనక్షయః**
**గురోరన్తర్గతే రాహౌ రిపూణాం చ భయంభవేత్** **118**

గురుమహాదశలో రాహుఅంతర్దశ జరుగునపుడు విస్ఫోటనము, మోహము శోకము, రోగము, ధనక్షయము శత్రుభయము కలుగును.

**శుక్రాంతర్దశ (44 నెలలు 10 దినములు)**

**కలహో మానసీపీడా విత్తనాశోమహాభయమ్**
**జాయతే స్త్రీ వియోగశ్చ గురోరన్తర్గతే సితే** **119**

గురుమహాదశలో శుక్ర అంతర్దశ జరుగునపుడు జగడము, మానసిక పీడ, ద్రవ్యనాశము మహాభయము స్త్రీ వియోగము కలుగును.

**రవిఅంతర్దశ (12 నెలలు 20 దినములు)**

**శత్రునాశో జయో నిత్యం నృపపూజా మహత్సుఖమ్**
**ప్రచణ్డైః సహ సఙ్గశ్చ గురోరన్తర్గతే రవౌ.** **120**

గురుమహాదశలో రవి అంతర్దశ జరుగునపుడు శత్రునాశము, నిత్య విజయము రాజుల వలన పూజింపబడుట. మహాసుఖము గొప్ప వ్యక్తులతో సహవాసము కలుగును.

**చంద్రాంతర్దశ (31 నెలలు 20 దినములు)**

**బహుస్త్రీ సఙ్గమక్షీణః శత్రుపీడావివర్జితః**
**గురోరన్తర్గతే చన్ద్రే కన్యాజన్మచ జాయతే** **121**

గురు మహాదశలో చంద్రాంతర్దశ జరుగునపుడు అనేకమంది స్త్రీలతో సంగమము వలన క్షీణస్థితి, శత్రుపీడ లేకుండుట, కన్యాజన్మము కలుగును.

**కుజాంతర్దశ (16 నెలలు 26 దినములు 40 ఘడియలు)**

**రిపునాశో ధనప్రాప్తిః సర్వకార్యసమాగమః**
**సుఖం సౌభాగ్యమారోగ్యం గురోరన్తర్గతే కుజే** **122**

గురుమహాదశలో కుజాంతర్దశ జరుగునపుడు శత్రునాశము, ధనప్రాప్తి అన్ని కార్యములు నెరవేరుట సుఖసౌభాగ్య ఆరోగ్యములు కలుగును.

**బుధాంతర్దశ (36 నెలలు 26 దినములు 40 ఘడియలు)**

**బుద్ధి విజ్ఞానకౌశల్యం ధనబన్ధు సమాగమః**
**గురుదేవాగ్ని భక్తిశ్చ గురోరన్తర్గతే బుధే** **123**

గురుమహాదశలో బుధ అంతర్దశ జరుగునపుడు బుద్ధి జ్ఞానములందు నైపుణ్యము. ధనము, సోదరుల సమాగము గురువులు, దేవతలు అగ్ని యందు భక్తిభావము కలుగును.

**శనిఅంతర్దశ (21 నెలలు 3 దినములు 20 ఘడియలు)**

**వేశ్యాస్త్రీ ద్యూతమద్యైశ్చ ధనధాన్యాది సంక్షయః**
**జాయతే లుప్తధర్మోఽత్ర గురోరన్తర్గతే శనే** **124**

గురుమహాదశలో శని అంతర్దశ జరుగునపుడు వేశ్యా స్త్రీ, జ్యూదము, మద్యముల వలన, ధన, ధాన్య నాశము ధర్మమునందాసక్తి లేకుండుట జరుగును.

**రాహు మహాదశ (12 వర్షములు)**

**జ్ఞానస్య హానిర్గమనం విదేశే**
**ధర్మస్యహానిర్వివిధాశ్చరోగాః**
**సర్వత్ర శూన్యం తనుసంక్షయశ్చ**
**రాహోర్దశాయాం నియతం నరస్య** **125**

రాహు మహాదశలో జ్ఞానమునకు హాని విదేశగమనము, ధర్మహాని అనేక విధములైన రోగము, సర్వత్ర శూన్యత్వము జీవనములో కూడ సందేహము కలుగును.

**రాహు అంతర్దశ 16 నెలలు**

**జితేన్ద్రైః సహసంసర్గః స్త్రీలాభో ధనసఞ్చయః**
**రాహోరన్తర్గతే రాహౌ కలహో బన్ధుభిః సహ** **126**

రాహు మహాదశలో రాహు అంతర్దశ జరుగునుపుడు బ్రాహ్మణులతో సహవాసము, స్త్రీలాభము, ధనసంచయము సోదరులతో కలహము కలుగును.

**శుక్రాంతర్దశ (28 నెలలు)**

**ధర్మిష్ఠః సత్యవాదీ చ ధనీ రోగవివర్జితః**
**జాయతే రాజమాన్యశ్చ రాహోరన్తర్గతే సితే** **127**

రాహు మహాదశలో శుక్రాంతర్దశ జరుగునపుడు ధర్మముగానడుచుట సత్యవాది, రోగరహితుడు రాజులచే పూజింపబడువాడగును.

**రవి అంతర్దశ (8 నెలలు)**

**పుత్ర దుఃఖం మహాభీతిర్ధననాశో విచిన్తనా**
**అగ్నిచౌరభయం క్వాపి రాహోరన్తర్గతే రవౌ** **128**

రాహు మహాదశలో రవి అంతర్దశ జరుగునపుడు పుత్రుల వలన దుఃఖము, మహాభయము, ధననాశము, చింత, అప్పుడుప్పుడు అగ్ని, దొంగల వలన భయము కలుగును.

**చంద్రాంతర్దశ (20 నెలలు)**

**స్త్రీనాశో ధననాశశ్చ కలహో బాన్ధవైః సహ**
**రాహోరన్తర్గతే చన్ద్రే జాయతే చ మహాభయమ్** **129**

రాహు మహాదశలో చంద్రాంతర్దశ జరుగునపుడు స్త్రీ నాశము, ధన నాశము సోదరులతో కలహము, మహాభయము కలుగును.

**కుజాంతర్దశ (10 నెలలు 20 దినములు)**

**విషశాస్త్రాగ్ని చౌరేభ్యో భయం ప్రాప్నోతి దారుణమ్**
**రాహోరన్తర్గతే భౌమే జీవితస్యాపి సంశయః** **130**

రాహుమహాదశలో కుజాంతర్దశ జరుగునపుడు విషము, శాస్త్రము, అగ్ని చోరుల వలన దారుణమైన భయము, జీవనమునకు కూడ సందేహము కలుగును.

**బుధాంతర్దశ (22 నెలలు 20 దినములు)**

**సుహృద్బన్ధు జనైర్యోగే ధనధాన్య సమాగమః**
**న కశ్చిజ్జాయతే క్లేశో రాహోరన్తర్గతే బుధే** **131**

రాహు మహాదశలో బుధాంతర్దశ జరుగునపుడు మిత్రులు సోదరులతో సంయోగము, ధనధాన్య సమాగమము కష్టములు లేకుండుట జరుగును.

**శనిఅంతర్దశ (31 నెలలు 10 దినములు)**

**స్వదేశస్య పరిత్యాగః కుటుమ్బైః సహసఙ్గమః**
**భృత్యార్థయోస్తథా నాశో రాహోరన్తర్గతే శనౌ** **132**

రాహు మహా దశలో శని అంతర్దశ జరుగునపుడు దేశమును వదిలిపెట్టడము, కుటుంబముతో కలవటము, సేవకుల ద్రవ్యముల నాశము కలుగును.

**గురుఅంతర్దశ (25 నెలలు 10 దినములు)**

**రోగహానిః సుఖం నిత్యం దేవబ్రాహ్మణ పూజనమ్**
**ధనధాన్య సమృద్ధిశ్చ రాహోరన్తర్గతే గురౌ** **133**

రాహు మహాదశలో గురు అంతర్దశ జరుగునపుడు రోగము లేకుండుట నిత్యసుఖము, దేవతలు బ్రాహ్మణులయందుభక్తి ధనధాన్య సమృద్ధి కలుగును.

**శుక్రమహాదశ (21 వర్షములు)**

**నృపేన్ద్రమాన్యో ధనలాభపూర్ణో**
**హస్త్యశ్వయుక్తః ప్రమదానురక్తః**
**మన్త్రప్రయోగే నిపుణశ్చ శాస్త్రే**
**కవేర్దశాయాం కుశలీ మనుష్యః** **134**

శుక్రమహాదశలో రాజులకు మానధనలాభములు ఏనుగులు, గుర్రములను పొందుటము, స్త్రీలతో ప్రీతి, మంత్ర ప్రయోగము శాస్త్ర నైపుణ్యము కుశలత్వము లభించును.

**శుక్రాంతర్దశ (49 నెలలు)**

**మానవృద్ధిః సుతోత్పత్తిర్ధనధాన్యాగమం సుఖమ్**
**స్వర్ణామ్బరాదిలాభశ్చ సితస్యాన్తర్గతే సితే** **135**

శుక్రమహాదశలో శుక్రాంతర్దశ జరుగునపుడు గౌరవమును పొందుట పుత్రోత్పత్తి, ధనధాన్య లాభము సుఖము సువర్ణము వస్త్రాదులప్రాప్తి కలుగును.

**రవిఅంతర్దశ (14 నెలలు)**

**శత్రునాశో జయోనిత్యం నృపాల్లాభో మహాసుఖమ్**
**ప్రచణ్డైః సహసంసర్గః శుక్రస్యాన్తర్గతే రవౌ** **136**

శుక్రమహాదశలో రవిఅంతర్దశ జరుగునపుడు శత్రువులనాశనము, ఎల్లప్పుడు జయము, రాజుల వలన లాభము, మహాసుఖము గొప్పవారితో సాంగత్యము కలుగును.

**చంద్రాంతర్దశ (35 నెలలు)**

**గురుదేవాగ్ని భక్తిశ్చ దుఃఖం మధ్యం సుఖం తథా**
**శుక్రాస్యాన్తర్గతే చన్ద్రే శత్రుమిత్ర సమాగమః 137**

శుక్ర మహాదశలో చంద్రాంతర్దశ జరుగునపుడు గురువులు దేవతలు అగ్నియందుభక్తి మిశ్రిత సుఖదుఃఖములు శత్రువులు మిత్రులతో సమాగమము జరుగును.

**కుజాంతర్దశ (18 నెలలు 20 దినములు)**

**సంగ్రామే చ రిపుం జిత్వా ధనం కీర్తిశ్చలభ్యతే**
**ఆరోగ్యం సుఖమైశ్వర్యం శుక్రస్యాన్తర్గతే కుజే 138**

శుక్రాంతర్దశలో కుజాంతర్దశ జరుగునపుడు యుద్ధములో శత్రువులను జయించి ధనమును యశమును పొందుట, ఆరోగ్యము, సుఖము ఐశ్వర్యములు లభించుట జరుగును.

**బుధాంతర్దశ (39 నెలలు 20 దినములు)**

**నఖరోగః శిరోరోగో దుఃఖమామాశయోద్భవమ్**
**శరీరే జాయతే పీడా శుక్రాస్యాన్తర్గతే బుధే 139**

శుక్ర మహాదశలో బుధ అంతర్దశ జరుగునపుడు నఖములలో రోగము శిరోరోగము, ఆమాశయ రోగము వలన దుఃఖము ఉత్పన్నమగును శరీరమునకు పీడకలుగును.

**శనిఅంతర్దశ (23 నెలలు 10 దినములు)**

**దుష్టస్త్రీభిశ్చ సంసర్గః సుఖం చార్థసమాగమః**
**శత్రునాశః సుహృల్లాభః శుక్రస్యాన్తర్గతే శనౌ 140**

శుక్రమహాదశలో శని అంతర్దశ జరుగునపుడు దుష్ట స్త్రీలతో సమాగమము, సుఖము, ద్రవ్యలాభము శత్రునాశము మిత్రలాభము కలుగును.

**గురుఅంతర్దశ (44 నెలలు 10 దినములు)**

**ధనధాన్య సమృద్ధిశ్చ నానాధర్మసమన్వితః**
**శ్రేణీ ప్రభుత్వమాప్నోతి శుక్రస్యాన్తర్గతే గురౌ 141**

శుక్ర మహాదశలో గురు అంతర్దశ జరుగునపుడు ధనధాన్యసమృద్ధి అనేక విధములైన ధర్మములతో కూడియుండుట వివిధ శ్రేణులకు స్వామియగును.

**రాహుఅంతర్దశ (28 నెలలు)**

**వైరం విషాదో దుఃఖం చ సదోద్వేగో మహాభయమ్**
**శుక్రస్యాన్తర్గతే రాహౌ కదాచిత్ సుఖమాప్నుయాత్ 142**

శుక్రమహాదశలో రాహు అంతర్దశ జరుగునపుడు ఇతరులతో వైరము విషాదము, దుఃఖము ఎల్లప్పుడు ఉద్వేగముతోనుండుట మహాభయము అప్పుడప్పుడు సుఖము కలుగును.

## వింశోత్తరీదశ

**షడాదిత్యే దశేన్దౌ చ సప్త వర్షాణి మఙ్గలే**
**అష్టాదశ సమారాహౌ షోడశైవ బృహస్పతౌ** **143**
**ఏకోనవింశతిర్మన్దే బుధే సప్తదశైవ చ**
**సప్తవర్షాణి కేతౌ చ వింశతిర్భార్గవే తథా** **144**

సూర్యునికి 6 సంవత్సరములు, చంద్రునికి 10, కుజునికి 7, రాహువుకి 18, గురునికి 16, శనికి 19, బుధునికి 17, కేతువుకి 7, శుక్రునికి 20 సంవత్సరములు మహాదశ ఉండును.

**కృత్తికామవధిం కృత్యా భరణీం చాధిగణ్యతే**
**కృత్తికాదిత్రిరావృత్యా సూర్యాదిర్గణయేత్క్రమాత్** **145**

కృత్తిక నుండి భరణి వరకు లెక్కించవలెను కృత్తికాది మూడు ఆవృత్తులతో సూర్యాది గ్రహములను క్రమముగా లెక్కించవలెను.

**రవిః శశీ కుజోరాహుర్జీవో మన్దో బుధః శిఖీ**
**శుక్రోఽ గ్నిభాద్యుఫాభాది విశ్వర్క్షాదినవేశ్వరాః** **146**

రవి, చంద్రుడు, కుజుడు, రాహువు, గురుడు, శని, బుదుడు, కేతువు, శుక్రుడు నవగ్రహములు. కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ నక్షత్రములలో జన్మించిన రవి దశగా భావించవలెను ఇదే విధముగా మిగిలిన గ్రహముల దశలను గ్రహించవలెను.

## వింశోత్తరీదశా చక్రము

| గ్రహములు | రవి | చంద్ర | కుజ | రాహు | గురు | శని | బుధ | కేతు | శుక్ర |
|---|---|---|---|---|---|---|---|---|---|
| వర్షములు | 6 | 10 | 7 | 18 | 16 | 19 | 17 | 7 | 20 |
| నక్షత్రము | కృత్తిక<br>ఉత్తర<br>ఉత్తారా<br>షాఢ | రోహిణి<br>హస్త<br>శ్రవణ | మృగ<br>చిత్త<br>ధనిష్ఠ | ఆర్ద్ర<br>స్వాతి<br>శతభిష | పున<br>విశాఖ<br>పూ.భ | పుష్య<br>అను<br>ఉభా | ఆశ్లేష<br>జ్యేష్ఠ<br>రేవతి | మాఘ<br>మూల<br>అశ్విని | పూబ్బ<br>పూ.షాఢ<br>భరణి |

**కేతుమహాదశ (7 వర్షములు)**

**లక్ష్మీవినాశో వనితావిపత్తిః**
**శరీరపీడా నృపమానభఙ్గః**
**ప్రియైః కుటుమ్బైశ్చ భవేద్వియోగః**
**కేతోర్దశాయాం సతతం చ తాపః** **147**

కేతు మహాదశలో ధననాశము, స్త్రీలకు ఆపద, శరీరపీడ, రాజులకు మానభంగము, ప్రియమైన కుటుంబములతో వియోగము ఎల్లప్పుడు కష్టము కలుగును.

**కేతుఅంతర్దశ (4 నెలలు 27 దినములు)**

**పుత్రనాశోఽర్థనాశశ్చ దుష్టనారీజనైః కలిః**
**కేతోన్తర్గతే కేతౌ రాజభీః శత్రువిగ్రహః** **148**

కేతుమహా దశలో కేతు అంతర్దశ జరుగునపుడు పుత్రులనాశము, ద్రవ్యనాశము, చెడు స్త్రీలతో కలహము, రాజభయము, శత్రువులతో యుద్ధము కలగును.

**శుక్రాంతర్దశ (14 నెలలు)**

**స్త్రీత్యాగోఽగ్ని దాహశ్చ కన్యాజన్మ తథాజ్వరః**
**కేతోరన్తర్గతే శుక్రే మిత్రైః సహ కలిర్భవేత్** **149**

కేతు మహాదశలో శుక్రాంతర్దశ జరుగునపుడు స్త్రీ త్యాగము అగ్నిదాహము, కన్యాజన్మము, జ్వరము, మిత్రులతో కలహము కలుగును.

**రవిఅంతర్దశ (4 నెలలు 6 దినములు)**

**అగ్నిదాహో జ్వరో రోషో విదేశగమనం తథా**
**కేతోరన్తర్గతే సూర్యేక్షయరోగశ్చ జాయతే** **150**

కేతు మహాదశలో రవిఅంతర్దశ జరుగునపుడు అగ్నిదాహము, జ్వరము రోషము పరదేశగమనము క్షయరోగము కలుగును.

**చంద్రఅంతర్దశ (7 నెలలు)**

**అర్థలాభోఽర్థహానిశ్చ సుఖం దుఃఖం క్వచిత్క్వచిత్**
**కేతోఽన్తర్గతేచన్ద్రే స్త్రీలాభశ్చాపి జాయతే** **151**

కేతు మహాదశలో చంద్రాంతర్దశ జరుగునపుడు ద్రవ్యలాభము, ద్రవ్యహాని, సుఖము, కష్టము అప్పుడుప్పుడు జరుగును. స్త్రీ లాభము కలుగును.

**కుజాంతర్దశ (4 నెలలు 27 రోజులు)**

**గోత్రజైః సహ సంవాదో వహ్నిచోరభయంతథా**
**శరీరే జాయతే పీడా కేతోరన్తర్గతే కుజే** **152**

కేతమహా దశలో కుజాంతర్దశ జరుగునపుడు సోదరుల మధ్య జగడము అగ్ని చోరభయములు శరీరములో పీడ కలుగును.

**రాహుఅంతర్దశ (12 నెలలు 18 రోజులు)**

**చౌరభీతిర్దేహభఙ్గః కుమిత్రైః సహసఙ్గతిః**
**కేతోరన్తర్గతే రాహౌ కలహౌ శత్రుభిః సహ 153**

కేతు మహాదశలో రాహు అంతర్దశ జరుగునపుడు దొంగల భయము దేహభంగము, కుమిత్రులతో సహవాసము శత్రువులతో కలహము కలుగును.

**గురుఅంతర్దశ (11 నెలలు 6 దినములు)**

**రాజమాన్యైర్జనైర్యోగో జితేన్ద్రశ్చ ధనాగమః**
**భూమిలాభః పుత్రలాభః కేతోరన్తర్గతే గురౌ 154**

కేతు మహాదశలో గురు అంతర్దశ జరుగునపుడు రాజ సమ్మానము, జనులతో సంబంధము, బ్రాహ్మణులవలన ధనాగమము భూలాభము పుత్రలాభము కలుగును.

**శనిఅంతర్దశ (13 నెలల దినములు)**

**వాతపిత్త కృతా పీడా స్వజనైః సహ విగ్రహః**
**పరదేశ గమనం చాపి కేతోరన్తర్గతే శనౌ 155**

కేతు మహాదశలో శని అంతర్దశ జరుగునపుడు వాతపిత్తముల పీడ, సోదరులతో కలహము పరదేశగమనము కలుగును.

**బుధాంతర్దశ (11 నెలలు 27 దినములు)**

**సుహృద్బన్ధు సమాయోగే భూనిమిత్తం చ విగ్రహః**
**దేహపీడా భవేన్నిత్యం కేతోరన్తర్గలే బుధే 156**

కేతు మహా దశలో బుధాంతర్దశ జరుగునపుడు మిత్రులు, సోదరులతో సంయోగము, భూమికొరకు జగడము, నిత్యము దేహపీడ కలుగును.

రవ్యాదిగ్రహముల మహాదశలలో కేతు అంతర్దశాఫలము

**రవిమహాదశలో (4 నెలలు 6 దినములు)**

**దేశత్యాగే బన్ధునాశో ధననాశః సుతక్షయః**
**సూర్యస్యాన్తర్గతే కేతౌ దుఃఖమేవ హి ప్రాప్యతే 157**

సూర్య మహాదశలో కేతు అంతర్దశ జరుగునపుడు దేశ త్యాగము, సోదరుల నాశము, ధనము మరియు పుత్రుల నష్టముతో దుఃఖము ప్రాప్తించును.

**చంద్రమహాదశలో (7 నెలలు)**

**చలచిత్తోఽర్థనాశశ్చ రోగో బన్ధుధనక్షయః**
**చన్ద్రస్యాన్తర్గతే కేతౌ సర్వత్రైవాశుభం భవేత్ 158**

చంద్ర మహాదశలో కేతు అంతర్దశ జరుగునపుడు చిత్తచాంచల్యము, ద్రవ్యనాశము, రోగము బంధు జనులకు నాశము అన్ని విధముల అశుభము కలుగును.

**కుజమహాదశలో (4 నెలలు 27 దినములు)**

**విషశస్త్రాగ్ని చౌరేభ్యో జాయతేఽత్ర మహాభయమ్**
**భౌమస్యాన్తర్గతే కేతౌ క్లేశభాగీ సదానరః 159**

కుజమహాదశలో కేతుఅంతర్దశ జరుగునపుడు విష, శస్త్ర, అగ్ని, దొంగలవలన భయము ఎల్లప్పుడు దుఃఖము కలుగును.

**రాహుమహాదశలో (12 నెలలు 18 దినములు)**

**జ్వరాగ్నిరిపు శస్త్రేభ్యో మృత్యురాయాతి సర్వదా**
**రాహోరన్తర్గతే కేతౌ శుభం క్యాపి న లభ్యతే 160**

రాహు మహాదశలో కేతు అంతర్దశ జరుగునపుడు జ్వరము, అగ్ని, శత్రువులు, ఆయుధములతో సదామృత్యువు కలుగును, శుభము ఎప్పుడు జరుగదు.

**గురుమహాదశలో (11 నెలలు 6 దినములు)**

**పుత్రబన్ధు కృతోద్వేగో నిజస్థాన వివర్జితః**
**గురోరన్తర్గతే కేతౌ పరిభ్రమతి మానవః 161**

గురు మహాదశలో కేతు అంతర్దశ జరుగునపుడు పుత్రులు సోదరులు కష్టముతో జీవనము చేయుదురు. ఒక చోటస్థిర నివాసముండక వివిధ ప్రదేశములకు తిరుగుచుందురు.

**శనిమహాదశలో (13 నెలలు 9 దినములు)**

**రక్తపిత్తకృతా పీడా కలహః స్వజనైః సహ**
**శనేరన్తర్గతే కేతౌ ఘోర దుఃఖ ప్రదర్శనమ్ 162**

శనిమహాదశలో కేతు అంతర్దశ జరుగునపుడు రక్తపిత్తములతో పీడకలుగును. సోదరులతో కలహము, భయంకరమైన దుఃఖము కలుగును.

**బుధమహాదశలో (11 నెలల 27 దినములు)**

**దుఃఖ శోకాకులో నిత్యం శరీరే క్లేశసంయుతః**
**బుధ స్యాన్తర్గతే కేతౌ భవత్యేవ న సంశయః 163**

బుధమహాదశలో కేత అంతర్దశ జరుగునపుడు దుఃఖము, శోకము, వ్యాకులత్వము శరీరపీడ తప్పక కలుగును.

**వర్షదశ**

**జన్మలగ్నం సమాయుక్తం గతవర్షగణైశ్చ తత్**
**హృతం ద్వాదశభిః శేషే గ్రహార్వాచ్యం శుభాశుభమ్ 164**

జన్మలగ్నమును జరిగిన సంవత్సరములతో కలుపవలెను. వచ్చిన అంకమును పన్నెండుతో భాగించవలెను. మిగిలిన శేషమునను సరించి గ్రహము శుభాశుభములను తెలుపవలెను.

**మాసదశ**

**వింశతిర్వాసరః సూర్యే పఞ్చాశచ్చ నిశాకరే**
**సంప్తవింశతిరఙ్గారే సప్తపఞ్చాశదిన్దుజే** **165**
**త్రయస్త్రింశచ్చ మన్దే స్యుస్త్రిషష్టిశ్చ బృహస్పతే**
**వింశతిః సైంహికేయే చ కేతావపి చ వింశతిః** **166**
**సప్తతిర్భృగుపుత్రే చ జ్ఞేయా మాసదశాబుధైః**
**నామరాశిం సమారభ్య సంక్రమావధి గణ్యతే** **167**

20 దినములు రవి దశ, 50 దినములు చంద్రదశ, 27 దినములు కుజదశ, 57 దినములు బుధ దశ, 33 దినములు శని దశ, 63 దినములు గురుదశ, 20 దినములు రాహుదశ, 20 దినములు కేతుదశ, 70 దినములు శుక్రమాసదశ యని తెలిసికొనవలెను. నామరాశి నుండి సంక్రాంతి వరకు గణించి పండితులు మాసదశను తెలియజేయుదురు.

**తిథిం వారం చ నక్షత్రం నామాక్షర సమన్వితమ్**
**నవభిశ్చ హరేద్భాగం శేషా దినదశోచ్యతే** **168**

తిథి, వారము, నక్షత్రము, నామాక్షములను జోడించి తొమ్మిదితో భాగించిన వచ్చు శేషము దినదశగా తెలుపవలెను. ఈ దినదశవింశోత్తరీ క్రమములో జరుగును.

**చైత్రాదేర్ద్విగుణామాసా గతాభిస్తిథిభిర్యుతాః**
**సప్తభిశ్చ హరేద్భాగం శేషదినఫలం స్మృతమ్** **169**

చైత్రము మొదలుకొని జరిగిన మాసములను రెట్టింపు చేసి తిథిని కలిపి ఏడుచే భాగించిన వచ్చు శేషము దినఫలమగును.

**సమ్పత్తిః కలహో లోకైరానన్దః కాలకణ్టకః**
**ధర్మస్తపశ్చ విజయో రవివారాత్క్రమాత్ఫలమ్** **170**

ఒకటి శేషము వచ్చిన రవివారము - సంపత్తి కలుగును. రెండు శేషము వచ్చిన సోమవారము ఇతరులతో కలహము, మూడు వచ్చిన మంగళవారము ఆనందము, నాలుగు వచ్చిన బుధవారము కాలకంఠకము, ఐదు వచ్చిన గురువారము ధర్మము, ఆరు వచ్చిన శుక్రవారము తపము. ఏడు వచ్చిన శనివారము విజయము కలుగును.

**క్రూరగ్రహముల దశలో శుభగ్రహదశాఫలవిచారము**

**క్రూరగ్రహ దశాయాం చ క్రూరస్యాన్తర్దశా యదా**
**శత్రుయోగే భవేన్మృత్యుర్మిత్రయోగే న సంశయః** **171**

క్రూరగ్రహముల మహాదశలో క్రూరగ్రహముల అంతర్దశ జరిగిన శత్రువులు లేక మిత్రుల సహాయోగము వలన నిస్సందేహముగా మృత్యువు కలుగును.

**కుజమహాదశలో శనిఅంతర్దశా ఫలము**

**మజ్గలస్య దశాయాం చ శనేరన్తర్దశా యదా**
**మ్రియతేఽత్ర చిరఞ్జీవీకా కథా స్వల్పజీవినామ్ 172**

కుజ మహాదశలో శని అంతర్దశ జరుగునపుడు దీర్ఘజీవికి కూడ మృత్యువు కలుగును. అల్పజీవి గురించి చెప్పునదేమున్నది.

**క్రూరగ్రహరాశులలో పాపగ్రహఫలము**

**క్రూరరాశౌ స్థితః పాపః షష్ఠే వా నిధనేఽపివా**
**సితేన రవిణా దృష్టః స్వపాకే మృత్యుదో గ్రహః 173**

క్రూరగ్రహరాశిలోనున్న పాపగ్రహము ఆరు, ఎనిమిది, గృహములలోనున్న శుక్ర, సూర్యులతో చూడబడుచున్న తమదశలో మృత్యువు కలుగును.

**లగ్నస్యాధిపతేః శత్రుర్లగ్నస్యాన్తర్దశాగమః**
**కరోత్యకస్మాన్మరణం సత్యాచార్యేణ భాషితమ్ 174**

లగ్న స్వామికి శత్రువు లగ్న అంతర్దశలో వచ్చిన అకస్మాత్తుగా మృత్యువు కలుగును ఇది సత్యాచార్యుని వచనము.

**దశారిష్టభంగము**

**దశాయాం బలవాన్ ఖేటః శుభైర్వా సన్నిరీక్షితః**
**సౌమ్యాధిమిత్ర వర్గస్థోఽరిష్టభఙ్గో భవేత్తదా 175**

దశలో బలమైన గ్రహమున్న, లేక శుభగ్రహములతో చూడబుతున్న సౌమ్యలేక అధి మిత్ర వర్గములోనున్న ఆ గ్రహదశలో అరిష్ట భంగము కలుగును.

**మూలం దశాధినాథస్య వాచస్పతి దశా యదా**
**బలీశుభోథ విజ్ఞేయోఽరిష్ట భఙ్గస్తదాభవేత్ 176**

మూలదశాస్వామి దశలో గురు దశ వచ్చిన శుభగ్రహమును బలమైనదిగా భావించవలెను. దానివలన అరిష్టభంగమగును.

**శుభగ్రహో గ్రహైర్యోగే విజయీ యది జాయతే**
**దశాయాం న భవేత్కృష్టం స్వోచ్చాదిషు చ సంస్థితః 177**

శుభగ్రహ యోగములో విజయము కలుగును. తన ఉచ్చ దశలోనున్నపుడు కూడ నష్టము కలుగక సుఖము ప్రాప్తించును.

**ఇతి శ్రీ సర్వశాస్త్ర విశారద -**
**శ్రీ కాశీనాథ కృతౌ జాతకలగ్న చన్ద్రికాయాం తృతీయః పరిచ్ఛేదః**

**ఇది శ్రీ సర్వశాస్త్ర విశారదుడైన శ్రీకాశినాథ కృత**
**జాతకలగ్న చంద్రికలో తృతీయ పరిచ్ఛేదము.**

# చతుర్థ పరిచ్ఛేదము - 4

## రెండు గ్రహముల యోగము

**సూర్యచంద్ర యోగఫలము**

**స్త్రీవశః క్రూరకర్మా చ దుర్వినీతః క్రియాదృఢః**
**విక్రమ్ లఘుచేతాశ్చ సూర్యచన్ద్ర సమాగమే** **1**

సూర్యచంద్రులిరువురు కలిసి యున్నపుడు మనుష్యుడు స్త్రీకి వశమగును క్రూరకర్మలు చేయువాడు, దుర్వినీతుడు, కార్యములు చేయుటకు దృఢమైన మనస్తత్వము కలవాడు పరాక్రమి, లఘుచిత్తుడగును.

**రవి కుజయోగ ఫలము**

**సూర్యమజ్గల సంయోగే తేజస్వీ జాతమానసః**
**మిథ్యావాదీ చ మూఖశ్చ వధనిష్ఠో బలీ నరః** **2**

రవికుజ సంయోగములో మనుష్యుడు తేజస్వి, మనస్వి, మిథ్యావాదము చేయువాడు, మూర్ఖుడు, ఇతరులను హింసించువాడగును.

**రవి–బుధ యోగఫలము**

**విద్వానార్యో రాజమాన్యః సేవాశీలః ప్రియంవదః**
**యశస్వీ చాస్థిరద్రవ్యో బుధసూర్యసమాగమే** **3**

రవి బుధుల యోగము కలిగిన మనుష్యుడు విద్వాంసుడు, శ్రేష్ఠమైన రాజులతో పూజింపబడువాడు, సేవా నిరతుడు, ప్రియవచనములు పలుకువాడు యశస్వి, అస్థిరద్రవ్యము కలవాడగును.

**రవి–గురు యోగఫలము**

**నృపమాన్యో ధర్మనిష్ఠో మిత్రవానర్థవానపి**
**ఉపాధ్యాయోఽతి విఖ్యాతో యోగే జీవార్కసజ్గమే** **4**

రవి గురుల యోగములో మనుష్యుడు రాజులచే పూజితుడు, ధర్మనిష్ఠుడు, మిత్రులుకలవాడు, ధనవంతుడు అధిక ప్రసిద్ధుడగును.

**రవి–శుక్ర యోగఫలము**

**శాస్త్ర ప్రహారో బన్ధశ్చ రజ్గజ్ఞో నేత్రదుర్బలః**
**స్త్రీసజ్గలబ్ధద్రవ్యశ్చ శక్తః శుక్రార్కసజ్గమే** **5**

రవి శుక్రుల యోగములో మనుష్యుడు శాస్త్రములను నష్టపరచువాడు ప్రతిపనిలో ఆటంకములు కలిగించువాడు, కళారంగములో ప్రావీణ్యమున్నవాడు, దుర్బలనేత్రములు కలవాడు స్త్రీ ద్వారా ద్రవ్యమును పొందువాడు, సమర్థుడగును.

**రవి-శని యోగఫలము**

**విద్వానాత్మ క్రియానిష్ఠో ధాతుజ్ఞో వృద్ధచేష్టితః**
**ప్రనష్టసుతదారశ్చ శనిసూర్య సమాగమై** **6**

రవి శనుల సంయోగములో మనుష్యుడు విద్వాంసుడు, తన కార్యములందాసక్తికలవాడు. ధాతుజ్ఞానము కలవాడు, వృద్ధులననుసరించి నడుచువాడు భార్యసుతుల నష్టమును పొందువాడగును.

**చంద్ర-కుజ యోగఫలము**

**మృచ్చర్మధాతు శిల్పీ చ ధనీ శూరో రణే భవేత్**
**చన్ద్రమఙ్గల సంయోగే రక్తపీడాతురో నరః** **7**

చంద్ర కుజుల సంయోగములో మనుష్యుడు మట్టి, చర్మము, ధాతువులతో వస్తువులను తయారుచేయువాడు, ధనవంతుడు యుద్ధములోవీరుడు, రక్తపీడతో వ్యాకులుడగును.

**చంద్ర-బుధ యోగఫలము**

**స్త్రీ సమ్మతః సురూపశ్చ కావ్యేతి నిపుణోభవేత్**
**ధనీపణీ హాస్యవక్త్రో బుధేన్ద్వోర్ధార్మికోఽన్వయే** **8**

చంద్ర బుధుల సమాగమములో మనుష్యుడు స్త్రీలచే సమ్మానితుడు రూపవంతుడు, కావ్యములందు నిపుణుడు, ధనవంతుడు, గుణవంతుడు హాస్య ముఖము కలవాడు వంశములో ధర్మాత్ముడగును.

**చంద్రగురు యోగఫలము**

**దేవద్విజార్చాసక్తశ్చ బన్ధుమానకరో ధనీ**
**దృఢప్రీతిః సుశీలశ్చ జీవచంద్ర సమాగమే** **9**

చంద్రగురుల సంయోగము నొందిన మనుష్యుడు దేవబ్రాహ్మణులను పూజించువాడు. సోదరులను గౌరవించువాడు, ధని, దృఢమైన ప్రీతిగలవాడు సుశీలుడగును.

**చంద్ర శుక్రయోగఫలము**

**కుశలీవిక్రయాదౌ చ బుద్ధిజ్ఞః కలహప్రియః**
**మాల్యవస్త్రాదిసంయుక్తః శశిభార్గవ సఙ్గమే** **10**

చంద్ర శుక్రులు సంయోగము నొందిన మనుష్యుడు వ్యాపారములో చతురుడు, తెలివి గలవాడు, జగడములాడువాడు మాలలు వస్త్రములతో కూడిన వాడగును.

**చంద్ర శనియోగఫలము**

**గజాశ్వపాలో దుఃశీలో వృద్ధస్త్రీరమణో నరః**
**వేశ్యాధనో విపుత్రశ్చ శనిచంద్రసమాగమే** **11**

చంద్ర శనుల సంయోగమున మనుష్యుడు ఏనుగులు, గుఱ్ఱములను పాలించువాడు, దుశ్శీలుడు వృద్ధ స్త్రీల సంగమము చేయువాడు, వేశ్యకుధనమునర్పించువాడు పుత్రహీనుడగును.

**కుజ బుధ యోఘలము**

**భూపుత్రి బుధసంయోగే నిర్ధనో విధవాపతిః**
**స్త్రీ దుర్భగః క్రయప్రీతిః స్వర్ణలోహ ప్రకారకః 12**

కుజ బుధుల సంయోగమున మనుష్యుడు దరిద్రుడు విధవాపతి కురూపియైన భార్యకలవాడు, కొనుటయందాసక్తి కలవాడు, బంగారము లోహముల కార్యమును చేయువాడగును.

**కుజగురు యోగఫలము**

**మేధావీ శిల్పశాస్త్రజ్ఞః శృతిజ్ఞో వాగ్విశారదః**
**అశ్వప్రియః ప్రధానశ్చ జీవమఙ్గలసఙ్గమే 13**

కుజగురుల సంయోగమున మనుష్యుడు బుద్ధిమంతుడు శిల్పకోవిదుడు వేదజ్ఞానము కలవాడు మధురవచనములు పలుకువాడు గుఱ్ఱములన్న ప్రేమగలవాడు ప్రధానుడగును.

**కుజశుక్ర యోగఫలము**

**గుణప్రధానో గణకో ద్యూతేఽత్యన్తరతః శఠః**
**పరదారరతో మాన్యః శుక్రమఙ్గలసఙ్గమే 14**

కుజ శుక్ర యోగమున మనుష్యుడు మంచి గుణములు కలవాడు గణితజ్ఞుడు, జ్యూదములో ఆసక్తి కలవాడు మూర్ఖుడు, పరస్త్రీలందాసక్తి కలవాడగును.

**కుజశని యోగఫలము**

**వాగ్మీన్ద్ర జాలదక్షశ్చ విధర్మా కలహప్రియః**
**విషమద్య ప్రపఞ్చాఢ్యో మన్దమఙ్గలసఙ్గమే 15**

కుజ శనుల సంయోగమున మనుష్యుడు వాక్కులందు చతురుడు ఇంద్రజాల విద్యలో నిపుణుడు, ధర్మరహితుడు, జగడమునందాసక్తి కలవాడు విష, మదిరలయందాసక్తి కలవాడగును.

**బుధ గురు యోగఫలము :**

**జీవచన్ద్ర జయోర్యోగే నృత్యవాద్యవిచక్షణః**
**ధైర్యయుక్తః పణ్డితశ్చ సుఖీ భవతి మానవః 16**

బుధ, గురు యోగములో మనుష్యుడు నాట్యగానములందు నిపుణుడు, ధైర్యయుక్తుడు, పండితుడు సుఖవంతుడగును.

**బుధ శుక్ర యోగఫలము :**

**బుధ భార్గవయోర్యోగే నయజ్ఞో బహుశిల్పవాన్**
**ధనీ సువాక్యో వేదజ్ఞో గీతజ్ఞో హాస్యలాలసః 17**

బుధ శుక్ర సంయోగమున మనుష్యుడు నీతిజ్ఞుడు శిల్పశాస్త్రజ్ఞుడు, ధనవంతుడు, మంచివక్త, వేదగీతములను తెలిసినవాడు హాస్యప్రియుడగును.

**బుధ శని యోగఫలము**

**ఋణీ గమనశీలశ్చ నిరుపాయో జగత్కలిః**
**శుభవాక్యః కార్యదక్షోబుధ మన్దసమాగమే 18**

బుధ శనుల సంయోగము మనుష్యుడు ఋణి, భ్రమనశీలుడు ఉపాయరహితుడు, అందరితో జగడములాడువాడు, శుభమైన వాక్కులను పలుకువాడు కార్యనిపుణుడగును.

**గురు-శుక్ర యోగఫలము**

**గురుభార్గవ సంయోగే దివ్యదారో మహాధనీ**
**ధర్మస్థితః ప్రమాణజ్ఞో విద్యాజీవీ చ జాయతే 19**

గురు శుక్రుల సంయోగమున జాతకుడు సుందరమైన స్త్రీ కలవాడు మహాధని, ధర్మరతుడు ప్రమాణమును తెలిసినవాడు విద్యతో జీవించువాడగును.

**గురుశని యోగఫలము**

**వృత్తిసిద్ధిశ్చ శూరశ్చ యశస్వీ నగరాధిపః**
**శ్రేణీ సేనాగ్రామముఖ్యో గురుమన్దాన్వయే నరః 20**

గురు శనుల సహయోగమున మనుష్యుడు మంచివృత్తిని పుణుడు యశస్వి, నగరస్వామి, శ్రేణి, సేన, గ్రామములలో ముఖ్యుడగును.

**శుక్రశని యోగఫలము**

**శుక్రస్య తు శనేర్యోగే మల్లః పశుపతిర్నరః**
**దారుదారణ దక్షశ్చక్షారామ్లాదిక శిల్పవిత్ 21**

శుక్ర శనుల సంయోగము నొందిన మనుష్యుడు మల్లయోధుడు, పశువులను రక్షించువాడు, కర్రలను నరుకుటలోనిపుణుడుక్షారామ్లాది క్రియలందు నిపుణుడగును.

**ఇతి శ్రీ సర్వశాస్త్ర విశారరద శ్రీకాశీనాథకృతౌ జతకలగ్నచన్ద్రికాయాం**
**ద్విగ్రహయోగోనామ చతుర్థః పరిచ్ఛేదః**

**ఇది శ్రీ సర్వశాస్త్ర విశారదుడు శ్రీ కశినాథ కృత జతకలగ్నచంద్రికయందు**
**ద్విగ్రహయోగనామక చతుర్థ పరిచ్ఛేదము**

# పంచమ పరిచ్ఛేదము - 5

## మూడు గ్రహముల యోగము

**రవి–చంద్ర–బుధ యోగఫలము**

**సూర్యచన్ద్ర బుధైర్యోగే రాజమాన్యో ధనాన్వితః**
**చణ్డో దుర్బలవిత్తస్య జాయతే విద్యయా యుతః 1**

జాతకుడు రవి, చంద్ర, బుధుల యోగములో పూజ్యుడు, ధనవంతుడు, ప్రచండుడు తక్కువ ద్రవ్యము కలవాడు విద్యాయుక్తుడగును.

**రవి–కుజ బుధ యోగ ఫలము**

**భాను భౌమబుధైర్యోగే ఖ్యాతః సాహసికో నరః**
**నిష్ఠురో గతలజ్జశ్చ ధనస్త్రీపుత్రపీడితః 2**

రవి, కుజ, బుధ యోగములో మనుష్యుడు ప్రసిద్ధుడు, సాహసి, నిష్ఠురుడు, సిగ్గులేనివాడు, ధన, స్త్రీ, పుత్రుల వలన పీడితుడగును.

**రవి–కుజ–గురు యోగఫలము**

**సూర్య భౌమేజ్యసంయోగే ప్రచణ్డః సత్యభాషణః**
**రాజమన్త్రీ చ ముఖ్యశ్చ వాక్యేచ నిపుణోభవేత్ 3**

రవి, కుజ, గురు యోగములో ప్రచండుడు, సత్యము పలుకువాడు రాజుకు ముఖ్యమంత్రి మాట్లాడుటలో నేర్పరితనము కలవాడగును.

**రవి–కుజ శుక్ర యోగఫలము**

**సూర్యార శుక్ర సంయోగే మహాభక్తః ప్రజాయతే**
**కులీనో వత్సలో లోకే విషయాసక్తమానసః 4**

రవి–కుజ, శుక్ర యోగములో భజనయందాసక్తి కలవాడు, భక్తుడు కులీనుడు, లోకముపై ప్రేమభావము కలవాడు. విషయాసక్తుడగును.

**రవి–కుజ–శనియోగ ఫలము**

**శనిసూర్య కుజోర్యోగే మూర్ఖో గోధనవర్జితః**
**రోగార్తః స్వజనైర్హీనో వికలః కలహాకులః 5**

రవి–కుజ–శనుల సంయోగములో మూర్ఖుడు, గోవులు ధనము లేనివాడు, రోగ పీడితుడు, స్వజనులు లేనివాడు, జగడములతో బాధపడువాడగును.

**రవి–బుధ గురు యోగఫలము**

**బుధ జీవార్క సంయోగే నేత్రరోగీ మహాధనీ**
**శాస్త్రశిల్పకలాభిజ్ఞో లిపికర్తా భవేన్నరః 6**

రవి–బుధ–గురు యోగములో మనుష్యుడు నేత్రరోగి, మహాధని శస్త్ర శిల్పకళలను తెలిసినవాడు లిపికారుడగును.

**రవి-బుధ-శుక్ర యోగఫలము**

**శుక్ర సూర్య బుధైర్యోగే గురువర్గే సమావృతః**
**అభిశస్తో దిశోయాతి స్త్రీహేతోస్తప్తమానసః** **7**

రవి బుధ శుక్రుల యోగములో జాతకుడు గురుకార్యములను చేయువాడు, ఉత్తముడు, సన్మార్గమున నడచువాడు. స్త్రీ వలన బాధనుపొందువాడగును.

**రవి-బుధ-శని యోగఫలము**

**శని సూర్య బుధైర్యోగే దురాచారః పరాజితః**
**బన్ధుభిశ్చ పరిత్యక్తో విద్వేషీ జాయతే నరః** **8**

రవి-బుధ-శనుల సంయోగములో మనుష్యుడు దురాచారి, పరాజయమును పొందువాడు, సోదరులచే విడువబడువాడు అందరితో వైరమును పొందువాడగును.

**రవి-శక్ర-గురు యోగఫలము**

**శుక్ర జీవార్క సంయోగే రాజమన్త్రీ చ నిర్ధనః**
**దుష్ట చక్షుశ్చ శూరశ్చ ప్రాజ్ఞశ్చ పరకర్మకృత్** **9**

రవి-శుక్ర-గురుల యోగములో మనుష్యుడు రాజుకు మంత్రి, ధనహీనుడు దుష్ట నేత్రములు కలవాడు, శూరుడు, బుద్ధిమంతుడు, ఇతర పనులుచేయువాడగును.

**రవి-శని-గురు యోగఫలము**

**మన్దజీవార్క సంయోగే పుత్రమిత్ర కలత్రవాన్**
**నిర్భయో నృపనిష్ఠశ్చ ద్వేష్యో బన్ధుజనస్య చ** **10**

రవి, శని, గురు యోగములో మనుష్యుడు పుత్రులు, మిత్రులు స్త్రీలతో కూడినవాడు, నిర్భయుడు, రాజభక్తుడు, సోదరులకు విరోధి యగును.

**రవి-శుక్ర-శని యోగఫలము**

**శనిశుక్రార్క సంయోగే కలామాన వివర్జితః**
**కుష్ఠీ శత్రుజయోద్విగ్నో దురాచారీ నరోభవేత్** **11**

రవి-శని-శుక్ర సంయోగములో మనుష్యుడు కళలను అభిమానమును వదిలినవాడు, కుష్ఠి, శత్రువులను జయించు కోరిక కలవాడు దురాచారుడగును.

**చంద్ర-కుజ-బుధ యోగఫలము**

**చన్ద్ర చన్ద్రి కుజైర్యోగే నీచాచారశ్చ పాపకృత్**
**ఆజీవికాహతో లోకే బన్ధుహీనశ్చ జాయతే** **12**

చంద్ర కుజ బుధుల యోగములో ఆచారరహితుడు, పాపి, జీవితాంతము కష్టమును పొందువాడు బంధుహీనుడగును.

**చంద్ర-కుజ-గురు యోగఫలము**

**చన్ద్ర భౌమేజ్య సంయోగే స్త్రీలోలో వ్రణసంయుతః**
**కాన్తశ్చ సంమతః స్త్రీణాం చన్ద్రతుల్యముఖో భవేత్ 13**

చంద్ర కుజ గురుయోగములో స్త్రీలందాసక్తి కలవాడు, గాయములతోనున్నవాడు. మనోహరుడు, స్త్రీలకు ప్రియుడు చంద్రసమానమైన ముఖము కలవాడగును.

**చంద్ర-కుజ-శుక్ర యోగఫలము**

**చన్ద్రారభృగు సంయోగే దుఃశీలాయాః పతిః సుతః**
**సదా భ్రమణశీలశ్చ శీతభీతోఽపి జాయతే 14**

చంద్రుడు, కుజుడు, శుక్రుడు సంయోగములోనున్న మనుష్యుడు దుశ్శీలస్త్రీకి పతిలేక తల్లికి సుతుడగును ఎల్లప్పుడు తిరుగుతుండు వాడు, చలికిభయపడువాడగును.

**చంద్ర-కుజ-శని యోగఫలము**

**శనిచన్ద్ర కుజైర్యోగే బాల్యేచ మృతమాతృకః**
**క్షుద్రశ్చ లోక విద్విష్టో విషయో జాయతే నరః 15**

చంద్ర-శని-కుజల యోగములో మనుష్యునికి బాల్యములోనే తల్లి మరణించును. చెడుప్రవర్తన కలవాడు, లోకవిరోధి, కుటిలమనస్తత్వము కలవాడగును.

**చంద్ర బుధ గురు యోగఫలము**

**జీవచన్ద్ర బుధైర్యోగే తేజస్వీ ధనవానపి**
**పుత్రిమిత్రాది సంయుక్తో వాగ్మీ ఖ్యాతశ్చ కీర్తిమాన్ 16**

చంద్ర-బుధ గురు యోగములో తేజస్వి, ధనవంతుడు, పుత్రమిత్రాదులతో కూడినవాడు, వాక్చాతుర్యము కలవాడు కీర్తిమంతుడగును.

**చంద్ర-బుధ-శుక్ర యోగఫలము**

**బుధేన్దుభార్గవైర్యోగే విద్యయా సంయుతో నరః**
**సేర్ష్యో ధనాతిలోభీచ నీచాచారశ్చ జాయతే 17**

చంద్ర బుధ శుక్ర యోగములో విద్యతో కూడినవాడు, ఈర్ష్యాళువు, ధన విషయములో లోభి, నీచప్రవర్తన కలవాడగును.

**చంద్ర-బుధ-శని యోగఫలము**

**బుధేన్దు మన్ద సంయోగే ప్రాజ్ఞో భూపతిపూజితః**
**అత్యుచ్చో విపులాఙ్గశ్చ వాగ్మీ భవతి మానవః 18**

చంద్ర బుధ శనియోగములో మనుష్యుడు బుద్ధిమంతుడు, రాజపూజితుడు ఉన్నతమైన దృఢమైన అంగములు కలవాడు, వాక్చాతుర్యము కలవాడగును.

**చంద్ర-గురు-శుక్ర యోగఫలము**

**చన్ద్రేజ్య శుక్రసంయోగే సాధ్వీపుత్రశ్చ పణ్డితః**
**సాధుః సర్వకలాభిజ్ఞః సుభగో జాయతే నరః** **19**

చంద్ర గురు శుక్ర యోగములో పతివ్రతమైన స్త్రీకి పుత్రుడు విద్వాంసుడు శాంతుడు, సకల కళాప్రవీణుడు సుందరుడు ఐశ్వర్యము కలవాడగును.

**చంద్ర-గురు-శని యోగఫలము**

**చన్ద్రేజ్య శనిభిర్యోగే నీరోగః స్త్రీరతోనరః**
**శాస్త్రార్థవిజ్ఞో నీతిజ్ఞో గ్రామపత్తన పాలకః** **20**

చంద్ర గురు శనుల యోగములో రోగరహితుడు, స్త్రీయందాసక్తి కలవాడు శాస్త్రార్థములో నిపుణుడు నీతిని తెలిసినవాడు, గ్రామములు, పట్టణములకు పాలకుడగును.

**చంద్ర శుక్ర రవి యోగఫలము**

**రవిశుక్రేన్దు సంయోగే లిపికర్తా చ వేదవిత్**
**పురోహిత కులోత్పత్తిర్భవేత్పుస్తకవాచకః** **21**

రవి, శుక్ర, చంద్ర యోగములో మనుష్యుడు లేఖకుడు వేదములను తెలిసినవాడు, పురోహిత కులములో జన్మించినవాడు. పుస్తకములను చదువువాడగును.

**కుజ బుధ గురు యోగఫలము**

**జీవ భౌమ బుధైర్యోగే సుకవిర్యువతీపతిః**
**పరోపకార కృత్తీక్ష్ణో గాన్ధర్వకుశలో భవేత్** **22**

కుజ బుధ గురు యోగములో మంచి, కవి, సుందర స్త్రీకి పతి. ఇతరులకు ఉపకారము చేయువాడు తీక్ష్ణమైన వాడు, గాంధర్వవిద్యా నిపుణడగును.

**కుజ బుధ శుక్ర యోగఫలము**

**భృగుభౌమ బుధైర్యోగే వికలాఙ్గశ్చ చఞ్చలః**
**అకులీనః సదోత్సాహీ దృప్తశ్చ ముఖరో నరః** **23**

శుక్ర కుజ బుధ యోగములో మనుష్యుడు వికృతాంగములు కలవాడు, చంచలస్వభావుడు, కులహీనుడు, ఎల్లప్పుడు ఉత్సహాముగానుండువాడు అభిమాని వాచాలుడగును.

**కుజ-గురు-బుధో యోగఫలము**

**జీవకావ్య కుజైర్యోగే దివ్యనారీయుతః సుఖీ**
**సర్వానన్దకరో లోకే జాయతే నృపతిప్రియః** **24**

కుజ గురు బుధ యోగములలో మనుష్యుడు సుందరమైన స్త్రీ కలవాడు

సుఖవంతుడు, అన్ని ఆనందములను పొందువాడు రాజుకు ప్రియుడగును.

**కుజ - బుధ - శని యోగఫలము**

**బుధ మన్ద కుజైర్యోగే ప్రవాసీ నేత్రరోగవాన్**
**ప్రేష్యో వదనరోగీ చ హాస్యలుబ్ధో భవేన్నరః 25**

బుధ, శని, కుజయోగములో మనుష్యుడు ప్రవాస జీవితము గడపువాడు నేత్రరోగి, దూతకార్యమును చేయువాడు, ముఖరోగి, హాస్యప్రియుడగును.

**కుజ-గురు శని యోగఫలము**

**మన్ద జీవార సంయోగే కుష్ఠాఙ్గో రాజసమ్మతః**
**నీచాచారో నిర్ఘృణశ్చ భవేన్మిత్రైర్విగర్వితః 26**

కుజ గురు శని యోగములో కుష్ఠ యుక్తమైన శరీరము కలవాడు రాజుకు ప్రియుడు, నీచాచారము కలవాడు, సిగ్గులేనివాడు, మిత్రులచే నిందింపబడువాడగును.

**కుజ-శుక్ర-శని యోగఫలము**

**భృగుమన్దకుజైర్యోగే దుఃశీలాయాః పతిః సుతః**
**ప్రవాసశీలో దుఃఖీ చ జాయతే జాతకః సదా 27**

శుక్ర శని కుజ యోగములో దుశ్శీలయైన స్త్రీకి భర్త, దుశ్శీల మాతకు పుత్రుడు ప్రవాసశీలుడు, సదా దుఃఖమునుపొందువాడగును.

**బుధ-గురు-శుక్ర యోగములు**

**బుధేజ్యభృగుసంయోగే సుతనుర్నృపపూజితః**
**క్షతారి ర్దీర్ఘకీర్తిశ్చ సత్యవాదీ భవేన్నరః 28**

బుధ, గురు శుక్ర యోగములో మంచి శరీరము కలవాడు రాజపూజితుడు శత్రువులకు నష్టము కలుగజేయువాడు. అధిక కీర్తికలవాడు సత్యవాదియగును.

**బుధ-గురు-శని యోగఫలము**

**బుధార్కిజీవసంయోగే సుదారో బహుభోగవాన్**
**ధనైశ్వర్యయుతః ప్రాయః సుఖధైర్యయుతో భవేత్ 29**

బుధ శని గురు యోగములో సుందరమైన స్త్రీ కలవాడు, అధికరోగి, ధనము ఐశ్వర్యము కలవాడు, తరచుగా సుఖము ధైర్యములతోనుండువాడగును.

**బుధ-శుక్ర-శని యోగఫలము**

**మన్దశుక్రబుధైర్యోగే ముఖరః పరదారకః**
**అసజ్జత్యకలాభిజ్ఞః స్వదేశనిరతో భవేత్ 30**

శని-శుక్ర బుధ యోగములో మనుష్యుడు అధికముగా మాట్లాడువాడు పరస్త్రీరతుడు, చెడు సహవాసము చేయువాడు కళలను తెలియనివాడు ఎప్పుడు తనదేశములోనే నివసించువాడగును.

**గురు–శుక్ర–శని యోగఫలము**

**మన్దేజ్యభృగుసంయోగే రాజాభవతి కీర్తిమాన్**
**నీచ వంశాఽపి సమ్భూతః శాలయుక్తో నృపోభవేత్ 31**

శని గురు శుక్రుల యోగములో కీర్తిమంతుడు, రాజువలె గౌరవనీయుడు, నీచవంశములో ఉత్పన్నమైనప్పటికి సుశీలుడు రాజుయగును.

**శుభగ్రహ ప్రాపగ్రహ యోగఫలము**

**ప్రాయః పాపైర్యుతే చన్ద్రే మాతుర్నాశో రవౌపితుః**
**శుభగ్రహైః శుభం వాచ్యం మిశ్రితైర్మిశ్రితం ఫలమ్ 32**
**శుభాస్త్రయో గ్రహాయుక్తాః కుర్వన్తి సుఖినం నరమ్**
**పాపాస్త్రమో దుఃఖినం చ దుర్వినీతం విగర్హితమ్ 33**

తరుచుగా పాపగ్రహములతో కూడిన చంద్రుడు తల్లికి నాశము పాపగ్రహములతో కూడిన సూర్యుడు తండ్రికి నాశము కలిగించును రెండు శుభగ్రహముల యోగములో శుభఫలము, ఒక పాపగ్రహము ఒక శుభగ్రహము యోగములోనున్న మిశ్రఫలితము కలుగును మూడు శుభ గ్రహముల యోగమున్న మనుష్యునికి శుభము కలుగును మూడు పాపగ్రహముల యోగములో దుఃఖముతో, నమ్రతాహీనుడై, నిందితుడగును.

**ఇతి శ్రీసర్వశాస్త్ర విశారద శ్రీకాశినాథ కృతే జాతక లగ్నచన్ద్రికాయాం త్రిగ్రహయోగో నామ పఞ్చమ పరిచ్ఛేదః**

**ఇది శ్రీ సర్వశాస్త్ర విశారదుడైన శ్రీకాశినాథ కృత జాతకలగ్న చంద్రికయందు త్రిగ్రహయోగనామము గల పంచమ పరిచ్ఛేదము.**

--- oOo ---

# షష్ఠ పరిచ్ఛేదము - 6

# చతుర్గ్రహ యోగఫలము

**రవి–చంద్ర–కుజ–బుధ యోగఫలము**

**చన్ద్రచన్ద్రి కుజార్కాణాం యోగే లిపికరోభవేత్**
**తస్కరో ముఖరో వాగ్మీ మాయాయాంకుశలో భిషక్** **1**

చంద్ర, బుధ, కుజ, రవి యోగములో మనుష్యుడు లేఖకుడు, దొంగ, అధికముగా మాట్లాడువాడు. యుక్తియుక్తముగా మాట్లాడువాడు మాయచేయుటయందు నిపుణుడు, వైద్యుడగును.

**రవి–చంద్ర–కుజ–గురు యోగఫలము**

**భౌమ భాస్కర చన్ద్రేజ్యప్రసజ్గే నిపుణో ధనీ**
**తేజస్వీ గతశోకశ్చ నీతిజ్ఞశ్చ భవేన్నరః** **2**

రవి, కుజ, చంద్ర గురుల యోగములో నిపుణుడు, ధని, తేజస్వి శోకరహితుడు నీతిజ్ఞుడగును.

**రవి–చంద్ర–కుజ శుక్ర యోగఫలము**

**సూర్యేన్దు భౌమశుక్రాణాం యోగే విద్యార్థసంగ్రహీ**
**సుఖీ పుత్రీ కలత్రీచ వాగ్వృత్తిర్మనుజో భవేత్** **3**

రవిచంద్ర కుజ శుక్ర యోగములో మనుష్యుడు విద్యాద్రవ్యములు సంగ్రహించువాడు, సుఖి, పుత్రవంతుడు, భార్యకలిగినవాడు, వాణినే వృత్తిగా చేసి కొన్నవాడగును.

**రవి–చంద్ర–కుజ–శని యోగఫలము**

**అర్కార్కిశశిభౌమానాం యోగే మూర్ఖశ్చనిర్ధనః**
**హ్రాస్వో విషమదేహశ్చ భిక్షావృత్తిర్భవేన్నరః** **4**

రవి శని చంద్ర కుజ యోగములో మూర్ఖుడు నిర్ధనుడు హ్రస్వము విషమ దేహముకలవాడు భిక్షావృత్తి చేయువాడగును.

**రవి–చంద్ర బుధ గురు యోగఫలము**

**శశిసౌమ్యార్కజీవానాం యోగే శిల్పకరోధనీ**
**సౌవర్ణికః ప్లుతాక్షశ్చ రోగహీనశ్చ జాయతే** **5**

చంద్ర, రవి, బుధ, గురు యోగములో శిల్పకారుడు, ధని, సుందరమైన వర్ణముకలవాడు (సువర్ణవ్యాపారము చేయువాడు) నీటితో కూడిన నేత్రములవాడు రోగహీనుడగును.

**రవి-చంద్ర-బుధ-శుక్ర యోగఫలము**

**చన్ద్రార్క బుధశుక్రణాం యోగే చ సుభగో నరః**
**హ్రస్వశ్చ రాజమాన్యశ్చ వాగ్మీ చ వికలోభవేత్** **6**

చంద్ర రవి బుధ శుక్ర యోగములో సౌభాగ్యవంతుడు, హ్రస్వశరీరుడు రాజులచే గౌరవించబడువాడు, మాటలు పలుకుటలో నిపుణుడు, వికలు(కొన్ని అంగములేనివాడు)డగును.

**రవి-చంద్ర-బుధ శనియోగఫలము**

**అర్కార్కి చన్ద్ర చన్ద్రీణాం యోగేభిక్షాశనో నరః**
**వియుక్తః పితృమాతృభ్యో వికలాక్షశ్చనిర్ధనః** **7**

రవి, శని, చంద్ర, బుధుల యోగములో భిక్షావృత్తి చేయువాడు మాతాపితలకు దూరముగా నుండువాడు, వికల నేత్రములు కలవాడు దరిద్రుడగును.

**రవి-చంద్ర-గురు-శుక్ర యోగఫలము**

**సూర్య చన్ద్రేజ్యశుక్రాణాం సంయోగే రాజపూజితః**
**జలారణ్య మృగస్వామీ నరః స్యాన్నిపుణః సుఖీ** **8**

రవి చంద్ర గురు శుక్ర యోగములో రాజపూజ్యుడు, జల, వనమృగములకు స్వామి, నిపుణుడు సుఖవంతుడగును.

**రవి-చంద్ర-గురు-శని యోగఫలము**

**సూర్యచన్ద్రార్కిజీవానాం మాన్యశ్చ వనితాప్రియః**
**బహువిత్తసుతస్తీక్ష్ణః సమాక్షశ్చ ప్రజాయతే** **9**

రవి, చంద్ర, శని, గురుల యోగములో గౌరవనీయురాలైన స్త్రీకి ప్రియుడు అధిక ద్రవ్యము, పుత్రులు కలవాడు, తీక్ష్ణమైన సమానమైన నేత్రములు కలవాడగును.

**రవి-చంద్ర-శుక్ర-శని యోగఫలము**

**సితార్కజరవీన్దూనాం యోగే చాత్యన్తదుర్బలః**
**వనితాసదృశాచారో భీరురగ్రేసరోనరః** **10**

శుక్ర శని రవి చంద్రుల యోగములో అత్యంత దుర్బలుడు, స్త్రీ సమానము ఆచారనిర్వరహణ చేయువాడు, భయముకలిగినవాడు ముందు నడచువాడగును.

**రవి-కుజ-బుధ-గురు యోగఫలము**

**బుధార్క కుజ జీవానాం యోగే సూత్రకరోనరః**
**పరదారరతః శూరో దుఃఖీ చక్రధరోభవేత్** **11**

బుధ, రవి, కుజ, గురుల యోగములో సూతకార్యమును చేయువాడు పరస్త్రీరతుడు, శూరవీరుడు, దుఃఖి చక్రమును ధరించువాడగును.

**రవి-చంద్ర-కుజ-శుక్ర యోగఫలము**

**రవిశుక్ర కుజేన్దూనాం సంయోగే పారదారికః**
**నిర్లజ్జో దుర్జనశ్చౌరో విషమాఙ్గో జనోభవేత్ 12**

రవి శుక్ర కుజ చంద్రుల యోగములో పరస్త్రీరతుడు, నిర్లజ్జుడు దుర్బలుడు, దొంగ, విషమ అంగములు కలవాడగును.

**రవి-కుజ-బుధ-శని యోగఫలము**

**అర్కార్కి బుధభౌమానాం యోగే యోద్ధా కవిర్జనః**
**మన్త్రీ చమూపతిస్తీక్ష్ణో నీచాచారశ్చ జాయతే 13**

రవి శని బుధ కుజ యోగములో యోధుడు, కవి, మంత్రి, సేనాపతి, తీక్ష్ణమైన నీచమైనవ్యవహారము చేయువాడగును.

**రవి-కుజ-గురు-శుక్ర యోగఫలము**

**భౌమార్క జీవశుక్రాణం యోగే పూజ్యో ధనీ జనః**
**సుభగో నృపమాన్యశ్చ ఖ్యాతో భవతి నీతిమాన్ 14**

కుజ, రవి, గురు, శుక్ర యోగములో పూజ్యుడు, ధని, ఐశ్యర్యవంతుడు రాజులకు పూజ్యుడు, ప్రసిద్ధుడు నీతిమంతుడగును.

**రవి-కుజ-గురు-శని యోగఫలము**

**భానుభానుజ జీవారైరేకస్థైర్గణనాయకః**
**సోన్మాదోనృపమాన్యశ్చ సిద్ధార్థో జాయతే నరః 15**

రవి, శని, గురు, కుజుల యోగములో మనుష్యుడు ప్రజలకు నాయకుడు ఉన్మాదముకలవాడు, రాజులచే గౌరవింపబడువాడు, కార్యములను చేయుటలో నిపుణుడగును.

**రవి-కుజ-శుక్ర శని యోగఫలము**

**మన్దమార్తణ్డ శుక్రారైః సంయుక్తైర్జాయతే జనః**
**లోకద్వేష్టా సమాక్షశ్చ నీచాచారో జడాకృతిః 16**

శని, రవి, శుక్ర, కుజ, యోగములో లోకమునకు వ్యతిరేకి సమానమైన నేత్రములు కలవాడు, నీచ ఆచరణకలవాడు జడాకృతికలవాడగును.

**రవి-బుధ-గురు-శుక్ర యోగఫలము**

**జీవశుక్ర బుధార్కాణాం యోగే బహుమతిర్జనః**
**ధనీ సుఖీచ సిద్ధార్థః ప్రగల్భశ్చ ప్రజాయతే 17**

గురు, శుక్ర, బుధ, రవి యోగములో అధిక బుద్ధిశాలి, ధని, సుఖి, ప్రయోజనమును పొందువాడు ప్రగర్భములు పలుకువాడగును.

**రవి-బుధ-గురు-శని యోగఫలము**

**అర్కార్కిబుధ దేవేజ్యైరేకరాశిస్థితేర్నరః**
**భ్రాతృమాన్ కలహీ మానీ క్లీబాచారీనిరుద్యమః** **18**

రవి, బుధ, గురు, శని యోగములో మనుష్యుడు సోదరులతో కూడినవాడు జగడములాడువాడు నపుంసకునివలె ప్రవర్తించువాడు ఉద్యమహీనుడగును.

**రవి-బుధ-శుక్ర-శని యోగఫలము**

**శుక్రం సౌరి బుధార్కాణాం యోగే మిత్రయుతః శుచిః**
**ముఖరః సుభగః ప్రాజ్ఞో రాజప్రీతో భవేన్నరః** **19**

శుక్ర, బుధ, రవి, శనుల యోగములలో మిత్రులతో కూడినవాడు పవిత్రుడు వాచాలుడు సౌభాగ్యవంతుడు అతిబుద్ధిమంతుడు రాజ పూజ్యుడగును.

**రవి-గురు-శుక్ర-శని యోగఫలము**

**సూర్యసౌరి సితేజ్యానాం సమ్బన్ధేభోగమానవాన్**
**కవిః కారుకనాథశ్చ రాజప్రీతో భవేన్నరః** **20**

రవి, శని, శుక్ర గురు యోగములో భోగములు కలవాడు అభిమానముకలవాడు, కవి, కార్మికులకు స్వామి రాజగౌరవమును పొందువాడగును.

**చంద్ర-కుజ-బుధ-గురు యోగఫలము**

**చన్ద్రచన్ద్రికుజేజ్యానాం యోగే శాస్త్ర విచక్షణః**
**నరేన్ద్రస్య మహామన్త్రీ మహాబుద్ధిర్నరోభవేత్** **21**

చంద్ర, బుధ, కుజ, గురుల యోగములో శాస్త్ర నిపుణుడు, రాజుకు మహామంత్రి మహాబుద్ధిమంతుడగును.

**చంద్ర-కుజ-బుధ శుక్ర యోగఫలము**

**భౌమేన్దు బుధ శుక్రాణామన్వయే బన్ధకీపతిః**
**నిద్రాలుః కలహీ నీచో బన్ధుద్వేషీ జనోభవేత్** **22**

కుజ, చంద్ర, బుధ, శుక్ర యోగములో వంధ్యురాలైన స్త్రీకి స్వామి నిద్రాసక్తుడు, జగడములాడువాడు, నీచుడు సోదరులకు వైరియగును.

**చంద్ర-కుజ-బుధ-శని యోగఫలము**

**భౌమేన్దు బుధసౌరీణాం యోగే శూరకులోద్భవః**
**పుత్రమిత్ర కలత్రీ చ ద్విమాతృపితృకో జనః** **23**

కుజ-చంద్ర-బుధ-శనుల యోగములో వీరకులములో జన్మించినవాడు పుత్రవంతుడు, మిత్రులు భార్యకలవాడు మాతాపితలు కలవాడగును.

**చంద్ర-కుజ-గురు-శుక్ర యోగఫలము**

**చన్ద్రారగురుశుక్రాణాం యోగే సాహసికో నరః**
**వికలాఙ్గో ధనీపుత్రీ మానీ ప్రాజ్ఞోఽపిజాయతే** **24**

చంద్ర, కుజ, గురు, శుక్ర యోగములో సాహసవంతుడు, వికలాంగములు కలవాడు, ధని, పుత్రవంతుడు బుద్ధిమంతుడగును.

**చంద్ర-కుజ-గురు శని యోగఫలము**

**భౌమేన్దు జీవమన్దానామన్వయే బధిరోఽధనః**
**సోన్మాదః స్థిరవాక్యశ్చ శూరో విజ్ఞో భవేన్నరః 25**

కుజ, చంద్ర, గురు, శని యోగములో బధిరుడు (చెవిటివాడు) నిర్ధనుడు ఉన్మాదయుక్తుడు, స్థిరవచనములు పలుకువాడు, శూరుడు వీరుడు విద్వాంసుడగును.

**చంద్ర-కుజ-శుక్ర-శని యోగఫలము**

**చన్ద్రార శుక్రమన్దానాం మిలనే కులటాపతిః**
**సోద్వేగః సర్వతుల్యాక్షః ప్రగల్భో జాతకో నరః 26**

చంద్ర, కుజ, శుక్ర, శని యోగములో మనుష్యుడు కులటకుపతి, ఉద్వేగము కలవాడు, సర్ప సమానమైన నేత్రములు కలవాడు ప్రగర్భముల పలుకువాడగును.

**చంద్ర-బుధ-గురు-శుక్ర యోగఫలము**

**జీవశుక్ర బుధేన్దూనామన్వయే శుభగో ధనీ**
**ద్విమాతృపితృకః ప్రాజ్ఞో గతారిర్జాయతే నరః 27**

చంద్ర-బుధ-గురు-శుక్ర యోగములో మనుష్యుడు సౌభాగ్యవంతుడు, ధని, రెండుతల్లులు తండ్రులు కలవాడు విద్వాంసుడు శత్రువులులేనివాడగును.

**చంద్ర-బుధ-గురు-శనియోగఫలము**

**బుధేన్దుగురుమన్దానాం యోగే మాత్రా వివర్జితః**
**త్వగ్దోషీ సుభగో దుఃఖీ బహుభార్యో భవేన్నరః 28**

బుధ చంద్ర గురు శని యోగములో మనుష్యుడు తల్లి లేనివాడు చర్మరోగము కలవాడు, సౌభాగ్యవంతుడు, ఐశ్వర్యవంతుడు, దుఃఖి, అధికమైన భార్యలు కలవాడగును.

**చంద్ర-బుధ-గురు-శనియోగఫలము**

**మన్దేజ్యచన్ద్ర చన్దీణాం యోగే బన్ధుప్రియః కవిః**
**తేజస్వీ రాజమన్త్రీ చ యశోధర్మయుతోనరః**

శని, గురు, చంద్ర, బుధ యోగములో సోదరులకు ఇష్టమైనవాడు తేజస్వి, రాజుకుమంత్రి, కీర్తిమంతుడు ధర్మవంతుడగును.

**చంద్ర-గురు-శుక్ర-శని యోగఫలము**

**చన్ద్రేజ్యసితసౌరీణామన్వయే పరదారికః**
**ప్రాజ్ఞో నిర్ద్రవ్యబన్ధుశ్చ స్థూలభార్యోనరః స్మృతః 30**

చంద్రగురు శుక్ర శనియోగములో పరాయిస్త్రీతో ప్రేమ కలిగినవాడు బుద్ధిమంతుడు, ద్రవ్యహీనుడు, సోదరులు కలవాడు, స్థూలముగానున్న భార్యకలవాడగును.

**కుజ-బుధ-గురు, శుక్ర యోగఫలము**

**బుధార భృగుజీవానాం యోగే స్త్రీ కలహప్రియః**
**ధనీ సుశీలో నీరోగీలోక పూజ్యోనరోభవేత్ 31**

బుధ, కుజ, శుక్ర గురు యోగములో స్త్రీతో జగడమాడువాడు, ధని, సుశీలుడు, రోగరహితుడు లోకములో గౌరవింపబడువాడగును.

**కుజ-బుధ-గురు-శని యోగఫలము**

**భౌమేజ్య సౌమ్యసౌరీణాం యోగే శూరశ్చ నిర్ధనః**
**సత్యశౌచయుతో విద్వాన్ వాదీ వాగ్మీ నరోభవేత్ 32**

కుజ గురు బుధ శని యోగములో శూరుడు, ద్రవ్యహీనుడు, సత్యము పలుకువాడు, శుచి శుభ్రము కలవాడు విద్వాంసుడు వాదముచేయువాడు మాట్లాడుటలోనిపుణుడగును.

**కుజ-బుధ-శుక్ర-శని యోగఫలము**

**భౌమజ్ఞభృగుమన్దానాం సారమేయరుచిర్భవేత్**
**మల్లోஉన్య పుష్టో యోద్ధా చ దృఢాఙ్గో జాయతే నరః 33**

బుధ, కుజ, శని, శుక్రయోగములో కుక్కవలె అభిరుచి కలిగినవాడు మల్లుడు ఇతరులకన్న పుష్టిగానుండువాడు బలమైన అంగములు కలవాడగును.

**కుజ-గురు-శని-శుక్ర యోగఫలము**

**భౌమజీవార్కి శుక్రాణాం మిలనే సాహసప్రియః**
**ధనీ సతేజాః స్త్రీలోలః కితవో జాయతే నరః 34**

కుజ-గురు-శని-శుక్ర యోగములో సాహస కార్యములందాసక్తి కలవాడు, తేజోవంతుడు, స్త్రీవలె చంచలమైన మనస్సు కలవాడు ధూర్తపురుషుడగును.

**బుధ-గురు-శుక్ర-శని యోగఫలము**

**బుధేజ్యభృగుమన్దానాం యోగే కామాతురో నరః**
**విధేయభృత్యో మేధావీ తీక్ష్ణః శాస్త్రరతో భవేత్ 35**

బుధ, గురు, శుక్ర శనియోగములో కామాతురుడు విధేయులైనసేవకులు కలవాడు, బుద్ధిమంతుడు, తీక్ష్ణమైనవాడు శాస్త్రమునందాసక్తి కలవాడగును.

**ఇవి శ్రీసర్వశాస్త్రవిశారద శ్రీకాశీనాథకృతౌ**
**జాతకలగ్నచన్ద్రికాయాం చతుర్గ్రహ యోగోనామ షష్ఠః పరిచ్ఛేదః**

**ఇది శ్రీ సర్వశాస్త్ర విశారదుడైన శ్రీ కాశీనాథకృత జాతకలగ్నచంద్రికలో చతుర్గ్రహయోగనామక షష్ఠమ పరిచ్ఛేదము.**

--- oOo ---

# సప్తమ పరిచ్ఛేదము - 7

## పంచగ్రహ యోగఫలము

**రవి-చంద్ర-కుజ-బుధ యోగఫలము**

**బహుప్రపఞ్చో దుఃఖీ చ జాయావిరహతాపితః**
**సూర్యాద్యైర్జీవపర్యన్తైర్నరః స్యాత్పఞ్చభిర్గ్రహైః** **1**

రవి, చంద్ర, కుజ బుధ, గురు, యోగములో పురుషుడు మాయావి దుఃఖి స్త్రీవిరహముతో బాధపడువాడగును.

**ర-చం-కు-బు-శు-యోగఫలము**

**గతసత్యో బన్ధుహీనః పరకర్మకరోనరః**
**క్లీబస్యచ సఖాసూర్యశ్చన్ద్రార బుధభార్గవైః** **2**

రవి, చంద్ర, కుజ, బుధ, శుక్ర యోగములో సత్యమును పలుకువాడు బంధుహీనుడు, ఇతరుల పనులను చేయువాడు నపుంసకుడగును.

**ర-చం-కు-బ-శ యోగఫలము**

**అల్పాయుర్వికలత్రశ్చ దుఃఖీ సుతవివర్జితః**
**అర్కార్కి బుధ చన్ద్రారైర్యోగే బన్ధనభాగపి** **3**

రవి, శని, బుధ, చంద్ర, కుజ, యోగములో స్వల్పాయువు కలవాడు స్త్రీహీనుడు, దుఃఖి, పుత్రరహితుడు, బంధింపబడువాడగును.

**ర-చం-కు-గు-రు యోగఫలము**

**గతాన్ధో బహుదుఃఖీ చ పితృమాతృవివర్జితః**
**గానప్రీతో నరోభౌమభానుచన్ద్రేజ్యభార్గవైః** **4**

కుజ, రవి, చంద్రు, గురు, శుక్ర యోగములో పుట్టుకతో అంధుడు అధికమైన దుఃఖము కలవాడు మాతాపితలు లేనివాడుగాన ప్రియుడగును.

**ర-చం-కు-గు-శు యోగఫలము**

**పరద్రవ్యరతో యోద్ధా పరతాపకరః ఖలః**
**సమర్థో జాయతే మన్దచన్ద్రజీవార్కభూసుతైః** **5**

రవి, చంద్ర, కుజ, గురు, శనుల యోగములో ఇతరుల ద్రవ్యమును హరించువాడు యోధుడు ఇతరులకు దుఃఖమును కలిగించువాడు దుష్టుడు సమర్థుడగును.

**ర-చం-కు-శు-శ యోగఫలము**

**మానాచార ధనైర్హీనః పరదారరతో నరః**
**ఏకస్థైర్జాయతే భానుభౌమేన్దుశని భార్గవః** **6**

రవి-కుజ-చంద్ర శని శుక్ర యోగములో అభిమాన, ఆచార ధనహీనుడు, పరస్త్రీయందాసక్తి కలవాడగును.

**ర-చం-బు-గు-శు యోగఫలము**

**రాజమన్త్రీ భూరివిత్తో యన్త్రజ్ఞో దణ్డనాయకః**
**ఖ్యాతో జనో యశస్వీచ జీవార్క జ్ఞేన్దుభార్గవైః** **7**

గురు, రవి, బుధ, చంద్ర, శుక్ర యోగములో రాజుకు మంత్రి, అధిక ద్రవ్యము కలవాడు, యంత్రములను తెలిసినవాడు, దండనాయకుడు, ప్రసిద్ధుడు గౌరవము కలవాడగును.

**ర-చం-బు-గు-శ యోగఫలము**

**పరాన్నభోజీ సోన్మాదః ప్రియతప్తశ్చ వఞ్చకః**
**ఉగ్రో భీరుర్నరః సూర్యశనిచన్ద్రేజ్యచన్ద్రజైః** **8**

రవి, శని, చంద్ర, గురు, బుధ యోగములో ఇతరుల అన్నమును భుజించువాడు ఉన్మాదుడు, ప్రియమైనవారికి దుఃఖమును కలిగించువాడు, వంచకుడు ఉగ్ర స్వభావముకలవాడు భయపడువాడగును.

**ర-చం-బు-శు-శ యోగఫలము**

**ధనపుత్రి సుఖైర్హీనో మృత్యూత్సాహీ చ లోమశః**
**దీర్ఘో భవతి చన్ద్రార్క బుధ శుక్రశనైశ్చరైః** **9**

చంద్ర, రవి, బుధ, శుక్ర, శనుల యోగములో ధనపుత్ర సుఖహీనుడు మరణించుటకుత్సాహపడువాడు. అధిక రోమములు కలవాడు పొడవైన మనుష్యుడగును.

**ర-చం-గు-శు-శ యోగఫలము**

**ఇన్ద్రజాలరతో వాగ్మీ చలచిత్తో జనప్రియః**
**ప్రాజ్ఞః స్వశత్రుభిర్భీతిః శుక్రేజ్యార్కేన్దుసూర్యజైః** **10**

శుక్ర, గురు, రవి, చంద్ర, శనుల యోగములో ఇంద్రజాల విద్యలో ఆసక్తికలవాడు మనుష్యులకుహితుడు, బుద్ధిమంతుడు, శత్రువుల వలన భయపడువాడగును.

**ర-కు-బు-గు-శు యోగఫలము**

**స్ఫీతో బహుహయః కామీ నరోఽ శోకశ్చమూపతిః**
**బుధార్క కుజ శుక్రేజ్యైః సుభగో భూపతిప్రియః** **11**

బుధ, రవి, కుజ, శుక్ర, గురు యోగములో సమస్తము సమృద్ధిగా కలవాడు అధికముగా గుర్రములు కలవాడు, కాముకుడు, రోగరహితుడు, సేనాపతి సౌభాగ్యవంతుడు రాజప్రియడగును.

**ర-కు-బు-గు-శ యోగఫలము**

**భిక్షాభోగీచ రోగీ చ నిత్యోద్విగ్నో మలీమసః**
**జీర్ణోనరో భానుభౌమ శనిజీవబుధైర్భవేత్ 12**

రవి, కుజ, బుధ, గురు, శని యోగములో భిక్షాటనముచే భోజనము చేయువాడు. రోగి, ఎల్లప్పుడు, భయపడుతుండువాడు, మలినుడు, బలహీన మనుష్యుడగును.

**ర-కు-బు-శు-శ యోగఫలము**

**వ్యాధిభిః శత్రుభిర్గ్రస్తః స్థానభ్రష్టో బుభుక్షితః**
**నరః స్యాద్వికలః శుక్రబుధ మన్దార్క భూసుతైః 13**

శుక్ర, బుధ, శని, రవి, కుజ, యోగములలో వ్యాధి, శత్రువులతో పీడితుడు స్వస్థానమునకు దూరముగా నుండువాడు. ఆకలితోనుండువాడు వికలమనుష్యుడగును.

**ర-కు-గు-శు-శ యోగఫలము**

**విజ్ఞో విచారవాంశ్చైవ ధాతుయన్త్రరసాయనే**
**నరః ప్రసిద్ధో భుపుత్రరవి జీవసితార్కజైః 14**

కుజ, రవి, గురు, శుక్ర, శని యోగములో విద్వాంసుడు, విచారశీలుడు ధాతుయంత్ర రసాయనముల నిర్మాణములో ప్రసిద్ధుడగును.

**ర-బు-గు-శు-శ యోగఫలము**

**మిత్రప్రియః శాస్త్రవేత్తా ధార్మికో గురుసమ్మతః**
**దయాలుః శుక్రసూర్యార్కిబుధ జీవైర్జనో భవేత్ 15**

శుక్ర, రవి, శని, బుధ, గురు యోగములో మిత్రులకు ప్రియుడు శాస్త్రములను తెలిసినవాడు ధార్మికుడు, గురువు సమ్మతిని పొందినవాడు, దయాస్వభావము కలవాడగును.

**చం-కు-బు-గురు-శుక్ర యోగఫలము**

**సాధుః కల్మషహీనశ్చ ధనవిద్యాసుఖాన్వితః**
**బహుమిత్రో నరో జీవభౌమేన్దుబుధ భార్గవైః 16**

గురు, చంద్ర, కుజ, బుధ, శుక్ర యోగములో సాధువు పుణ్యాత్ముడు ధనము విద్యాసుఖములు కలవాడు అధికమిత్రులు కలవాడగును.

**చం-కు-గు-శు-శ యోగఫలము**

**పరాన్నపాచకో నిత్యం దరిద్రీ మలినస్తథా**
**నరోభవతి భౌమేన్దు జీవ శుక్ర శనైశ్చరైః** **17**

కుజ, చంద్ర, గురు, శక్రు, శని యోగములో ఇతరుల అన్నమును భుజించువాడు, సదాదరిద్రుడు మలినమనుష్యుడగును.

**చం-కు-బు-శు-శ యోగఫలము**

**బహూమిత్రారిపక్షశ్చ దుశ్శీలః పరపీడకః**
**మానీ నరః సౌమ్య శుక్ర మన్దధరాసుతైః** **18**

చంద్ర, బుధ, శుక్ర, శని, కుజ యోగములో అధికయైన మిత్రులు శత్రువుల పక్షములోనుండువాడు, దుష్టస్వభావము కలవాడు, ఇతరులను పీడించువాడు అభిమానవంతుడగును.

**చం-బు-గు-శు-శ యోగఫలము**

**రాజమన్త్రీ రాజతుల్యో లోకపూజ్యో గునాధికః**
**చన్ద్ర చన్ద్రజమన్దేజ్య భృగుపుత్రైర్నరో భవేత్** **19**

చంద్ర, బుధ, గురు, శుక్ర, శని యోగములో రాజకు మంత్రి, రాజుతో సమానుడు లోకములో పూజింపబడువాడు అత్యంత గుణవంతుడగును.

**కు-బు-గు-శు-శ యోగఫలము**

**అశోకస్తామసీ నిఃస్వః సోన్మాదో రాజవల్లభః**
**నిద్రాతురో నరో భౌమబుధజీవార్కిభార్గవైః** **20**

కుజ, బుధ, గురు, శుక్ర, శనుల యోగములో శోకములేనివాడు, క్రోధ స్వభావము కలవాడు ద్రవ్యహీనుడు, ఉన్మాద మనస్తత్వముకలవాడు రాజుకు ప్రియుడు, నిద్రయందాసక్తి కలిగినవాడగును.

**ఇతి శ్రీ సర్వశాస్త్ర విశారద శ్రీకాశీనాథకృతౌ**
**జాతకలగ్న చన్ద్రికాయాం పఞ్చగ్రహయోగో నామ సప్తమః పరిచ్ఛేదః**

**ఇది శ్రీ సర్వశాస్త్ర విశారదుడైన శ్రీకాశీనాథకృత జాతక చంద్రికలో**
**పంచగ్రహయోగ నామక సప్తమ పరిచ్ఛేదము**

--- oOo ---

# అష్టమ పరిచ్ఛేదము - 8

## షడ్గ్రహ యోగఫలము

**ర-చం-కు-బు-గు-శు యోగఫలము**

**విద్యాధర్మధనైర్యుక్తో బహుభాషీ చ భాగ్యవాన్**
**సూర్యాద్యైః శుక్రపర్యన్తైర్లాభో భవతిషడ్గ్రహైః** 1

రవి, చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర యోగములో విద్య, ధర్మ, ధనములు కలవాడు అధికముగా మాట్లాడువాడు భాగ్యవంతుడగును.

**ర-చం-కు-బు-గు-శ యోగఫలము**

**పరకర్మరతో దాతా శుద్ధాత్మా చఞ్చలాకృతిః**
**షడ్గ్రహైస్తు వినా శుక్రం రమతే విజనే జనః** 2

రవి, చంద్ర, కుజ, బుధ, గురు, శని యోగములో ఇతరుల పనులు చేయువాడు దాత, మంచి మనసు కలవాడు, చంచలమైన ఆకారము కలవాడు. జనులు లేనిచోటులందు ఆనందమును పొందువాడగును.

**ర-చం-కు-బు, శు-శ యోగఫలము**

**సంశయీ శుభగో మానీ యుద్ధే శత్రువిమర్దకః**
**వినా జీవంగ్రహైః షడ్భిర్వినాదౌ రమతేజనః** 3

రవి, చంద్ర, కుజ, బుధ, శుక్ర, శని యోగములో సంశయము కలవాడు సౌభాగ్యవంతుడు అభిమాని, యుద్ధములో శత్రువులను జయించువాడు, వనములందు చరించువాడగును.

**ర-చం-కు-గు-శు-శ యోగఫలము**

**అర్థప్రియో రణోత్సాహీ పిశునః క్రోధలోభవాన్**
**అర్కార్కిచన్ద్ర భౌమేజ్యభార్గవైః సుభగోనరః** 4

రవి, చంద్ర, కుజ, గురు, శుక్ర, శని యోగములో ద్రవ్యప్రియుడు, రణమునందాసక్తి కలవాడు చాడీలు చెప్పువాడు క్రోధముకలవాడు, లోభి భాగ్యశాలియగును.

**ర-చం-బు-గు-శు-శ యోగఫలము**

**కలత్రహీనో నిర్ద్రవ్యోరాజమన్త్రీక్షమాయుతః**
**రవీన్దుబుధ జీవార్కిభృగుభిః సుభగోనరః** 5

రవి, చంద్ర, బుధ, గురు, శుక్ర, శని యోగములో స్త్రీలేనివాడు ద్రవ్యరహితుడు రాజకు మంత్రి క్షమాగుణము కలవాడు భాగ్యశాలియగును.

**ర-కు-బు-గు-శు-శ యోగఫలము**

**ధనదారసుతైర్హీనస్తీర్థగామీ వనాశ్రితః**
**సూర్యార సౌమ్యజీవార్కి భృగు పుత్రైర్భవేన్నరః** **6**

రవి, కుజ, బుధ, గురు, శుక్ర, శని యోగములో ధనము, స్త్రీ, పుత్రులు లేనివాడు తీర్థములలో చరించువాడు వనమునందు జీవించువాడగును.

**చం-కు-బు-గు-శు-శ యోగపలము**

**ధనీపుత్రీ శుచిర్మన్త్రీ బహుభార్యో నృపప్రియః**
**వినాసూర్య గ్రహైః షడ్భిః ప్రతాపీ జాయతే నరః** **7**

చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శని యోగములో ధని, పుత్రవంతుడు పవిత్రుడు, మంత్రి అధికస్త్రీలుకలవాడు రాజుకు హితుడు ప్రతాపవంతుడగును.

**ర-చం-కు-బు-శు-శ యోగఫలము**

**పరదారరతః కుష్ఠీ స్థానభ్రష్టో నిరాకృతిః**
**మూర్ఖశ్చైవ తు సూర్యారబుధేన్దుశని భార్గవైః** **8**

రవి, కుజ, బుధ, చంద్ర, శని, శుక్ర యోగములో పరస్త్రీయందాసక్తి కలవాడు కుష్ఠిరోగి, భ్రష్టుడు, వికృతమైన శరీరము కలవాడు మూర్ఖుడగును.

**ర-చం-కు-గు-శు-శ యోగఫలము**

**పరకర్మకరో నీచో హృద్రోగీ శ్వాసకాసవాన్**
**నిన్ద్యో నరః సూర్యసోమభౌమజీవసితార్కిభిః** **9**

రవి, చంద్ర, కుజ, గురు, శుక్ర, శని యోగములో ఇతరులకు సేవ చేయువాడు నీచుడు, హృదయరోగము కలవాడు, శ్వాసకోశవ్యాధి కలవాడు నిందితుడగును.

**ఐదు లేక ఆరు గ్రహముల సామాన్య యోగఫలము**

**ప్రాయో దరిద్రో మూర్ఖశ్చ షడ్భిర్వా పఞ్చభిర్గ్రహైః**
**అన్యోన్య దర్శనాత్తేషాం ఫలమేతత్ప్రకీర్తితమ్** **10**

ఆరు లేక ఐదు గ్రహముల యోగములో మనుష్యుడు దరిద్రుడు మూర్ఖుడగును. పరస్పరము గ్రహముల దృష్టిసంబంధమున్న ఈ ఫలితము కలుగును.

**ఇతి శ్రీసర్వశాస్త్ర విశారద శ్రీనాథ కృతౌ**
**జాతకలగ్న చన్ద్రికాయాం షడ్గ్రహయోగోనామ అష్టమః పరిచ్ఛేదః - 8**

**ఇది శ్రీ సర్వశాస్త్ర విశారదుడైన శ్రీకాశినాథకృత**
**జాతకలగ్న చంద్రికలో షడ్గ్రహ యోగనామక అష్టమపరిచ్ఛేదము - 8**

--- oOo ---

# నవమ పరిచ్ఛేదము - 9

## నాభసయోగము

**లగ్నాత్సప్తమ పర్యన్తైర్గ్రహైః సర్వైః శుభాశుభైః**
**క్రమేణ సంస్థితైః ప్రోక్తో యోగో నౌకాభిధో బుధైః 1**

లగ్నము నుండి సప్తమ గృహము వరకు ఏకాంతరముగా (ఒకటి వదిలి ఒకటిగా) శుభాశుభ గ్రహములున్న పండితులు దీనిని నౌకాయోగమందురు.

**నౌకాయోగ ఫలము :**

**అన్యోపజీవ విధవో బహ్వాయుః ఖ్యాతకీర్తిమాన్**
**కృపణో మలినో లుబ్ధో నౌయోగే చఞ్చలోనరః 2**

నైకా యోగములోనుత్పన్నమైన వ్యక్తి ఇతరుల కొరకు జీవితాంతము పనిచేయువాడు, అధిక ఆయువు కలవాడు ప్రసిద్ధుడు యశస్వి, కృపణుడు (బీదవాడు) మలినుడు, లోభి చంచలుడగును.

**చతుర్థాత్కర్మ పర్యన్తైః క్రమేణ పతితైర్గ్రహైః**
**విఖ్యాతః కూటనామాఽసౌ యోగః ప్రోక్తో మనీషిభిః 3**

నాల్గవగృహము నుండి పదవ గృహము వరకు క్రమముగా గ్రహములున్న కూట యోగమని పండితులు తెలిపెదరు.

**కూట యోగఫలము :**

**మిథ్యావాదీ శఠః క్రూరః కితవో బన్ధుపాలకః**
**నిష్కిఞ్చనః శైలవాసీ కూటయోగే నరో భవేత్ 4**

కూట యోగములోనుత్పన్నమైన మనుష్యుడు అబద్ధములాడువాడు మూర్ఖుడు, క్రూరుడు, మోసగాడు, బంధువులను పాలించువాడు దరిద్రుడు, పర్వతములందు నివసంచువాడగును.

**ఛత్రియోగము**

**సప్తమాల్లగ్న పర్యన్తైః ఖేటైః సర్వైః శుభాశుభైః**
**ఛత్రయోగః సమాఖ్యాతో బ్రహ్మరుద్రాదిభిః సురైః 5**

సప్తమ గృహము నుండి లగ్నము వరకు శుభాశుభ గ్రహములున్న బ్రహ్మరుద్రాది దేవతలద్వారా ఛత్ర యోగమని తెలుపబడెను

**ఛత్రయోగఫలము :**

**ప్రకృష్టధీర్దయాలుశ్చ దీర్ఘాయుః స్వజనాశ్రయః**
**వయసి ప్రథమేఽన్త్యే చ సుఖీ ఛత్రప్రియో నరః 6**

ఛత్ర యోగములో జన్మించిన మనుష్యుడు బుద్ధిమంతుడు దయాళువు అధిక ఆయువు కలవాడు సోదరులకు ఆశ్రయము కలిగించువాడు బాల్యవస్థ వృద్ధావస్థలలో ఛత్రధారుడైన మనుష్యుడగును.

**కార్ముఖ యోగము**

**దశమాచ్చ చతుర్థాన్తైర్గగనేన్ద్రైః శుభాశుభైః**
**కార్ముకాఖ్యః సమాఖ్యాతో యోగోఽసౌ పణ్డితోత్తమైః** **7**

దశమగృహము నుండి చతుర్ధ గృహము వరకు శుభాశుభగ్రహములున్న కార్ముక యోగమని పండితోత్తములు తెల్పిరి.

**కార్ముఖ యోగఫలము**

**వయోమధ్యే భాగ్యహీనో గుప్తిపాలో వనే రతః**
**మిధ్యావాదీ చ చౌరశ్చ కార్ముకే జాయతే నరః** **8**

కార్ముఖ యోగములో జన్మించిన మనుష్యుడు భాగ్యహీనుడు కారాగార రక్షకుడు. వనములందుండు వాడు. అబద్ధములాడువాడు దొంగయగును.

**వజ్ర పద్మయవ యోగఫలములు**

**లగ్నాస్తయోర్గ్రహైః సౌమ్యః పాపైశ్చ సుఖకర్మగైః**
**వజ్రః స్యాద్విపరీతైశ్చ యవః పద్మం చ మిశ్రితైః** **9**

లగ్నములో సప్తమ గృహములో శుభగ్రహములు నాల్గవ పదవ గృహములలో పాపగ్రహములున్న వజ్ర యోగమగును దీనికి వ్యతిరేకముగానున్న యవయోగము, పాపశుభగ్రహములు కలిసియున్న పద్మయోగము.

**వజ్రయోగఫలము**

**సుఖీ చ శుభగః శూరో మధ్యే భాగ్యేన వర్జితః**
**నిఃస్నేహశ్చ విరుద్ధశ్చ వజ్రయోగేఖలోనరః** **10**

వజ్రయోగములో సుఖి, సౌభాగ్యవంతుడు, శూరుడు, మధ్య వయస్సులో భాగ్యహీనుడు, స్నేహరహితుడు, వ్యతిరేకమైన పనులు చేయువాడు, దుష్టుడగును.

**దాతా చ స్థిరచిత్తశ్చ వ్రతాది నియమైర్యుతః**
**మధ్యే సుఖార్థ పుత్రాఢ్యో యవయోగే జనోభవేత్** **11**

యవయోగములో జన్మంచిన మనుష్యుడు స్థిరమైన మనసుకలవాడు ప్రతాపి, నియమయుక్తుడు, మధ్య వయసులో సుఖపడువాడు, ద్రవ్యము పుత్రులతో కూడినవాడగును.

**పద్మయోగఫలము**

**స్థిరాయుర్దీర్ఘకీర్తిశ్చ కాన్తః శుభసుతైర్యుతః**
**భయోగుణమదైర్యుక్తః పద్మయోగే జనోభవేత్** **12**

పద్మయోగములో జన్మించిన మనుష్యుడు స్థిరమైన ఆయువు కలవాడు అధిక కీర్తిమంతుడు సుందరమైన స్త్రీ, మంచి పుత్రులతో కూడినవాడు గుణవంతుడు అభిమానవంతుడగును.

**శకటవిహంగ యోగములు :**

**లగ్నాద్ ద్వితీయగైః సర్వైర్గ్రహైర్వా పరికీర్తితాః**
**శకటం వాస్తలగ్నస్థైర్విహఙ్గః సుఖకర్మగైః** **13**

లగ్న ద్వితీయ గృహములలో గ్రహములున్న శకటయోగమగును. ఏడవ గృహములో లగ్నములో పదవగృహములో గ్రహములున్న విహంగ యోగమగును.

**శకట యోగఫలము :**

**నిపుణో నిధికార్యేషు స్థిరద్రవ్యః సుఖైర్యుతః**
**ప్రహృష్టముఖనేత్రశ్చ తృప్తోవాపి నరః సదా** **14**
**మూర్ఖః కుభార్యో రోగార్తః శకటప్రాప్తజీవికః**
**నిర్ద్రవ్యో బన్ధుహీనశ్చ శకటే జాయతేనరః**

శకట యోగములో పురుషుడు నిధికార్యములలో నిపుణుడు, స్థిరమైన ద్రవ్యము సుఖము కలవాడు, ప్రసన్నముఖము ప్రసన్నమైన నేత్రములు కలవాడు, ఎల్లపుడు తృప్తితోనుండువాడు, మూర్ఖుడు, కుత్సితమైన భార్యకలవాడు, రోగపీడితుడు, శకటముతో జీవించువాడు దరిద్రుడు సోదరులు లేనివాడగును.

**విహంగమ యోగఫలము**

**భ్రమణేఽతిరుచిర్హృష్టః సురతప్రాప్తజీవికః**
**నికృష్టః కలహప్రీతో విహఙ్గే మానవో భవేత్** **16**

విహంగయోగములో జన్మించిన మనుష్యుడు భ్రమణశీలుడు అధికమైన రుచికలవాడు ప్రసన్నుడు సురత క్రియలో జీవితమును నడుపువాడు నికృష్టుడు, జగడమునందు ప్రీతికలవాడగును.

**జలధి చక్రయోగము**

**కేన్ద్రస్థానాద్ ద్వితీయస్థైర్గ్రహైర్జలధిరుచ్యతే**
**కణ్టకేభ్యస్తృతీయస్థైశ్చక్రం సర్వైర్గ్రహైః స్మృతమ్** **17**

కేంద్రము నుండి ద్వితీయములో గ్రహములన్ని ఉన్న జలధియోగమగును కేంద్రము నుండి తృతీయములో గ్రహములన్ని ఉన్న చక్రయోగమగును.

**బహ్వర్థరత్నసమ్పన్నః పుత్రీ భోగీ జనప్రియః**
**సుశీలః స్థిరచిత్తశ్చ జలధౌ జాయతే నరః** **18**

జలధి యోగములో జన్మించిన పురుషుడు అధిక ద్రవ్యము కలవాడు రత్నములు కలవాడు పుత్రవంతుడు భోగవంతుడు, సర్వజనులకు ప్రియుడు సుశీలుడు స్థిరచిత్తము కలవాడగును.

**చక్రయోగఫలము**

**ప్రణతాశేషభూపాలః సంసేవితపదామ్బుజః**
**చక్రయోగే సముత్పన్నో మహారాజో నరో భవేత్ 19**

చక్ర యోగములో జన్మించిన పురుషుడు మహారాజగును అతని చరణ కమలముల సేవలో ప్రజలు నతమస్తకులైయుండును.

**హలయోగము, శృంగాటకయోగము**

**ధనస్థానే త్రికోణే చ గ్రహైః సర్వైర్హలం స్మృతమ్**
**లగ్నత్రికోణగైః ఖేటైః శృఙ్గాటకముదాహృతమ్ 20**

ద్వితీయ గృహములో, తొమ్మిదవ ఐదవ గృహములలో అన్ని గ్రహములున్న హలయోగమగును. లగ్నములో నవమ పంచమ గృహములలో అన్ని గ్రహములున్న శృంగాటక యోగమగును.

**హలయోగఫలము**

**బహ్వాశీ చ దరిద్రీ చ కర్షకో బన్ధువర్జితః**
**సోద్వేగో దుఃఖితః ప్రేష్యో హలయోగే జనో భవేత్ 21**

హలయోగములోనుత్పన్నమైన పురుషుడు అధికముగా భోజనము చేయువాడు దరిద్రుడు, వ్యవసాయదారుడు, బంధుజనులు లేనివాడు ఉద్వేగముకలవాడు, దుఃఖితుడు, దాసుడగును.

**శృంగాటక యోగఫలము**

**హాస్యే సుఖీ సుభార్యా చ నృపభీతః కలిప్రియః**
**ధనాఢ్యో యువతిప్రేష్యో యోగే శృఙ్గాటకే నరః 22**

శృంగాటక యోగములోనుత్పన్నమైన మనుష్యుడు నవ్వుతూ సుఖమును పొందువాడు. సుందరమైన స్త్రీ కలవాడు, రాజుచే భయపడువాడు. జగడములాడువాడు, ధనవంతుడు, యువతులకు దాసుడగును.

**యూప, బాణ, శక్తి, దండయోగములు**

**లగ్నమారభ్య కేన్ద్రభ్యో ద్వితీయస్థైశ్చతుర్గ్రహైః**
**యూపబాణౌ శక్తిదణ్డౌ చత్వారోఽమీ స్మృతా బుధైః 23**

లగ్నములో ద్వితీయ గృహములో నాలుగు గ్రహమున్న యూప యోగమగును. చతుర్థ, పంచమ గృహములలో నాలుగు గ్రహములున్న బాణయోగము, సప్తమ అష్టమ గృహములలో నాలుగు గ్రహములున్న శక్తి యోగము దశమ, ఏకాదశ గృహములలో నాలుగు గ్రహములున్న దండయోగమగును.

**యూప యోగఫలము :**

**ఆత్మరక్షారతస్త్యాగీ సుఖసత్యవ్రతైర్యుతః**
**వివిష్టో మన్త్రవాదీ చ యూపయోగే భవేన్నరః 24**

యూపయోగములో నుత్పన్నమైన మనుష్యుడు ఆత్మరక్షణ చేసుకొనువాడు, త్యాగి, సుధి, సత్యవ్రతములతో కూడియున్నవాడు శ్రేష్ఠుడు మంత్రవాదియగును.

**బాణయోగఫలము :**

**శరకర్తా దస్యుసేవీ మాంసాదో మృగబన్ధనః**
**హింసకః శిల్పకారీ చ శరయోగేనరో భవేత్ 25**

బాణయోగములో మనుష్యుడు బాణములను తయారుచేయువాడు, దొంగలకు సేవచేయువాడు, మాంసమును తినువాడు, మృగములను బంధించువాడు, హింసకుడు, శిల్పకారుడగును.

**శక్తియోగఫలము**

**చిరాయుర్యుద్ధరక్షశ్చ సుభగః సుస్థిరోఽలసః**
**నీచో దుఃఖీ దరిద్రశ్చ శక్తియోగే భవేన్నరః 26**

శక్తి యోగములోనుత్పన్నమైన మనుష్యుడు యుద్ధము చేయుటలో నిపుణుడు, సౌభాగ్యవంతుడు, సుస్థిరుడు, ఆలసి, నీచుడు, దుఃఖి, దరిద్రుడగును.

**దండయోగఫలము**

**నిఃస్వో నష్టసుతస్త్రీకో బన్ధుబాహ్యః సునిర్ఘృణః**
**నీచప్రేష్యోదుఃఖితశ్చ దణ్డయోగే నరోభవేత్ 27**

దండయోగములోనుత్పన్నమైనవాడు దరిద్రుడు, సుతులు స్త్రీ లేనివాడు, బంధువులతో దూరముగానుండువాడు సిగ్గులేనివాడు, నీచుడు, దాసుడు, దుఃఖితుడగును.

**అర్ధచంద్ర, గదా యోగములు :**

**కేన్ద్రాద్ ద్వితీయస్థానస్థైః సప్తఋక్షగతైర్గ్రహైః**
**అర్ధచన్ద్రో గదాయోగః కేన్ద్రాత్పార్శ్వద్వయాశ్రయైః 28**

కేంద్రము నుండి ద్వితీయ స్థానములో గ్రహములున్న అర్ధచంద్రయోగము కేంద్రమునకు సమపముననున్న రెండు గృహములలో గ్రహములున్న గదా యోగమగును.

**అర్ధచంద్రయోగఫలము :**

**బలీ రాజప్రియః కాన్తో హేమరత్నైరలంకృతః**
**అర్ధచన్ద్రే చమూనాథః సుభగో జాయతే జనః 29**

అర్ధ చంద్ర యోగములో మనుష్యుడు బలవంతుడు, రాజుకు ప్రియుడు సుందరుడు, సువర్ణ రత్నములతోనలంకరింపబడువాడు, సేనాపతి సౌభాగ్య వంతుడగును.

**గదాయోగఫలము :**

**శాస్త్రే యోగే ప్రవీణశ్చ సద్యోఽయుక్తార్థతత్పరః**
**యజ్వా ధనీ సుసమ్పన్నో గదాయోగోద్భవోనరః** **30**

గదా యోగములో జాతకుడు శాస్త్ర యోగములలో ప్రవీణుడు శీఘ్రముగా ప్రయోజనమును పొందువాడు. యజ్ఞములు చేయువాడు ధనవంతుడు, సంపన్నుడగును.

**గోల, యుగ, శూల, కేదార, పాశ, దామినీ, వీణా యోగములు**

**ఏకరాశిస్థితైర్లగ్నాద్ గ్రహైర్గోలోయుగః క్రమాత్**
**శూరకేదారపాశశ్చ దామినీవీణకాస్తథా** **31**

లగ్నము నుండి క్రమముగా ఒకే రాశిలో గ్రహములున్న గోల, యుగ శూల, కేదార, పాశ, దామినీ, వీణా యోగములగును. ఒకరాశిలో అన్ని గ్రహములున్న గోలయోగము, రెండు స్థానములలోనున్న యుగయోగము, మూడు స్థానములలోనున్న శూల, నాలుగు స్థానములలో నున్న కేదార, ఐదు స్థానములలోనున్న పాశము, ఆరు స్థానములలోనున్న దామినీ, ఏడుస్థానములలోనున్న వీణా యోగమగును.

**గోలయోగఫలము :**

**విద్యాహీనో ధనైర్హీనో మానహీఽనోతి దుఃఖితః**
**గోలయోగే సముత్పన్నో మలినో జాయతేనరః** **32**

గోల యోగములో పుట్టిన మనుష్యుడు విద్య, ధన, అభిమానములు లేనివాడు అతి దుఃఖితుడు మలినుడగును.

**యుగయోగఫలము :**

**పాఖణ్డభాగ్యో నిర్ద్రవ్యః పితృమాతృవివర్జితః**
**యుగయోగే ధర్మహీనో లోకనిన్ద్యోఽపిజాయతే** **33**

యుగయోగములో జన్మించిన మనుష్యుడు పాఖండుడు, ధనములేనివాడు మాతాపితలు లేనివాడు ధర్మహీనుడు, అందరిచే నిందింపబడువాడగును.

**శూలయోగఫలము :**

**తీక్ష్ణోఽలసో నిర్ధనశ్చ హింస్రః శూరో బహిష్కృతః**
**సంగ్రామిలబ్ధశబ్దశ్చ శూలయోగో జనో భవేత్** **34**

శూలయోగములో మనుష్యుడు తీక్ష్ణస్వభావము కలవాడు పనులుచేయుటయందాసక్తిలేనివాడు, ధనహీనుడు, హింసకుడు, శూరుడు, బంధవులచే బయటికిపంపబడినవాడు, సంగ్రామములో పేరు కలిగినవాడగును.

**కేదార యోగఫలము :**

**కృషౌ రతః సత్యవాదీ స్వబాహువిహితోదయః**
**ధనీసుఖీ చఞ్చలాత్మా కేదారోత్థో నరో భవేత్** **35**

కేదార యోగములో మనుష్యుడు వ్యవసాయము చేయువాడు, సత్యవాది తన కష్టముతో జీవించువాడు, ధని, సుఖి చంచలస్వభావము కలవాడగును.

**పాశయోగఫలము :**

**కార్యే దక్షః ప్రపఞ్చీ చ బహుభాషీ చ బన్ధుభాక్**
**విశీలో బహులక్ష్మీకః పాశే భృత్యయుతో జనః** **36**

పాశయోగములో మనుష్యుడు నిపుణుడు సంసారి జీవనములో పడినవాడు, అధికముగా మాట్లాడువాడు, సోదరులను పోషించువాడు, శీలరహితుడు, అధిక లక్ష్మికలవాడు సేవకులు కలవాడగును.

**దామినీ యోగఫలము :**

**ఉపకారీ ధనీమూఢః పశుపుత్ర సమృద్ధివాన్**
**దామినీ యోగసమ్భూతో రత్నైర్భవతి పూరితః** **37**

దామినీ యోగములో జన్మించిన పురుషుడు ధని, మూర్ఖుడు, పశుప్రవృత్తి కలవాడు పుత్ర సమృద్ధి కలవాడు రత్నములతో కూడినవాడగును.

**వీణాయోగఫలము :**

**నృత్యగీతప్రియో నేతా బహుభృత్యో ధనీ సుఖీ**
**కార్యేషు నిపుణో లోకే వీణాయోగే చ జాయతే** **38**

వీణా యోగములో పురుషుడు నాట్య గానములందాసక్తి కలవాడు నాయకుడు, అధికముగా సేవకులున్నవాడు, ధని, సుఖి, కార్యములు చేయుటలో సమర్ధుడగును.

**నల, ముసల, రజ్జుయోగములు :**

**ద్విస్వభావే స్థిరే ఖేటశ్చరే చ సకలైః స్థితైః**
**నలోఉథ ముసలో రజ్జుర్యోగాః ప్రోక్తాః పురాతనైః** **39**

ద్విస్వభావ లగ్నములో అన్ని గ్రహములున్న నలయోగము, స్థిర లగ్నములో అన్ని గ్రహములున్న ముసలయోగము, చరలగ్నములో గ్రహములన్నియున్న రజ్జుయోగమగును.

**నలయోగఫలము :**

**న్యూనాతిరిక్తదేహశ్చ నిపుణో ధనసఞ్చయీ**
**బన్ధుప్రియః సురూపశ్చ నలయోగే భవేన్నరః** **40**

నలయోగములోనుత్పన్నమైన మనుష్యుడు తక్కువ లేక అధికముగా అంగములు కలవాడు నిపుణుడు, ధనమును సంగ్రహించువాడు, బంధువులు గౌరవించువాడు రూపవంతుడగును.

**ముసల యోగఫలము :**

**రాజమాన్యో ధనైర్యుక్తః ఖ్యాతః పుత్రీనృపప్రియః**
**ముసలే స్థిరచిత్తశ్చ కర్మోద్యుక్తశ్చ జాయతే** **41**

ముసల యోగములో మనుష్యుడు రాజులచే గౌరవింపబడువాడు ధని, పసిద్ధుడు, పుత్రవంతుడు, రాజుకు ప్రియుడు, స్థిరమైన మనసు కలవాడు పనులు చేయించుటయందాసక్తి కలవాడగును.

**రజ్జుయోగఫలము :**

**పరదేశే ద్రవ్యభాగీ సురూపో దానతత్పరః**
**క్రూరః ఖలస్వభావశ్చ రజ్జుయోగే జనోభవేత్** **42**

రజ్జు యోగములో మనుష్యుడు పరదేశములో ద్రవ్యమును పొందువాడు రూపవంతుడు, దానతత్పరుడు క్రూరుడు, దుష్ట స్వభావము కలవాడగును.

**మాల, సర్ప యోగములు :**

**కేన్ద్ర స్థానేషు సర్వేషు శుభైః సర్వైశ్చ సంస్థితైః**
**మాలాయోగః సర్వపాపైః సర్పయోగః ప్రకీర్తితః** **43**

అన్ని కేంద్ర స్థానములలో సంపూర్ణ శుభగ్రహములున్న మాలాయోగమగును, పాపగ్రహములున్న సర్పయోగమగును.

**మాలాయోగఫలము :**

**వస్త్ర వాహనభోగాద్యైర్యుక్తః కాన్తాసుహృత్ప్రియః**
**మాలాయోగే సముత్పన్నైః సుఖీ భవతి సర్వదా** **44**

మాలాయోగములో మనుష్యుడు వస్త్రములు, వాహనములు భోగములతో కూడినవాడు స్త్రీలు మిత్రులకు ప్రియుడు ఎల్లప్పుడు సుఖమును పొందువాడగును.

**సర్పయోగఫలము :**

**క్రూరో నిఃస్వో దుఃఖితశ్చ పరాన్నే నిరతః సదా**
**దీనశ్చ విషమో లోకే సర్పయోగే ప్రజాయతే** **45**

సర్పయోగములో జన్మించిన మనుష్యుడు దరిద్రుడు, దుఃఖితుడు ఎల్లప్పుడు ఇతరుల అన్నమును భుజించువాడు కుటిలమనస్తత్వము కలవాడగును.

**వర్షాధాన్యాది విశ్వాజ్ఞాన ప్రకారము**

**శాకం వహ్నిగుణం కృత్వా సప్తభిర్భాగమాహరేత్**
**శేషం నేత్రగుణం కృత్వా పఞ్చ పఞ్చ నియోజయేత్** **1**
**లబ్ధం వహ్నిగుణం కృత్వా ధాన్యాదిః సప్తభాగతః**
**శూన్యే పఞ్చైవ విజ్ఞేయాః సర్వమేవం నిరూపయేత్** **2**

**వర్షా ధాన్యం తృణం శీతముష్ణం వాయుశ్చ వృద్ధయః**
**క్షయశ్చ విగ్రహశ్చైవ జ్ఞేయమేవం క్రమేణ చ** **3**

శకమును మూడుచే గుణించి ఏడుచే భాగించిన వచ్చు శేషమును రెట్టింపు చేసి ఐదు కలపవలెను. (వచ్చిన సంఖ్య వర్షము యొక్క విశ్వాయగును) మరల వచ్చిన లబ్ధమును మూడుచే గుణించి ఏడుచే భాగించిన శేషము శూన్యము వచ్చిన దానికి ఐదును జోడించగా వచ్చిన సంఖ్య ధాన్యమునకు విశ్వాయగును. ఇదే విధముగా మాటిమాటికిచేసి తృణాదులను నిరూపించవలెను. ఆ విధముగా చేసిన వర్షము ధాన్యము, తృణము, శాతము, తేజము (అగ్ని) వాయువు, వృద్ధి క్షయము విగ్రహము విశ్వములుగా గ్రహించవలెను.

**ఉదాహరము :**

శక సం॥ము 1895 ను మూడుచే గుణించిన 5445 అగును. ఏడుచే భాగించిన 777 లబ్ధమగును శేషము 6 వచ్చును దానిని 2చే గుణించిన 12 వచ్చును. ఐదు కలపిన 17 వచ్చును. ఈ విధముగా వచ్చిన ఆ సంవత్సరములో వర్షము 17 విశ్వాయగును. తర్వాత 777 ను మూడుచే గుణించి ఏడుచే భాగించిన శేషము శూన్యము వచ్చును దానికి 5 జోడించిన ధాన్య విశ్వాయగును ఇదే విధముగా లబ్దమును మూడురెట్లు చేసి ఏడుచే భాగించగ వచ్చిన శేషమును రెట్టింపు చేసి ఐదు కలపిన తృణాది విశ్వాయగును.

**ఆవర్తాదిమేఘ జ్ఞానప్రకారము :**

**శాకం శక్రగుణం కృత్వా భాగో వేదైర్విధీయతే**
**శేషేమేఘా భవన్తీహ చావర్తాద్యా యథాక్రమమ్** **4**

శకమును పద్నాలుగుచే గుణించి నాలుగుచే భాగించిన వచ్చు శేషమును ఆవర్తాది క్రమములో మేఘముగా తేలిసికొనవలెను.

**మేఘఫలము :**

**ఆవర్తే చిన్తితావృష్టిః సమావర్తే సుశోభనా**
**పుష్కరే దుష్కరా వృష్టిర్ద్రోణే వర్షతి సర్వదా** **5**

ఒకటి శేషము వచ్చిన ఆ వర్త మేఘములో అనుమానిత వర్షము, రెండు మిగిలిన సమావర్తమేఘములో శుభవర్షము, మూడు మిగిలిన పుష్కర మేఘములో వర్షము దుర్లభము - శూన్యము మిగిలిన ద్రోణమేఘములో ఎప్పుడు వర్షము కురియును.

**అనుపాత క్రమము :**

**దశభిర్వర్షైర్మాసో మాసచతుష్కేణ లభ్యతే దివసః**
**దివసద్వయేన ఘటికా ఘటికాయుగ్మేన ఫలమేకం తు** **6**

పది వర్షములులో ఒక నెల మిగిలిన, నాలుగు నెలలలో ఒకదినము, రెండు దినములలో ఒక ఘడియ రెండు ఘడియలలో ఒక పలము మిగులును ఇది అనుపాతమగును.

**వింశోత్తరీ దశాజ్ఞానము**

**ధ్రువాఙ్కో దశభిర్గుణ్యో భానునా త్రింశతాపి చ**
**షడ్భిశ్చైరం హరేద్భాగం దశా సూర్యాదితో భవేత్ 7**

ధ్రువాంకమును పదిచే గుణించవలెను. తర్వాత పన్నెండుచే గుణించి ముప్పధిచే గుణించవలెను అప్పుడు ఆరుతో భాగించిన వచ్చిన లబ్ధమును క్రమానుసారము సూర్యాదుల దశలుగా గ్రహించవలెను.

**వింశోత్తరీదశావర్షము**

**అదిత్యత్రిగుణో రాహుః సూర్యచన్ద్రయుతో గురుః**
**ఆదిత్యద్విగుణం భౌమే మేలయిత్వా శనిర్భవేత్ 8**

సూర్యునికి మూడు రెట్లు (18 వర్షము) రాహువుకి దశావర్షములగును సూర్యచంద్రులను కలిపిన (16 వర్షములు) గురువునకుండును. సూర్యుని రెట్టింపు చేసి కుజుని వర్షముల కలిపిన శని, దశా సంవత్సరములు (19 సం॥లు) వచ్చును.

**చన్ద్ర భౌమౌ బుధోజ్ఞేయః కేతుశ్చ మఙ్గలో యథా**
**చన్ద్రమాద్విగుణః శుక్రో దశచక్రముదాహృతమ్ 9**

చంద్ర, కుజుల యోగము సమానముగా (17 వర్షములు) బుధునికి, కేతు దశ కుజ సమానముగా (7 వర్షములు) చంద్రునికి రెట్టింపు (20 వర్షములు) శుక్ర దశలోనుండును ఈ విధముగా దశాచక్రమును తెలిసికొనవలెను.

**దశాభక్తి భోగ్యవిచారము :**

**భయాతఘట్యో గుణితాః స్వవర్షై**
**రాప్తా భభోగైః శరదోఽవశిష్టమ్**
**హన్యాత్తు సూర్యేణ తథైవ మాసం**
**తథా ఖరామేణ దినాని శేషాత్ 10**
**తథైవ ఘట్యా ఘటితాః పలాని**
**విశోధయేదాయుషి తత్ర శేషమ్**
**ఆయుర్దశాభిశ్చ దశాహతా చే**
**దన్తర్దశాస్యాద్దశభిశ్చ భాగైః 11**

ఏ నక్షత్రములో జన్మించునో, దాని పూర్వ నక్షత్ర ఘడియలను అరవైచే తగ్గించి వచ్చిన దానికి ఇష్ట కాలమును కలుపవలెను. జన్మనక్షత్ర ఘడియలకు అరవై ఘడియలు తగ్గించగా వచ్చిన వాటితో జోడించిన భభోగముగును. భభోగమును

నక్షత్రాధీశుని వర్షములతో గుణించవలెను. తర్వాత భ భోగఘడియతో దానిని భాగించవలెను. వచ్చిన అంకమును వర్షములుగా భావించవలెను. శేషముగా వచ్చిన వాటిని పన్నెండుచే గుణించి భభోగముతో భాగించిన మాసము, తిరిగి ముప్పదిచే గుణించి భభోగముతో భాగించిన దినములు వచ్చును. శేషమును 60 చే గుణించి భభోగముతో భాగించిన ఘడియలు వచ్చును. శేషమును 60 చే గుణించి భభోగముతో భాగించిన వచ్చిన లబ్దము ఫలమగును ఈ విధముగా భుక్తభోగ్య దశలను తెలిసికొనవలెను. భోగ్యదశ నుండి ఏ దశను చూడవలెనో ఆ గ్రహ దశచే గుణించి దశచే భాగించిన వచ్చిన లబ్దముతో మాసాదులు గ్రహించవలెను.

**ఉచ్ఛస్థ రవి ఫలము**

**పూర్ణో ధనైః పరిజనైః సుతదారకేశై**
**శ్చణ్డ ప్రతాపనికరై ర్విజితారిసఙ్ఘః**
**కోపాకులో నిజజనైః పరిపూర్ణమాన**
**స్తుఙ్గస్థితే దినకరే భవతీహ లోకః** 12

ఉచ్ఛ సూర్యుని దశలో ధనము, పరిజన పుత్ర స్త్రీలతో పరిపూర్ణ స్థితి ఉగ్రప్రతాపముతో శత్రువులను జయించుట, కోపముతో వ్యాకులపాటు, తన సోదరులతో పరిపూర్ణమైన ప్రేమ భావము మనుష్యునకు కలగును.

**ఉచ్ఛస్థ చంద్ర బలము**

**దాతా భోక్తా ప్రచురయువతీనాయకో విశ్వబన్ధు**
**ర్నానా క్రీడాపరిణత మతిశ్చఞ్చలాత్మ స్వభావః**
**పుత్రైః పౌత్రైర్హయగజరథైః పూర్ణగేహోవిలాసీ**
**చన్ద్రే తుఙ్గే భవతి మనుజో లోకమాన్యః ప్రసన్నః** 13

చంద్రుడు, ఉచ్ఛలోనున్న మనుష్యుడు దాని, భోగి, అనేక మంది స్త్రీలకు భర్త, అనేక మంది బంధువులు, క్రీడలందాసక్తి, చంచలస్వభావము పుత్రపౌత్రులు గజములు హశ్వములు రథములు కలిగియుండుట విలాస జీవితము. లోకములో గౌరవమును పొందును.

**ఉచ్ఛస్థ కుజఫలము :**

**చణ్డప్రతాప వశితాఖిలభూమిపాలః**
**శస్త్ర ప్రహారనిపుణో ధనధాన్యపూర్ణః**
**తుఙ్గస్థితే క్షితిసుతే మనుజః ప్రయాతో** 14

కుజుడుచ్ఛలోనున్నపుడు మానవుడు ప్రతాపముతో రాజులందరిని వంశమునందుంచుకొనువాడు, శస్త్ర ప్రహారములో నిపుణుడు, ధనభాగ్యములతో

పరిపూర్ణమైనవాడు, అధికరక్తము కలవాడు రణభూమిలో అందరికన్న ముందుండువాడు ప్రతాపవంతుడగును.

**ఉచ్చస్థ బుధఫలము :**

**అధ్యాపకః శుభమతిర్నృపతిర్ధనాఢ్యో**
**లోకోత్తరాతి విభవో గుణవానుదారః**
**సత్కీర్తిమాన్ సుతనయో నిరుజః సుమిత్ర**
**స్తుఙ్గే బుధే భవతి సర్వజనోపకారీ** **15**

బుధుడుచ్చలోనున్న మనుష్యుడు మంచి బుద్ధికలవాడు, రాజు, ధని, లోకములో ఐశ్వర్యమధికముగా గలవాడు, గుణవంతుడు, ఉదారుడు, మంచికీర్తి గలవాడు సుందరమైన పుత్రులు కలవాడు రోగరహితుడు, మంచి మిత్రులు కలవాడగును.

**ఉచ్చస్థ గురుఫలము :**

**భూమణ్డలీపతిరుదారమతిశ్చ దాతా**
**బ్రహ్మాత్మబోధవిమలో బహుపుత్రపౌత్రః**
**తీర్థానురాగహృదయో దృఢదేహబన్ధు**
**స్తుఙ్గే గురౌ నరపతిర్ధనవానుదారః** **16**

గురుడుచ్చలోనున్న మనుష్యుడు భూమండలమునకు స్వామి, ఉదారమైన బుద్ధికలవాడు, దాని, బ్రహ్మ విద్యను నేర్పుటలో సమర్థుడు, అనేక మంది పుత్రులు పౌత్రులు కలవాడు, తీర్థసేవనమందనురాగముకలవాడు, పుష్టియైన శరీరము కలవాడు బంధువులుకలవాడు ధనవంతుడు ఉదారమైన మనసుకలవాడగును.

**ఉచ్చస్థ శుక్రఫలము**

**దేశాధిపో దృఢమతిః సుతనుః సుమన్త్రీ**
**యోద్ధా సమస్తజనపాలనలబ్ధకీర్తిః**
**చౌరాది శాసనపరః సుకవిః సుబుద్ధి**
**స్తుఙ్గే కవౌ కులపతిర్మనుజోఽ తిహృష్టః** **17**

శుక్రడుచ్చలోనున్న మనుష్యుడు దేశమునకు స్వామి దృఢమైన బుద్ధికలవాడు, సుందరదేహముకలవాడు, మంచి మంత్రి, యోధుడు, అందరిని పాలించువాడు చోరాదులకు తగినదండమునిచ్చువాడు, మంచికవి, సుబుద్ధిమంతుడు, కులస్వామి అధికమైన ప్రసన్నగుణము కలవాడగును.

**ఉచ్చస్థ శనిఫలము**

**ఆసాగరం క్షితిపతిర్దృఢదేహబన్ధు**
**హింసారతో రణభువి ప్రథితప్రభావః**

**హస్త్యశ్వరత్నమణిభిః పరిపూర్ణగేహః**
**సూర్యాత్మజే భవతితుఙ్గగతే మనుష్యః** **18**

శని ఉచ్చలోనున్న మనుష్యుడు భూమికిరాజు, దృఢదేహముకలవాడు బంధువులు కలవాడు, హింసయందాసక్తి కలవాడు, రణభూమిలో అధికమైన ప్రభావమును చూపువాడు, గజములు అశ్వములు రత్నములతో పరిపూర్ణుడగును.

**మిథునస్థరాహుఫలము**

**భవతి ధరణిపాలో నీచజాతిః ప్రతాపీ**
**హయగజధనయుక్తో జ్ఞాతివర్గే విరక్తః**
**కుటిలమతిరనీతిర్భూరిభాణ్డారయుక్త**
**స్తమసి మిథునసంస్థే జాయతే మానవేన్ద్రః** **19**

మిథునరాశిలో రాహువున్న మనుష్యుడు పృధివికి స్వామి, నీచజాతి, ప్రతాపవంతుడు, హశ్వములు గజములతో కూడినవాడు, సోదరులన్న విరక్తి భావముకలవాడు, కుటిలబుద్ధికలవాడు, నీతిలేనివాడు, పెద్దధనాగారమున్నవాడు మనుష్యులలో శ్రేష్ఠుడగును.

**సూర్యాదుల పరమోచ్చాంశము**

**దశాంశేஉర్కః శశీత్ర్యంశే భౌమోஉష్టావింశకే తథా**
**బుధః పఞ్చదశాంశే చ పఞ్చమాంశే బృహస్పతిః** **20**
**సప్తవింశాంశకే శుక్రే వింశత్యంశే శనైశ్చరః**
**సైంహికేయశ్చ వింశాశే పరమోచ్చం ప్రకీర్తితమ్** **21**

పది అంశముల వరకు సూర్యుడు, మూడు అంశముల వరకు చంద్రుడు, పద్దెనిమిది అంశలవరకు కుజుడు, పదిహేను అంశలవరకు బుధుడు, ఐదు అంశలవరకు గురుడు, ఇరువది ఏడు అంశలవరకు శుక్రుడు, ఇరువది అంశలవరకు శని, ఇరువది అంశలవరకు రాహువు పరమోచ్చగాతెలిపెదరు.

**ఇతి శ్రీ సర్వశాస్త్ర విశారదశ్రీకాశినాథ కృతౌ జాతకలగ్న చన్ద్రికా సమాప్తా**

**ఇది శ్రీ సర్వశాస్త్ర విశారదుడైన శ్రీకాశీ నాథకృతమైన**
**జాతకలగ్న చంద్రిక సర్వము సమాప్తము.**

--- oOo ---

# వాస్తు - జ్యోతిష - ముహూర్త అద్భుత గ్రంథములు

జ్యోతిష విశారద - వాస్తు సమ్రాట్

డా॥ **ముదుండి విశ్వనాథరాజు** గారి

అద్భుతమైన ప్రామాణికమైన సశాస్త్రీయ గ్రంథములు

| గ్రంథముల పేర్లు | రూపాయలు |
|---|---|
| 1. విశ్వకర్మ ప్రకాశము (వచనం ) .............................. | 80 |
| 2. విశ్వకర్మ ప్రకాశము (శ్లోకము - వచనం ) ................. | 116 |
| 3. ప్రాచీన వాస్తు శాస్త్రాలు - ఆధునిక వాస్తు పరిశీలన (భారతదేశంలోనే మొట్టమొదటి పిహెచ్.డి గ్రంథం).......... | 250 |
| 4. నారద సంహిత ............................................. | 150 |
| 5. వాస్తురాజవల్లభం ............................................. | 60 |
| 6. మయమతం .................................................. | 80 |
| 7. బృహత్సంహిత ................................................ | 160 |
| 8. ముహూర్త చింతామణి ........................................ | 120 |
| 9. ముహూర్త మార్తండము ....................................... | 63 |
| 10. లఘుజాతకము .............................................. | 63 |
| 11. జాతకలంకారము ........................................... | 63 |
| 12. కృషి పరాశరము (వ్యవసాయక జ్యోతిష గ్రంథము) .......... | 80 |
| 13. కశ్యప జాతకం .............................................. | 80 |
| 14. రాజమార్తండము ............................................ | 200 |
| 15. విశ్వకర్మ వాస్తు శాస్త్రము ..................................... | 250 |
| 16. లగ్న చంద్రిక ................................................ | 80 |

ఈ పుస్తకాలు కావలిసిన వారు 9440945403 లో సంప్రదించండి.
ఏవైనా 10 పుస్తకాలు కొంటే 30 శాతం,
మొత్తం 16 పుస్తకాలు కొంటే 40 శాతం డిస్కౌంటు ఇవ్వబడును.
బుక్ షాపులకు, వ్యాపారులకు, పబ్లిషర్లకు ప్రత్యేక డిస్కౌంటు ఇవ్వబడును

## గ్రంథకర్త పరిచయం



జ్యోతిషవిశారద - వాస్తు సమ్రాట్

# డా॥ ముదుండి విశ్వనాథరాజు

జననం : 01.11.1952

జన్మస్థలం : పాలకోడేరు (మండలం) పశ్చిమగోదావరిజిల్లా.

విద్యార్హతలు : భాషా ప్రవీణ.ఎం.ఏ.తెలుగు, హిందీ, సంస్కృతం, ఎం.ఏ జ్యోతిషం.(యూనివర్సిటీలో ప్రథములుగా ఉత్తీర్ణత) జ్యోతిర్వాస్తు డిప్లొమ, కన్నడ భాషా డిప్లొమ.

అధ్యాపకత్వం : ప॥గో॥జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలల్లో 1976 నుండి 1982 వరకు తెలుగు భాషా బోధన (ప్రస్తుతం) నేషనల్ పోలీసు అకాడమీలో ఐ.పి.ఎస్ అధికారులకు తెలుగు కన్నడ భాషల బోధన.
తెలుగు యూనివర్సిటీ జ్యోతిష విభాగంలో వాస్తు, జ్యోతిషశాస్త్ర బోధన.

రచనలు : కాలేజీ విద్యార్థుల కొరకు తెలుగు వ్యాకరణం, ఇంగ్లీషు తెలుగు హింది భాషలలో డిక్షనరీలు, స్వబోధినులు, కన్నడ హింది ఇంగ్లీషు సంస్కృత భాషల అనువాదాలు మరియు వాస్తు, జ్యోతిష ముహూర్త గ్రంథములు.

అభిలాష : ప్రాచీన అధునిక వాస్తుల సమన్వయంతో భవన నిర్మాణ సలహాలను, జ్యోతిష శాస్త్ర ప్రయోజనాలను సామాన్యులకు కూడా అందజేయాలని.....